కీ. శే. కొప్పరాజు నరసింహకవి కృత

# శ్రీమత్త్రికూటాచలమాహాత్మ్యము

(కోటప్పకొండ స్థలపురాణము)

★

సంపాదకుఁడు, పరిష్కర్త:

విద్వాన్ భాగవతుల వేంకట సుబ్బారావు

ప్రధానాంధ్రాధ్యాపకులు

పురపాలకోన్నతపాఠశాల

నర్సరావుపేట

*1959*

# విషయసూచిక

## చిత్రపటములు

1. శ్రీ కొత్తూరు వేంకటేశ్వర్లుగారు
   చైర్మన్, నరసరావుపేట మున్సిపాలిటీ
2. విద్వాన్ భాగవతుల వేంకట సుబ్బారావు
   సంపాదకుడు, పరిష్కర్త
3. శ్రీమత్త్రికోటీశ్వరస్వామి
4. విష్ణుశిఖరము - బ్రహ్మశిఖరము - రుద్రశిఖరము
5. నూత్న కోటీశ్వరస్వామి దేవాలయము
6. గొల్లభామగుడి
7. పాలంకేశ్వరస్వామి
8. శివరాత్రి యుత్సవము
9. ఉత్సవసమయమున ప్రభలు



విద్వాన్ భాగవతుల వేంకట సుబ్బారావు
సంపాదకుడు, పరిష్కర్త.

# తొలిపలుకు

శ్రీమత్త్రికూటాచల క్షేత్రము :

'కోటప్పకొండ' అనబడు నీ క్షేత్రము గుంటూరుజిల్లాలోని నరసరావుపేట తాలూకాకు దక్షిణమున నేడు మైళ్ళదూరములోనున్నది. దీని చుట్టుకొలత 'అడుగు తక్కువ యామడ' యని వాడుక. కాని యాఱుమైళ్ళుండవచ్చును. దీని యెత్తు 1587 అ. లు. వైశాల్యము 1500 ఎకరములు. ఇప్పుడెల్లరును బూజించు కోటీశ్వర స్వామి దేవళము 600 అ. ల యెత్తునఁ గలదు. దీని కెగువభాగమున 'ప్రాఁత కోటప్ప గుడి' కలదు. ఓపిక గలవా రచటికి వెళ్ళివత్తురు.

సోపాన మార్గములు :

ఈ కొండ నెక్కుటకు మూఁడు సోపాన మార్గములు కలవు. (1) పూర్వము నరసరావుపేట రాజాగారి యొంటె లెక్కు పడకదారి. ఇది పైనిగల పాపనాశన స్వామి గుడికి క్రిందుగఁ బోవును. (2) ప్రస్తుత మందఱు నెక్కిపోవు దారి. దీనిని 120 ఏండ్ల క్రిందట నిప్పటి జమీందారుగారి ముత్తాతగారు కట్టించిరందురు. (3) రాధాకృష్ణ సోపాన మార్గము. రెండవదారికి కుడిప్రక్కను గలదు.

దొనలు :

ఇందు దైవనిర్మితము లయిన దొన లెన్నియో గలవు. ప్రస్తుత దేవాలయమున కెగువ నున్న యెనిమిది దొనలలో పెద్దవానియందు యాత్రికులు స్నానమాడుదురు. ప్రాఁత కోటప్ప గుడికిఁ బోవు త్రోవలో 'ఎద్దడుగు' అను దొన యన్వర్థసంజ్ఞతో నొప్పును. బసవేశ్వరుఁ డచ్చట తపస్సుచేసె నందురు. ఇంకను 'పుట్టచేతి దొన' — 'ఉబ్బలింగము దొన' మొదలగున వెన్నియో కలవు. ఇవి గాక ఋష్యాదులకు తపోయోగ్యములగు గుహ లెన్నియో గలవు.

త్రికూటాచల నామము :

ఈ పర్వత మే వంకనుండి చూచినను మూఁడు కూటములు (బోళ్ళు) గఁ గనుపట్టును. అదియే దీనికి 'త్రికూట' పర్వత మనియు, నిందుఁ గల దేవునికి

'త్రికూటేశ్వరుఁ' డనియు, నీ స్థల పురాణమునకు 'త్రికూటాచల మాహాత్మ్య' మనియుఁ బేరువచ్చుటకుఁ గారణమని తోఁచెడిని. కాని ఏ శాసనములలోను నిది త్రికూటాచలముగఁ బేర్కొనఁబడలేదు. ఇందలి శిఖరములను బ్రహ్మ, విష్ణు, రుద్ర శిఖరము లందురు.

'త్రికూట పర్వతము' గజేంద్రమోక్షణ స్థలమైనట్లు భాగవతమునఁ గలదు. అందలి కూటములను 'గాయత్రి, సావిత్రి, సరస్వతి' అందురు. అది రాజపుటానా లోని అజ్మీరున కేడుమైళ్ళలో పుష్కరక్షేత్ర మనఁ బరగుచున్నది.

ఇవిగాక 'త్రికూటాచల' మని మఱొక్కటి తిరునల్వేలిజిల్లాలో 'తెన్‌గాసి' స్టేషనుకు మూఁడు మైళ్ళలో తిరుకుత్తాలము నొద్దఁ గలదు. అందు తిరుకుత్తాలేశ్వరునియు, రాజరాజేశ్వరియు కోవెలలును, అగస్త్యాశ్రమమును, గొప్ప నీటి ధారలును గలవు.

శ్రీ కోటీశ్వరస్వామి క్షేత్రమే గజేంద్రమోక్షణ స్థానమని కొందఱందురు. అది సరిగాదనిపించుచున్నది.

'శ్రీ త్రికోటీశ్వరునికి క్రిష్ణదేవమహారాయల అనతిని ప్రధాని తిమ్మరుసయ్యం గారు దండంపెట్టి సమర్పించిన గ్రామం కొండకావూరు' అగ్రహారము సమీప మైనను, కొన్ని శాసనములలో 'కావూరి త్రికోటీశ్వర శ్రీ మహాదేవర' కని యున్నను ఎల్లమంద కోటీశ్వరుఁ డనియే ప్రజల వాడుక.

ఇచ్చట కొండపైని గల కోటీశ్వరాలయములో వెలనాటి గొంకరాజు మొదలగువారి నాఁటి దీప దాన శాసనములంబట్టి 840 సం. లకుఁ బూర్వమే యీ యాలయ ముండినట్లు తెలియుచున్నది.

శిఖరములు :

*రుద్రశిఖరము :* ప్రాఁత కోటీశ్వరుని స్థలము. ఇచ్చట నొక చిన్న గుడియు, లింగమును దాని కెదుట శిథిలావస్థలో నున్న దారుధ్వజమును గన్పట్టును. ఇచ్చటి నుండియే కోటీశ్వరుఁడు గొల్లభామ యింటికి దిగివచ్చుచు నడుమ నిల్చెనని చెప్పుదురు. దీని నిర్మాణ మనూహ్యము.

*బ్రహ్మశిఖరము :* ఇప్పు డందఱును బూజించు కోటీశ్వరాలయ ప్రదేశము.

*విష్ణుశిఖరము :* ఇచ్చట పాపవినాశనస్వామి గుడి గలదు. దీనినే గద్దల బోడందురు. దీని మహిమాతిశయము స్థల పురాణమునఁ జూడనగును.

## శ్రీ త్రికోటీశ్వరాలయము :

ఇందలి శాసనాదులను బట్టి 11 వ శతాబ్దమునాఁటికే యీ గుడి యున్నట్లు స్పష్టము. కాని యొక్క కథమాత్రము చెప్పుదురు. గురవయ్యపాలెం కాపురస్థులు గ్రంధెవారను వైశ్యులీ కొండపైకి కలపకొఱకు వెళ్ళఁగా హఠాత్తుగా పెద్దవాన గురిసి యొక సెలయేటిగుండ లంకెబిందెలు కొట్టుకొని వచ్చినట్లును, వారి కా రాత్రి కలలో కోటీశ్వరుడు యోగివలె నగపడి తనకు గుడి కట్టించుమని చెప్పఁగా వా ర ట్లొనర్చి రనియు పరంపరగాఁ జెప్పుదురు. దీనికెట్టియాధారములు గానరావు. ఇందుఁగల సాలంకయ్య యను భక్తుని చరిత్రమే యిట్లు చెప్పిరేమో! విమర్శనీయము. క్రమముగా నా గుడిని కొందఱు భక్తు లొక్కొక్కభాగము కట్టించుచు వచ్చిరి. అందు ముఖ్యులు మాదల శంభులింగమ్మ, సిద్ధుమల్లప్ప, మన గ్రంథకర్త నరసింగయ్య, తిరుమలరాజు మొదలగువారెందఱో గలరు. 'ఎందోమెంటుబోర్డు' వారి పరిపాలనకు వచ్చిననాఁటినుండి దేవాలయము సర్వవిధముల నుచ్చదశలోనికి వచ్చినది. ప్రజలకు వలయు సౌకర్యము లెన్నఁదగినవిగ నున్నవనవచ్చును.

## ఇతర దేవాలయములు :

కోటీశ్వరుని గుడికి దక్షిణమున గణనాథాలయము గలదు. పశ్చిమమున, నుత్తరమున సాలంకేశ్వర సంతాన కోటీశ్వర లింగములు గలవు. ఎడమవైపున దొనయొద్ద మార్కండేయ లింగము గలదు. దిగువ మెట్లవరుసప్రక్కను రామలింగేశ్వర లింగము గలదు. సోపానమార్గమున గొల్లభామ గుడి యున్నది.

సోపానమార్గమున ముందుగ బొచ్చుకోటీశ్వరునిగుడి గలదు. ఇందు మ్రొక్కుబడులవారు కేశఖండనము చేయించుకొందురు.

ఇంక కొండక్రింద ప్రసన్న కోటీశ్వరుడు, నీలకంఠేశ్వరస్వామి మొదలగు పేళ్లు గల గుళ్ళు పెక్కులు గలవు.

ఇచ్చట 'ఓంకారనది' ఓగేరు అను పేరుతో చేజెర్లలోని కపోతేశ్వరుని గుడిప్రక్కనుండి ప్రవహించి యీ కొండకు సమీపముగా వెడలి సముద్రమున గలియుచున్నది. మఱియు శ్రీ త్రికోటీశ్వరస్వామి కర్పించిన భూముల వైనమును, కోనేళ్ళు, బావులు, సత్రములు వానికి సంబంధించిన శాసనముల వివరములును కీ. శే. మద్దులపల్లి గురుబ్రహ్మముగారి త్రికోటీశ్వర చరిత్రము (వచనము) నఁ దెలియనగును.

కొండపైని స్వామివారి సన్నిధి నర్చకులతోఁబాటు భక్తులుకూడ ప్రదక్షిణాది సేవలొనర్చి కృతార్థులగుచున్నారు. ఇప్పటికి నఖండ దీపారాధన పూజాదికములు జరుగుచున్నవి. ప్రతి మాఘ శు॥ ౧ నుండి మాసాంతముదాఁక ప్రజలు పశువులతో గిరిప్రదక్షిణము చేసి స్వామిని సేవించి, పలువిధములయిన మ్రొక్కుబడులు తీర్చుకొందురు. దేశదేశములనుండి సుమారు రెండులక్షల ప్రజ లీ యొక్కనాఁటి యుత్సవమునఁ బాల్గొందురు. సంకల్పము లేనివారికిని శివరాత్ర్యుత్సవ సమయమునకు నిర్నిమిత్తముగ భక్త్యుద్రేకము గలిగి తత్క్షణము బయలుదేఱి వెళ్లుట యిందలి ప్రత్యేకమహిమ యనుటలో నతిశయోక్తి రవంతయులేదు. శివరాత్రినాఁటి యుత్సవమును, రకరకముల ప్రభలను, వాద్యములను, జనబాహుళ్యమును జూడని వాని జన్మము వ్యర్థమనియే చెప్పవచ్చును.

### స్థలపురాణరచనలు :

ఈ స్థలమునకు యుగాంతరములనుండి మహిమ యున్నట్లు చెప్పుదురు. దీని మాహాత్మ్యమును దెలిపికొనుటకు (i) కీ. శే. బ్ర॥ కొప్పరాజు నరసింహకవి గారు వ్రాసిన 'శ్రీమత్త్రికూటాచల మాహాత్మ్య' మను మూడాశ్వాసముల పద్య కావ్యము (ప్రకృత గ్రంథము) ముఖ్యాధారము.

(ii) మఱియు క్రీ శ. 1905 లో రూపెనగుంట సీతారామయ్యగారు గుమ్మెట కథ (రగడ) మత్సవాదులు వర్ణించుచు వ్రాసిరి.

(iii) డెబ్బదియేండ్ల క్రిందట బ్ర॥ తుమ్మూరి మాధవరాయఁడుగారీ కథను కుంచించి 'మనఃకాంతాముక్తికాంతాసంవాద' మని 12 చరణముల కీర్తన వ్రాసిరి.

(iv) 1922 లో కీ. శే. బ్ర॥ తాడేపల్లి వేంకటప్పయ్య శాస్త్రిచే రచింపబడిన 'శ్రీ కాకాని మల్లీశ్వర మాహాత్మ్యము'లో సుమారు 11 పేజీల కథను శ్రీ కోటీశ్వర మాహాత్మ్యమని వ్రాసిరి. అది దేనినిబట్టి వ్రాసిరో తెలియదు. కథాభాగము వేఱు.

### ప్రకృత గ్రంథకర్త :

ఈ గ్రంథకర్త నివాసస్థలము సత్తెనపల్లి తాలూకా కోసూరు. గ్రంథమునం దీయబడిన వంశావళినిబట్టి యీ కవీంద్రుని వంశవృక్ష మీ ప్రక్కపుటలో నొసఁగఁ బడినది. ఆదిపురుషుఁడైన కొప్పరాజునామమే వీరి గృహనామముగ నేర్పడుట వలన నాయన ప్రసిద్ధపురుషుఁడై యుండనోపు.




ఈ కవి క్రీ. శ. ౧౮౫౨ (శా. శ. ౧౭౭౪) విరోధికృత్ సం. మాఘ బ ౧౪ లు సోమవారమునాడు శివరాత్ర్యుత్సవమునకు సకుటుంబముగ శ్రీ త్రికోటీశ్వరుని సన్నిధానమునకు బోయి, యుపవాసాదులుసల్పి, యుత్సవమునుగాంచి నివ్వెఱ

పడి యంతటి తిరునాళ్ళు జరుగుటకుఁ గల కారణ మచ్చటి విప్రోత్తముల నడిగి, వారెఱుఁగ మన మఱునాఁడింటికి ప్రయాణమై వచ్చుచుండెను. త్రోవలో శ్రీశైల ప్రాంత వాసియైన ముదిగొండ కేదారలింగమను ఆరాధ్యబ్రాహ్మణుఁ డెదురుపడెను. కవి యా విప్రునికి నమస్కరించి తన కోర్కె వెల్లడించెను. తోడనే యాతడు "ఇది శివుఁడు దక్షిణామూర్త్యవతారంబునఁ బండ్రెండేండ్ల వటుఁడై సమస్త బ్రహ్మర్షి దేవర్షులకు బ్రహ్మోపదేశ మొనర్చిన పుణ్యక్షేత్రము. ఈ విషయము చిదంబర నటన తంత్రమునఁ గలదు, సంపాదించి చూడుఁడు. బహు ప్రసిద్ధమైనది" అనివెడలిపోయెను. అంతఁ గవి దాని నెట్లో సంతరించి శ్రీ దక్షిణామూర్తి స్వామికిఁ గృతిగ మూఁడాశ్వాసముల పద్యకావ్యమును వ్రాసెను. ఇందు కథాభాగ మతిస్వల్పము. భక్తి స్తోత్రాదులు, వర్ణనలు విస్తారముగ వ్రాయఁబడెను.

ఈయన వేదాంతకవి. పరమ భక్తుఁడు. ఉభయభాషాభిజ్ఞుఁడు. శివపూజా ధురంధరుఁడు. తపస్సంపన్నుడు. శిష్యపరంపరలో నీయన కిప్పటికి నారాధన సాగుచున్నదని చెప్పుదురు. నరసింహకవి కొందఱు శిష్యులతో శ్రీ కోటీశ్వరుని సన్నిధానమున నుండి కోవెల బాగుచేయించునప్పు డొకనాఁ డాయన ప్రాఁతకోటయ్య గుడియొద్దఁగల పానవట్టమును విష్ణుశిఖరమందున్న పాపవినాశనస్వామి గుడికి తేఁదలంచి శిష్యులతోను కూలివాండ్రతోను ప్రయత్నించుచుండెనట. అచ్చటికొక రెడ్డి వచ్చి 'మీరందఱొకవైపున, నే నొక్కఁడ నొకవైపున నెత్తుకొని పోవుద'మని వారినొప్పించి యెత్త నతనివైపు భారములేన వారు తమ యసమర్థతకుఁ జింతించి మఱునాఁటికి వాయిదా వేసిరి. ప్రక్కకుఁబోయి రెడ్డి మాయమయ్యెనఁట! ఎల్లరు నాఁటి రాత్రి కోటీశ్వరాలయమున నిద్రించుచుండఁగా నర్ధరాత్రివేళ నరసింగయ్యగారు వెలుపలికివచ్చి యెవరితోనో రహస్యాలాపము లాడుచుండుట పల్నాటి గురవయ్య యను శిష్యుఁడెఱింగి లేచి మెల్లన బైటికేఁగి, యావలనున్న వ్యక్తిని గానక మఱలివచ్చి పరుండి తెల్లవాఱినపిదప విషయమడుగఁగా గురులు "నాయనా! అదిదేవరహస్యము, నీవెఱుఁగఁజాలవు. పానవట్టమును గుడియొద్దకుఁ జేర్చితినని యొక దివ్యపురుషుఁడు చెప్పిపోయె" ననిరఁట. ఆ పిమ్మట నరసింగయ్యగారు తన కార్యక్రమమును నెఱవేర్చుకొని ధన్యులయిరని చెప్పుదురు. ఈ చరిత్ర మెంతయు ప్రశంసనీయము. లోకమున మహాత్ములశక్తిని కొలుచుటకు సాధనము లేదుగదా !!

*ఈ కవి యితర గ్రంథములు :* (1) మహాకవులెవ్వరుఁ దలపెట్టని సూత సంహిత నీ మహాకవి యాంధ్రీకరించెను. దీనిని కీ. శే. బ్ర. శ్రీ జానపాటి

పట్టాభిరామశాస్త్రిగారు పరిష్కరించి ముద్రించిరి. (') మల్హణసూక్తి సంగ్రహము. (3) పుష్పదంతోదిత స్తవము. (పుష్పదంతుని మహిమ్న స్తవము) (4) ప్రదోష పూజామాహాత్మ్యము మొ. వి. ఇవి యలభ్యములు.

**పురాణ కథావిధానము :**

ప్రజలీ క్షేత్రస్వామినిగూర్చి వాడుకగఁ జెప్పుకొను కథను ముందు క్లుప్తముగఁ దెలిసికొని గ్రంథస్థ కథాభాగమును పిదపఁ దెలిసికొందము. కలియుగాదిని కొందఱు జంగమయ్యలు శివధ్యాన తత్పరులై కాశికిఁబోవ నమకట్టి నడుమ నడుమ మకాములు చేసికొనుచుఁ బోవుచుండిరఁట. ఈ త్రికూటాచలక్షేత్ర మిఁక పది పదునైదుమైళ్ళ దూరములో నున్నదనఁగా నొక లింగధారి—అపర శంకరుఁడన నొప్పు నాతఁ డా గుంపునఁ గలిసి వారికి దివ్యబోధలు సేయుచు వెంటనంటెనఁట. దానికి వారెల్ల రాశ్చర్యనిమగ్నులై యా సమీప గ్రామమునం దొక బసవని సంపాదించి దానిపై నాతని గూర్చుండ నేర్పఱచి భజించుచు, మహిమలఁ జాటుచు నీ క్షేత్రమునకు వచ్చిరఁట. వెంటనే యాజంగమయ్య వారితో—'భక్తులారా! నే నీ త్రికుటాచలమును వీడఁజాలను, చూచివత్తును. మీరిందేయుండుఁ'డని బసవనితోఁ గూడఁ బైకెక్కెనఁట. రెండుమూన్నాళ్ళకును వానిరాక గానక మిగిలినవారు తలకొక దిక్కున కొండను బ్రాఁకి వెదుకఁగా వెదుకఁగా నొక్కచో నాతని రూపము తళుక్కున మెఱపు మెఱసినట్లయి లింగమొకటి యబ్బురముగ గన్పించి, నాఁటి రాత్రి వారి కొక యోగిరూపమున దర్శనమిచ్చి ధన్యులఁ జేసినట్లు చెప్పుదురు. తదాదిగా దీనికి త్రికూటాచలక్షేత్రమనియు, లింగమునకు త్రికోటీశ్వరస్వామి యనియు నామములేర్పడి భక్తులు తరించుచున్నట్లు చెప్పుదురు. అయ్యాదిలింగమే రుద్రశిఖరమునఁగల ప్రాఁత కోటీశ్వరస్వామి యందురు.

**గ్రంథస్థ కథావిధానము :**

శ్రీ మహాదేవుఁడు పరాశక్తితో కైలాసముననుండ పార్వతి శివునిగూర్చి 'దేవా! నీవు దక్షిణామూర్త్యవతారమున వసించిన శ్రీమత్త్రికూటాచలము మహాత్మ్యమును విన్పింపు' మని వేఁడెను. అప్పుడు శివుఁడిట్లు చెప్పదొరఁకొనెను

'పూర్వము బ్రహ్మమానస పుత్త్రుఁడగు దక్షుఁడు మేరు పర్వతమున శివునిగూర్చి గొప్ప తపమొనర్చి తత్ఫలితముగా ఆదిశక్తి కూతురును శివుఁ డల్లుఁడును నగునట్లుగ వరముఁ బడసి, యట్లకాఁగా వరగర్వంబునఁ గన్నుగాన

కుండెను. శివుఁడు 'భిక్షుకుఁడు, శ్మశానవాసి, నీచుఁడు, గౌరవహీనుఁ' డనియు, తాను కైలాసమున కేఁగినప్పు డమర్యాద గావించెననియు పరమ శివద్వేషియై వానిని బిలువకయే యజ్ఞమొకటి చేయ సంకల్పించి ప్రారంభించెను. బ్రహ్మాది దేవతలు, మహర్ష్యాదులు వచ్చిరి. నారదుఁ డావార్త శివున కెఱింగింప సతి, పతి వలదన్నను వినక గణపతితో నచ్చటికేఁగి స్వజనముచే నవమానితయై 'తండ్రీ! నీ సంబంధమగు తనవు విడుతును. నీకనర్థకమగుఁగాక' యని కాలి బొటనవ్రేలి గోట నేలరాయుచు యజ్ఞకుండమునఁబడి మాయమై పర్వతరాజునకుఁ గూతురై పుట్టెను. శివుఁడు దానినంతయు దివ్యదృష్టి నెఱిఁగి కోపించి చెమటనూడ్చి శిలపై జల్లెను. తోడనే ప్రళయకాల రుద్రాకృతితో వీరభద్రుఁ డుద్భవించి తండ్రియానతిఁ జని దక్షాధ్వరవాటమునఁ గలవారినెల్ల చిత్రవిచిత్రముగ హింసించి దక్షునిబట్టి శిరము ఖండించి హోమమొనర్చి యజ్ఞధ్వంస మొనర్చెను. వెంటనే దక్షునిసతి పతిభిక్షకోరి ప్రార్థించినఁ దలవంపులగునట్లు గొఱ్ఱెతలయుంచి బ్రతికించి వీర భద్రుఁడు శివునిజేరెను. పిదప శంకరుఁడు శాంతమూర్తియై తాను బంద్రెండేండ్ల బాలుఁడుగ మాఱి బ్రహ్మచర్యమున కైలాసంబున సప్తమావరణంబున సమాధి నిష్ఠుఁడై యుండెను.

రుద్రశిఖరము :

అయ్యెడ సనకసనందనాది బ్రహ్మర్షి సంఘంబును, బ్రహ్మాది దేవతలును, వాలఖిల్యాది యోగసిద్ధులు నా దక్షిణామూర్తిని జేరి మ్రొక్కి తమకు బ్రహ్మోప దేశముఁ జేయ వేఁడిరి. ఆతఁ డందుల కంగీకరించి యెల్లరఁ దోడ్కొని చని త్రికూటాద్రికి వచ్చి నిల్చెను. ఆ ప్రదేశమే ప్రాఁతకోటేశ్వరుని బోడు, రుద్ర శిఖరము. అందు శివుఁడు బిల్వవనాంతరమున బ్రహ్మాసనాసీనుఁడై యోగనిష్ఠుఁడై సర్వులకు మౌనముద్రచే బ్రహ్మోపదేశ మొనర్చెను. ఇయ్యది వటువగు దక్షిణామూర్తిక్షేత్ర మగుటచే కల్యాణోత్సవమును, ధ్వజము నీ ప్రదేశమున లేవు.

విష్ణుశిఖరము :

రుద్ర శిఖరమునకుఁ బ్రక్కనున్న శిఖరమున విష్ణుదేవుఁడు శివునిగూర్చి తపము సల్పి శివుని బ్రసన్నుని గావించుకొనెను. తోడనే దేవేంద్రాదు లచ్చటికి వచ్చి తాము దక్షాధ్వరంబున హవిర్భక్షణము సలిపిన దోషంబు దొలఁగునట్లు లింగ రూపమున నందు నిత్యము దర్శనంబీయఁ బ్రార్థించిరి. శివుఁ డప్పుడు చేతి త్రిశూ

లము నొక చక్రాతిపైఁ బొడిచెను. అచ్చట జల ముద్భవించెను. శివుఁడందు లింగరూపమున వెలసెను. ఆతఁడు వారి కందు స్నాన మొనర్చి తన్నారాధించి దోషవిముక్తులుకం డని చెప్పి మాయమయ్యెను. వా రట్లొనర్చి ధన్యులయిరి. నాఁటి నుండి యచ్చటి లింగమును పాపవినాశనేశ్వర లింగమనుట వాడుక. ప్రజలిందు తొలుదొల్త స్నానమాచరించి శివుని సేవించుట ముఖ్యమని పురాణస్థ విషయము. దీనినే గ్రద్దల బోడనియు, విష్ణుశిఖర మనియు నందురు.

బ్రహ్మశిఖరము :

రుద్ర శిఖరమునకుఁ గ్రిందుగా నైరృతిభాగమున బ్రహ్మ వసించి, జ్యోతి ర్లింగ మచ్చట లేకుండుటకుఁ జింతించి శివునిఁ గూర్చి ఘోర తపస్సు చేసెను, శివుఁడును బ్రత్యక్షమై బ్రహ్మకోర్కె చెల్లించుట కట్టులే వెలసెను. అదియే నేఁడు సర్వులు పూజించు నూత్న కోటీశ్వరలింగము. ఈ లింగమును స్థల పురాణమున వచ్చు సాలంకయ్య యను భక్తుఁడు ప్రతిష్ఠించినట్లు గలదు. ఇచ్చట శివుఁడు తాండవము సల్పుచుండును. దీనికి ఉత్తరమున సమీపస్థ గ్రామము 'ఎల్లమంద' లేక 'మునిమంద'. ఇందు మునులు గుంపుగా నివసించెడివారఁట. ఈ గ్రామ సంబంధముచే నీ దేవునికి 'ఎల్లమంద కోటీశ్వరుఁ' డని వాడుక యైనది. ఇందలి జ్యోతిర్లింగము లగోచరమైన కారణమున మనుష్యులు శిలాలింగముల నేర్పఱచి పూజించుచుంటిరి. వివరములు తెలియవు. ఇవి సురనర సేవ్యములై మోక్షప్రదము లగుచున్నవి. ఈ గిరి స్థలమున నిప్పటికి నొక సిద్ధుఁ డదృశ్య రూపమునఁ దిరుగు చుండునని చెప్పుచుందురు.

ఓంకార నది (ఓగేరు) :

దేహమునకు త్రికూట స్థానమందు ఓంకారము ప్రముఖమైనట్లు లీ త్రికూటాద్రికి దక్షిణముగ ఓంకారనది పాఱుచున్నది. ఇందు తైర్థికులు స్నానమాడి తీర్థశ్రాద్ధములొనర్చి దేవుని సేవించిన స్వర్గము కరతలామలకము.

పూర్వము శిబిచక్రవర్తి యను రాజు అగస్త్యోపదేశమున జగదేకదాతయై ఆర్తరక్షణ బిరుదాంకితుఁడై యుండెను. ఆతని దానశీలమును బరీక్షించుటకై ఇంద్రుఁడు శ్యేనమై, యగ్నిహోత్రునిఁ గపోతముగఁ జేసి వేటాడుచు వచ్చెను. ఆ కపోతము కిరాత రూపమున నున్న శివునిచేఁ బసి తప్పి శిబినిఁ జేరి శరణు

వేఁడెను. కిరాతుఁడు పక్షి నిమ్మనెను. శిబి 'నా శరీరము నుండి దాని యెత్తు మాంసమైన నిత్తుఁగావి పక్షి నీయ'ననెను. ఎట్టకేలకు కిరాతు డందుల కొప్పుకొనఁగా రాజు పక్షిని త్రాసున నుంచి దానియెత్తు మాంసము తన దేహమునుండి తఱిగి రెండవ వైపునఁ బెట్టసాగెను. ఎంతకును లాభములేక తలయందలి మెదడు నొక వైపు గోసిపెట్టిన నదియు నిష్ఫలమయ్యెను. రెండవ వైపునఁ గోయఁబోవ శివుఁడు మెచ్చి ప్రత్యక్షమై రాజు నతని కోరికపై తనయం దైక్యముగావించుకొనెను.

అంత శిబిచక్రవర్తి లింగరూపమై కపోతేశ్వరుఁడను పేర వెలసెను. ఇది గుంటూరు జిల్లా - నర్సరావుపేట తాలూకాలోని చేజర్ల గ్రామమునఁ గలదు. దీనినే దక్షిణకాశి యందురు. దేవాదులెల్ల నా లింగము నోంకారశబ్దమున నభిషేకించిన జలము భూగతమై లింగము క్రిందుగ వెల్వడి ఓంకార నది యన నొప్పెను.

సాలంకయ్య :

ఈ సాలంకయ్య కాలము తెలియదు. ఈతఁడు త్రికూటాద్రికి నుత్తరమునఁ గల ఎల్లమంద గ్రామమున లింగబలిజ కులమున నుద్భవించెను. ఈతఁడు గొప్ప శివభక్తుఁడు. ఇతనికి నల్గురు తమ్ములుండిరి. వారితో నీతఁ డడవికేఁగి కట్టెలేఱి యమ్ముకొని జీవించుచు, జంగమార్చన సేయుచుండెను.

అతఁడు రుద్రశిఖరమునఁ గల లింగము నర్చించి, యమిత ధనము నార్జించుచు, నిత్యము దాని నేమరక మెలఁగుచుండెను. తమ్ములతో నొకనాఁ డతఁడు పూలుతేర విష్ణుశిఖరమున కేఁగెను. అపుడు విపరీతమగు వర్షము గురిసెను. ఆ ధాటికి వారొక గుహఁ జేరియును ప్రాణములు నిలుపుకొనఁజాలక కోటీశ్వరుని శరణుజొచ్చిరి. కొంతవడికి వాన వెలిసెను. వారు శివుని దలంచుచు త్రోవఁబట్టి వడువ సెలయేటిచే భిన్నమైన యొక తిన్నెయందు ధనపుబిందె లభించెను. సాలంకయ్య దానిని శివప్రసాదమని గ్రహించి, స్వామి నారాధించి యింటికిఁ జని. సమస్త వైభవోపేతుఁడై జంగమారాధన వీడక కాలముఁ బుచ్చుచుండెను.

సాలంకయ్య యొక్కతఱి రుద్రశిఖరమునఁ బూజ గావింపుచుండ నక్కడ నొక జంగమయ్య ప్రత్యక్షమయ్యెను. అతఁడు వానిని పరశివునిగా మనోవాక్కాయ కర్మములఁ బూజించి తనయింటికి వచ్చి ధన్యుఁజేయఁగోరెను. అతడు వల్లెయని యింటికివచ్చి భక్తుఁడిచ్చు వేఱుపదార్థము లొల్లక క్షీరమాత్రాహారుఁడై కొన్నాళ్ళుండి యుండి యొక్కనాఁడు మాయమయ్యెను. సాలంకుఁడాతని విందునందు వెదకి వేసారి నిరాహారుఁడై యుండెను.

ఆనందవల్లి (గొల్లభామ) కథ :

ఇట్లుండ నీకొండకు దక్షిణమున 'కొండకావూ' రను గ్రామమున 'సునందుఁ'డను యాదవుఁడొకఁడుండెను. ఆతనిభార్య 'సుందరి'. ఆమె 'ఆనందవల్లి' యను పుత్త్రికం బడసి యఖిల భోగభాగ్యములఁ దులఁదూఁగుచుండెను. ఆ బాలిక దినదిన ప్రవర్ధమాన యగుచు సర్వకాల సర్వావస్థలయందును 'శివార్పణబుద్ధితో' సమస్త వ్రతదానము లొనర్చుచు విభూతి రుద్రాక్షలు దాల్చి చెలులతోఁ గొండనెక్కి శ్రీ కోటీశు నర్చించి వచ్చుచుండెను. తల్లిదండ్రు లా బాలిక న ట్లుండవలదని వారించిరి. ఎంతచెప్పిన నామె వినక వారికిఁ దగు వైరాగ్యబోధలొనర్చి తల్లి దండ్రులఁ గూడ శివభక్తులుగ మార్చివైచెను. ఒక్కనాఁ డా బాలిక శివరాత్ర్యుత్స వమున కేఁగి ఓంకారనదిని స్నానమాడి రుద్రశిఖరమున బిల్వవనాంతరమున దక్షిణామూర్తి స్వరూపమునసున్న శ్రీ (పాఁత) కోటీశ్వరుని బూజించి, యించు కంతసేపు నిమీలితనేత్రయై తిరిగి కన్నులు విచ్చినంతనే వెనుక సాలంకయ్యకు గన్పట్టి విందారగించిన జంగమయ్యరూపున నొక దివ్యపురుషుఁడు సాక్షాత్క రించెను. ఆనందవల్లి నిత్య మాతని కా పాపవినాశన ద్రోణికనుండి తీర్థము రుద్ర శిఖరమునకుఁ దెచ్చి యభిషేకించి క్షీరములొసంగి, తద్భుక్తశేషమును దాను భుజించుచు కాలముఁ గడపుచుండెను.

సాలంకయ్య కీ వృత్తాంతము తెలిసి వచ్చి యామెకుఁ గన్పట్టి పూజగొను జంగమయ్యకుఁ దన్నెఱింగింపఁ బ్రార్థించి నిత్య మామెకడకు వచ్చుచుఁ బోవు చుండెను. జంగమమూర్తి మౌనముద్ర దాల్చియుండుటవలనఁ గాఁబోలు నామెకు సమయము పొనుపడదయ్యెను. అంతలో గ్రీష్మర్తువు వచ్చెను. అప్పటికి నామె నిత్యనైమిత్తికాదిక్రియలలో లోప మేమాత్రము రానీక యాతని నర్చించుచుండెను. ఒక్కనాఁ డామె తీర్థఘటమును దెచ్చి వానికి సమీపమున డించి, మఱచివచ్చిన బిల్వదళములకై పోఁబోవ నొకకాకి యా ఘటముపై వ్రాలెను. కుండ బోర్లబడి నీరము నేలపాలయ్యెను. దాని కా ముగుద చింతిల్లి 'నేఁడు మొదలు వాయసములిటకు రాకుండుఁగాక' యని శపించెను. ఇయ్యది నేఁటికిని నిదర్శనమని యందురు. దీనినెల్లఁ జూచుచున్న జంగమయ్య 'ఆనందవల్లీ! బాలికవు. ఇంటనుండక నీవిట్లు శ్రమపడిన మావల్ల నీకు రాఁదగు సుఖము లేమి? నిష్ప్రయోజనము, ఇంటికేగుము' అనియెను. ఆమెయు దానికొల్లక యెప్పటియట్ల సేవింపుచుండెను.

అంత నా దివ్యపురుషుఁడు జ్ఞానోపదేశమున నామె తన పూజ మానునని యెంచి యట్లొనర్ప, నా బాల మిగుల భక్తి కలిగి వర్తింపుచుండెను. మఱియు

నామె 'స్వామీ! మీరు దైవస్వరూపులు. అందుపై గురువులరు. వీడిన గురుద్రోహ మగు' నని చెప్పుచు పిత్యార్చన మానకుండెను. అందుల కా సిద్ధపురుషుఁ డామె పడు శ్రమలనుండి తప్పింపఁ దలఁచి, ఒకనాఁడు తన యోగమాయచే నస్ఖలిత బ్రహ్మచారిణి యగు నామెకు మాయా గర్భమును గల్పించెను. నవమాసములు వచ్చి గర్భభరాలస యయ్యెను. అష్టకష్టముల కోర్చి యామె నిత్యవ్రతము మానకుండెను. దాని కా యోగపురుషుఁడు సంభ్రమాశ్చర్యములంది, 'తల్లీ! నీవింత శ్రమపడి యిచ్చటికి రానేల? నేనే నీ యింటికి వచ్చెదను. నీ వ్రతమచ్చటనే నెఱవేర్చుకొనుము. కాని నీవు వెనుదిరిగి చూడకుండఁ బొమ్ము. చూచితివో నే నందే విలచెదను' అని చెప్పి యొప్పించి ముందు గొల్లభామయు వెనుక ప్రళయధ్వనులు మ్రోఁగుచుండఁ దాను రుద్రశిఖరమునుండి బ్రహ్మశిఖరముదాఁక రాఁగా, నామె యా ఘోరధ్వనుల కోర్వలేక వెనుదిరిగి చూడఁగా నాతఁ డందేయుండి 'అబలా! ఇంక నేవిందే సమాధినిష్ఠఁ జెందెదను. వ్రతభంగమైనది' అని యా శిఖరమునఁ గల బిలముఁ జొచ్చెను అదియే నేటి నూత్న కోటీశ్వరాలయ స్థలము. గొల్లభామయు నందేయుండి యచటఁ బ్రసవించి కుమారుని గని, వ్రతభంగమునకుఁ గుమిలి యందే ప్రాయోపవేశ మొనర్ప నెంచి మౌనముద్రఁ దాల్చి, యోగమూని కనులు దెఱచునంతలో ప్రక్కనున్న కుమారుఁ డదృశ్యుఁ డయ్యెను. వెంటనే యామె యదియంతయు దివ్యపురుషుని మహిమగాఁ దలంచి జన్మము ధన్యమయ్యెనని యెంచి యచ్చటనే సమాధిఁ బూని శివైక్యముం జెందెను.

సాలంకయ్య చివరి కథ :

ఇచ్చట సాలంకయ్యయు నిత్యము గొల్లభామ యోగికి తన చరిత్రము విప్పించుట కవకాశము కలుగలేదని చెప్పుచు నుండియుండి నేఁడు గొల్లభామ కూడ కన్పింపమికి వేచివేచి వెదకుచు బ్రహ్మశిఖరమున నున్న గుహకడకు రాఁగా నందున్న దివ్యపురుషుఁడు 'నేను నీ యింట విందారగించినవాఁడను. శివుఁడను. గొల్లభామకువ్రత సమాప్తి జేసితిని. ఆమె శివైక్యానుసంధానముఁ జెందెను. నేవిందే యుందును. దీనిపై దేవళ మొందు గట్టించి త్రికోటీశ్వర లింగమును బ్రతిష్ఠించి పూజింపుము. ఉత్సవ దినమున ఓంకార నదీస్నానము జేసి, నన్నభిషేకించి, ఉపవాస జాగరణాదు లొనర్చి, ప్రభలు గట్టించి, వీరాంగాది వాద్యముల నన్నలరించి మఱునాఁ డన్నదాన మొనర్పుము. గొల్లభామ నా భక్తురాలు. త్రోవలో

నామెను దర్శించిన పిదప ప్రజలు నన్ను దర్శించున ట్లచ్చట గుడి గట్టించి విగ్రహమును బ్రతిష్ఠింపు' మని యానతిచ్చి, సాలంకయ్య కోరికపై శివైక్యాను సంధాన స్థితి నుపదేశించి మాయమయ్యెను.

అంత సాలంకయ్య భగవదాజ్ఞ కతిశయముగఁ గోవెలలు నిర్మించి యుత్స వాదుల జేయుచు కాలముఁ బుచ్చుచుండెను. అచ్చట స్వామికి కల్యాణోత్సవము లేకునికి చింతిల్లి శివునకుఁ బడమర నొక కోవెల గట్టి పార్వతిని బ్రతిష్ఠింపఁ బూనఁగనే ఆకాశవాణి "ఈ స్థలము బ్రహ్మచారి యగు దక్షిణామూర్తి క్షేత్రము. ఇందు కల్యాణము నెఱపఁదగ"దని చెప్పెను. అయిన నాతడు తన వాంఛాప్రాబల్య వశమునఁ బ్రతిష్ఠింపఁగా విగ్రహము మాయమయ్యెను. వెంటనే సాలంకయ్య విరక్తి గలిగి శివసాయుజ్యముం బొందెను. తమ్ములు ముగ్గురు నందే శివైక్యమందిరి. వానినే బ్రహ్మ, విష్ణు, మహేశ్వర లింగములని యందురు. సాలంకుఁడు సాలం కేశ్వరుఁడను పేరను, తత్ప్రతిష్ఠిత లింగము త్రికోటీశ్వరుఁడను పేరను వెలసిరి. కావున దీనిని పంచబ్రహ్మస్థానమని యనిరి. సమస్త దేవత లిందు జరుగు నిత్యోత్సవ మాసోత్సవ వర్షోత్సవములందుఁ బాల్గొందురని స్థలపురాణమునఁ గలదు.

## త్రికూటాచల మాహాత్మ్యము – ప్రచురణ కృషి :

ఏతత్పుణ్యశ్రావ్య కథా మధుర పదబంధ బంధురమగు నీ గ్రంథ మొకటి బహు శిథిలావస్థలో నా ప్రాణమిత్రులు కీ. శే. మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారి యొద్ద కెట్లో చేరినది. దానిని వారు భద్రముగ దాఁచియుంచి తదాధారముగ తెలుఁగువచనమున 1939 లో 'శ్రీ త్రికోటీశ్వర చరిత్రము' అను గ్రంథమును పెక్కు విషయములతో వ్రాసి ప్రచురించిరి. వీరికిఁ బూర్వ కవులనిన మహా ప్రేమ. అప్పుడప్పుడు మూలములో కొన్ని పద్యములను జదివి వినిపించుచుఁ గడు నివ్వెఱపడుచుఁ గవి బుద్ధి కుశలతకు జోహారు లిచ్చుచుండెడివారు. అప్పటికే యా పద్యములు గొన్ని యాద్యంతములు లేక, ఉన్నవానిలో ప్రత్యయ లోపమో, పదలోపమో, ఛందోలోపమో, భావలోపమో యేదో యొకటి గన్పట్టు చుండెడిది. అప్పుడప్పుడు మాటల సందర్భమున "నాకీ వయసున బుద్ధి పని చేయుటలేదు. దీనిని మీరు తీసికొనిపోయి పరిష్కరించి యేనాటికైన నచ్చు వేయింపుఁడు. లేదేని నావలె మీరుకూడ దాఁచియుంచుఁ"డని చెప్పుచువచ్చి, యొక నాఁడు దానిని వారు నాకొసంగిరి. ఆపిమ్మట కొద్దిరోజులకే వారు దివంగతులైరి.

నేను పది పంద్రెండేండ్లు దాని ప్రస్తావనయేలేక యొకసారి వేసవి సెలవులలోఁ జూడ నారంభించి యున్నంతవఱకు జాగ్రత్తగా నొక 'కాపీని' వ్రాసి దానిలో పవరణల కారంభించి యెట్లో సంవత్సరమున్నఱ కొక పద్ధతిలోనికిఁ దెచ్చితిని. ఒకనాఁడు దానిని మహానందముతోఁగొని నా కాశ్రయులైన నర్సరావుపేట జమీందారు మ. రా. రా. శ్రీ మల్రాజు వేంకట రామకృష్ణ కొండల్రావు బహద్దరు గారిని సమీపించి, గ్రంథ విషయము సర్వమును నివేదించి యెట్లయిన నచ్చొత్తింపఁగోరి కొంతభాగము చదివి వినిపించితిని. అప్పుడు వా రా ప్రాఁతప్రతిని, క్రొత్తప్రతిని జూచి సంతసించి 'మీరెంతశ్రమ యెట్లు పడితిరో' యనుచు, ఎండోమెంటు బోర్డువారికి సిఫార్సుచేసి కోటప్పకొండకు సంబంధించిన 'ఫండ్సు'నుండి మీకు వలసినంత ద్రవ్య మిప్పింతుమని వాగ్దానముచేసి నాదగ్గర నప్పుడప్పుడు 5, 6 అప్లికేషనులు తీసికొనిరి. కాని యెన్నాళ్ల కది యొక స్వరూపమునకు రాదయ్యెను. దాని కింకను మంచిరోజు రాలేదని తలంచితిని. పిమ్మట శిష్యుల నాశ్రయించినఁ గొదువయుండదను వెనుకటి మర్యాదతోఁ గొందఱి వెంటఁబడి మోసపడితిని. 'కాలాయ నమః' అనుకొంటిని. కొంతకాలము వితగఁ గడచెను. కడచిన కాలమునకు విలువగట్టి భగవంతునిపై భారముంచి యొకనాఁడు నరసరావుపేట మునిసిపల్ చైర్మన్ చిరంజీవి శ్రీ కొత్తూరి వెంకటేశ్వర్లను సమీపించి, పూర్వగాథ నివేదించి సాయము చేయఁగోరితిని. వెంటనే యాతఁడు—' వినయమతితో' "మన మిత్రులు పెక్కుమంది కలరు. మీ కోరిక తీర్తును. మీరు కించపడవల" దనెను. పూర్వకవుల గ్రంథములను పైకిఁ దెచ్చు నా యభిలాష యాతని సాదరవాక్యమున వర్ధిల్లి శ్రీ త్రికోటీశ్వరుని యనుగ్రహము లోకమునకే కల్గినట్లు పొంగిపోయితిని. 'శుభమస్తు' అని వెడలితిని. ఆతఁడే ఒక నాఁడు నన్ను బిలిపించి నాకుఁ దెలియకుండఁగ నాతఁడు వేయించిన చందాదారుల పట్టిక నిచ్చి 'ఇంతవఱ కయినది. మిగిలినది నాలుగైదురోజులు తిరిగి పూర్తిచేయుదము' అనెను. నే నప్పు డాతని యుత్సాహమునకును, కార్యదీక్షకును, పరోపకారపరాయణత్వమునకును, గుండె దిటవునకును, గురుభక్తికిని, వృద్ధోపసేవకు నబ్బురపడి, నా మిత్రులతో నతని గుణములను గొండాడితిని. చిన్నతనములోనే వానిని 'పురపాలక సంఘాధ్యక్షపదవి' వలచి వలపించినదనుటలో నాతని లోని సుగుణములే నిదానమని యా నాఁడు తలంచితిని. ప్రజలు - అందును శత్రువులైనవారు గూడ నాతని పరిపాలనా విధానములో వ్రేలుపెట్టి లోపమును చూపించినవారు లేకుండునట్లు పాలనకుఁగడంగి యచిరకాలముననే యాతఁడు పేరు

ప్రతిష్ఠలు గడించుట యెంతయుఁ బ్రశంసనీయము. నేనాతని శిష్యత్వము నేనాఁడో మఱచితిని. కాని గురుత్వమాత్ర మాతఁడు విస్మరించినవాఁడు కాఁడు. ఇంతకుఁ బరమేశ్వరుని యనుగ్రహ మీ విధమునఁ దోడయినది. నాలుగైదు నాళ్లలో వలసిన ధనము ప్రోగయినది. దాతలు గూడ ప్రయత్నమునకుఁ దగినటు లడుగుటతోనే 'లేదు-కాదు' అనకుండ నిచ్చిరి. ఈ గడ్డు రోజులలో నిది యొక విశేషము. ఈ కార్యక్రమములో నాకు శిష్యతుల్యులును పరమాప్తులునైన శ్రీ మారేపల్లి శ్రీరామమూర్తిగారు మాకు నిక్కార్యమున చేదోడు వాదోడుగాఁ దోడ్పడి గ్రంథము సమగ్ర రూపము దాల్చువఱకు దీక్షతో నిల్చిరి. ఇది శివానుగ్రహమని తలంతును. కార్యానుకూల్యమున కన్నియుఁ గలిసివచ్చునను పెద్దలమాట యనుభవైకవేద్యము గదా!

ఈ గ్రంథమునఁ బ్రచురించిన బొమ్మలు నాకుఁ బరమ మిత్రులును, నర్సరావుపేటఛాయాచిత్రశాలాధిపతులునగు బ్ర. వే. పళ్లె బిందుమాధవాచార్యులు గారు స్వయముగా కొండ దగ్గఱకు వెళ్లి ఫోటోలు తీసికొనివచ్చి సమయమున కుచితముగా నందించిరి. ఇది తలవనితలంపుగా జరిగిన విషయము.

వీరెల్లరి యాశయముల కెల్లప్పుడును పరమేశ్వరుఁడు 'శ్రీరామ రక్ష' యై శాశ్వతాయురారోగ్యైశ్వర్యముల నిచ్చి సర్వదా వీరిని, వీరి కుటుంబములను కాపాడుఁగాత మని ప్రార్థించుచున్నాను.

తమ ప్రపితామహులు రచించిన ఈ గ్రంథమును బ్రకటించుటకు సర్వాధికారములు నా కొసంగిన శ్రీ కొప్పరాజు వీరభద్రరావుగారి మహౌదార్యభరిత సారస్వతాభినివేశమునకు నా నమోవాకములు. పరమేశ్వరుఁడు వారికి చిరాయురైశ్వర్యములొసఁగి రక్షించుఁ గాక!

ఈ గ్రంథమును ముద్దులు మూటగట్టునట్లు ముద్రించి యిచ్చిన మదీయ సోదరులు, అజంతా ముద్రణాలయాధిపతులు, శతావధానులు, శ్రీ శ్రీనివాససోదరులకు మిక్కిలి కృతజ్ఞుఁడను.

—సంపాదకుఁడు

# మేలి పలుకు

శ్రీమ త్త్రికూటాచల మాహాత్మ్యమను నీ గ్రంథమును ఆమూలాగ్రముగాఁ జూచితిమి. రచయిత కొప్పరాజు నరసింహకవి గొప్ప శివభక్తుఁడు. శైవ వేదాంతము సరహస్యముగ నెఱింగినవాఁడగుటకు గ్రంథమంతయును - ముఖ్యముగా ద్వితీయాశ్వాసమును ప్రమాణము విషయమందలి యత్యంతాభినివేశముచే వ్రాసిన కావ్యమగుటచే కవిత యావేశపూరితము. తృతీయాశ్వాసమున 215 నుండి 223 వఱకు గల పద్యభాగ మందులకు నిదర్శనము. శివరాత్రి యుత్సవమును వర్ణించు ఘట్టము మఱియొక మేలుబంతి. రచన సర్వత్ర గంగా ప్రవాహమువలె సాగిపోయినది. తృతీయాశ్వాసములో 302 వ పద్యము కవి భావనాశక్తి కొక మేలి యుదాహరణము :

పైనున్న జనము లాపైన నిల్చినయట్టి
ప్రభలకుఁ గట్టు దర్పణములందు
క్రింది యుత్సవములఁ బొందుగా వీక్షించి
బహుళోత్సవంబు లీ పర్వతమునఁ
బరగుచున్నవటంచు భ్రాంతిచే భావించి
యందె నిల్చిరి; గిరిక్రింద జనులు
క్రిందటి ప్రభల వింపొందు నద్దములందు
కుధరంబుపై నుండు గుడిని గాంచి
ఇచటి భక్తులఁ బ్రోవఁ గోటీశ్వరుండు
పరగ గుడితోడఁ గ్రిందికి వచ్చె ననుచు
భ్రాంతి వీక్షించి యచటనే పాయకుందు
రద్భుతముగాదె యాచంద మరసిచూడ.

ప్రభలకు గట్టిన యద్దములను జూచి కవి చేసిన కల్పన గొప్పగా నున్నది. కొండపైని ప్రభల యద్దములలో కొండ క్రింది యుత్సవములు గాంచి కొండమీఁది జనులా యుత్సవము లచటనే జరుగుచున్నవని భ్రమించి యచ్చటనే యుండిరి. కొండక్రింది ప్రభల యద్దములలో పైనున్న దేవాలయములు మొదలగు దృశ్యములఁ గాంచి ప్రజలు తమ మీఁది యనుగ్రహమున కోటీశ్వరుఁడు తన యాలయములను గ్రిందికి దీసికొనివచ్చినట్లు భ్రమించి యచ్చోటు వాయకుండిరఁట! ఎంత చక్కని కల్పన! ఇంకను ఈ కవి కల్పనాచమత్కారమునకు తృతీయాశ్వాసమున 46, 49

మొదలగు పద్యములు చూడవచ్చును. అఖిల చ్ఛందోమయుఁడగు పరమేశ్వరుని దేవేంద్రునిచే వివిధ చ్ఛందోమయ స్తోత్రమున స్తుతింపఁజేసిన కవి యుచితజ్ఞత మెచ్చఁదగినది.

"తరుణి మాకు విరోధి నీ ధవుఁ, డతండు
ప్రేత భూత పిశాచ సత్ప్రియ సఖుండు
యజ్ఞభూమికి నరుదేఱ నర్హుఁడగునె?
అతని సతివౌట నీవు ననర్హ విపుడు."

ఇందు 'ఇపుడు' అను పదము మిక్కిలి భావగర్భితము. ఇట్లు పదములను సముచితముగ వాడిన పట్టులు పెక్కు గలవు.

ఈ పద్యమందలి ధారాశుద్ధిఁ జూడుఁడు :

కామ మెక్కువౌను కడియు నోటికిఁ బోదు
ధనమునందుఁ బ్రేమదగులు మిగుల
చిక్కువడుచునుండుఁ జింతల వంతల
ముదిమి మోక్ష సౌఖ్యమునకు తెరువె?

భక్తిరస భరితములైన యిట్టి సత్కావ్యములలో నెరసులు పరికించుట సరసుల పని కాదుగదా! ఇహపర సాధనమైన యిట్టి మంచి కావ్యమును వెలుఁగులోనికిఁ దెచ్చుటకై మిక్కిలి శ్రమపడి సఫలుఁడైన మా సోదరుఁడు విద్వాన్ భాగవతుల వేంకట సుబ్బారావును, అతనికిఁ దోడ్పడిన నరసరావుపేట నగరపాలికాధ్యక్షులు శ్రీ కొత్తూరి వేంకటేశ్వర్లుగారు మొదలగువారలకును మా హృదయపూర్వకాభివందనములు.

3-4-862 బర్కత్‌పూరా,
హైదరాబాదు.
31-8-1959.

శ్రీనివాస సోదరులు
శతావధానులు.

# చందాదారుల పట్టిక

| | | | |
|---|---|---|---|
| | మ. రా. రా. శ్రీ | నర్సరావుపేట | |
| 1. | ,, కొత్తూరి వేంకటేశ్వర్లుగారు<br>మ్యునిసిపల్ ఛైర్మన్ | ,, | 50-0-0 |
| 2. | ,, కటికినేని వేంకట శేషాచలపతిరావుగారు | ,, | 50-0-0 |
| 3. | ,, తుమ్మల రామకోటయ్యచౌదరిగారు | ,, | 58-0-0 |
| 4. | ,, పి. శౌరయ్య అండ్ సన్స్ | ,, | 35-0-0 |
| 5. | ,, కొత్త సత్యనారాయణగారు | ,, | 30-0-0 |
| 6. | ,, పి. రాధాకృష్ణమూర్తిగారు, డాక్టర్ | ,, | 30-0-0 |
| 7. | ,, చుండూరి సూర్యచంద్రరావు బ్రదర్స్ | ,, | 30-0-0 |
| 8. | ,, శాకమూరి సత్యనారాయణగారు | ,, | 25-0-0 |
| 9. | ,, చతుర్వేదుల సుబ్బయ్యగారు | ,, | 25-0-0 |
| 10. | శ్రీమతి జుజ్జూరు సీతారామమ్మగారు | ,, | 25-0-0 |
| 11. | మ. రా. రా. శ్రీ మండవ వెంకటరెడ్డి<br>అండ్ సన్ అండ్ కోవారు | ,, | 25-0-0 |
| 12. | ,, రెడ్డి వేంకట సుబ్బారావు అండ్ కంపెనీవారు | ,, | 25-0-0 |
| 13. | ,, నాగసరపు రామారావుగారు | ,, | 25-0-0 |
| 14. | ,, యం. నీలకంఠేశ్వరరావుగారు, ఏంజల్ టాకీసు | ,, | 25-0-0 |
| 15. | ,, ముత్తరాజు వేంకట కృష్ణమూర్తిగారు | ,, | 25-0-0 |
| 16. | ,, దోరడ్ల రాములు, కారంశెట్టి వెంకట్రామయ్యగార్లు | ,, | 25-0-0 |
| 17. | ,, వందనం వేంకట పుల్లారావు,<br>చిలకల రామసుబ్బారావుగార్లు | ,, | 25-0-0 |
| 18. | ,, సోము వేంకటేశ్వర్లు,<br>సత్యనారాయణ అండ్ కంపెనీవారు | ,, | 25-0-0 |
| 19. | ,, వంకాయల మల్లయ్యగారు | ,, | 25-0-0 |
| 20. | శ్రీమతి పులుపుల కనకమ్మగారు | ,, | 25-0-0 |
| 21. | మ. రా. రా. శ్రీ మీనా మస్తానయ్యగారు | ,, | 25-0-0 |
| 22. | ,, వడ్లమూడి సీతారామయ్యగారు | ,, | 20-0-0 |
| 23. | ,, యక్కల కనకయ్యగారు | ,, | 20-0-0 |

| | | | | |
|---|---|---|---|---|
| | మ. రా. రా. శ్రీ | | నర్సరావుపేట | |
| 24. | ,, | యన్. రామ అయ్యర్‌గారు | ,, | 20-0-0 |
| 25. | ,, | నల్లపాటి హనుమంతరావుగారు | ,, | 20-0-0 |
| 26. | ,, | పొట్టిమూర్తి సుబ్బారావుగారు | | 20-0-0 |
| 27. | ,, | శ్రీ తిరుపతి వేంకటేశ్వర జ్యూయలరీ కంపెనీవారు | ,, | 20-0-0 |
| 28. | శ్రీమతి | చిలకల అన్నపూర్ణమ్మగారు | ,, | 20-0-0 |
| 29. | మ. రా. రా. శ్రీ | యన్. యస్. దాదాసాహెబుగారు | ,, | 20-0-0 |
| 30. | ,, | కూనిశెట్టి పెద్దన్నగారు, వైస్‌ఛైర్మన్ | ,, | 20-0-0 |
| 31. | ,, | కొప్పురావూరి బాలకోటయ్యగారు | ,, | 20-0-0 |
| 32. | ,, | నాగసరపు చిన నారాయణగారు | ,, | 20-0-0 |
| 33. | ,, | రెడ్డి రామసుబ్బయ్యగారు, టింబర్ డిపో | ,, | 20-0-0 |
| 34. | ,, | జొన్నలగడ్డ శేషయ్య సన్ అండ్ గ్రాండ్‌సన్స్ టింబర్ డిపో | ,, | 20-0-0 |
| 35. | ,, | ఏతిరాల రంగనాయకులుగారు | ,, | 20-0-0 |
| 36. | ,, | కూరపాటి లక్ష్మీకోటయ్యగారు | ,, | 20-0-0 |
| 37. | ,, | పాల్వాది కాశయ్యగారు | ,, | 15-0-0 |
| 38. | ,, | ఇక్కుర్తి లక్ష్మీనారాయణగారు | ,, | 15-0-0 |
| 39. | ,, | రెంటాల లక్ష్మీప్రసాదరావుగారు | ,, | 10-0-0 |
| 40. | ,, | పొట్టి లక్ష్మీనారాయణగారు | ,, | 10-0-0 |
| 41. | ,, | జమ్ముల బాపయ్యగారు | ,, | 10-0-0 |
| 42. | ,, | దోగిపర్తి సత్యనారాయణ అండ్ చిన పుల్లయ్యగార్లు | ,, | 10-0-0 |
| 43. | ,, | బత్తుల వేంకటేశ్వర్లు అండ్ రాఘవరపు రామలింగంగార్లు | ,, | 10-0-0 |
| 44. | ,, | రవ్వారపు నరసింహారావుగారు | ,, | 10-0-0 |
| 45. | ,, | శిగినంశెట్టి మూలస్వాములు అండ్‌కోవారు | ,, | 10-0-0 |
| 46. | ,, | నడింపల్లి వెంకటప్పారావుగారు B. A., B. L. వకీలు | ,, | 10-0-0 |
| 47. | ,, | ఉడిపి రామకృష్ణ లంచ్ హోం వారు | ,, | 10-0-0 |
| 48. | ,, | కొత్త వెంకట నరసింహం, ఆయిల్‌వ్యాపారం | ,, | 10-0-0 |
| 49. | ,, | కూనిశెట్టి చినలక్ష్మణమహానంది, రెడ్డి వెంకయ్య అండ్ కంపెనీవారు | ,, | 10-0-0 |

| | | | | |
|---|---|---|---|---|
| | మ. రా. రా. శ్రీ | | నర్సరావుపేట | |
| 50. | ,, | స్వర్ణ రామిరెడ్డిగారు | ,, | 10-0-0 |
| 51. | ,, | వోబులశెట్టి మార్కండయ్య, కొత్తమాసు గురవయ్య అండ్ కంపెనీవారు | ,, | 10-0-0 |
| 52. | ,, | జొన్నలగడ్డ పున్నయ్యగారు | ,, | 10-0-0 |
| 53. | ,, | మండవ లక్ష్మికోటేశ్వరరావు, అండ్ బ్రదర్స్ కంపెనీవారు | ,, | 10-0-0 |
| 54. | ,, | పబ్బతి వెంకటేశ్వర్లుగారు | ,, | 10-0-0 |
| 55. | ,, | తొండపు వెంకటసుబ్బారావుగారు | ,, | 10-0-0 |
| 56. | ,, | ఆరె కృష్ణయ్యగారు, టీచరు | ,, | 10-0-0 |
| 57. | ,, | ఊటుకూరి శేషయ్యగారు | ,, | 5-0-0 |
| 58. | ,, | కందిపాటి హనుమయ్యగారు | ,, | 10-0-0 |
| 59. | ,, | గోపాలుని ప్రసాదరావుగారు | ,, | 10-0-0 |
| 60. | ,, | రాకెళ్ల వెంకటసుబ్బయ్యగారు (బస్ ఓనరు) | ,, | 10-0-0 |

ఓం

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

శ్రీ త్రికోటీశ్వరాయ నమః

# శ్రీమత్త్రికూటాచల మాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము

శ్రీమద్దివ్యవిభావటద్రుమ వితర్దిస్థాన సంస్థాయియై
వామాంకంబున బ్రహ్మవిద్య గిరిజావామాక్షి సేవింపఁగాఁ
బ్రేమన్ మౌనుల కాత్మదాయి యగు నా శ్రీదక్షిణామూర్తి స
ద్ధామ బ్రహ్మము నే భజింతుఁ బరమామోదంబు సంధిల్లఁగన్. 1

శ్రీశైలేంద్ర సరోజ భృంగము మహాసిద్ధావళీ మానస
క్లేశాస్తోకతమః పతంగము జగత్క్షేమంకరాపాంగమున్
పాశచ్ఛేది కథాప్రసంగము సుధా పాటీర డిండీర పా
శీ శుభ్రాంగము మల్లికార్జున మహాలింగంబు సేవించెదన్. 2

కాసర రక్తబీజ మధుకైటభ శుంభ నిశుంభ చండ ముం
డాసుర యోధయూథముల నాజి మదంబడఁగించి, విక్రమా
భ్యాసుని ఘోరదైత్య నరుణాసురుఁ గూల్చిగ శ్రీనగాన పీ
ఠాసనవాసియైన భ్రమరాంబ మదిష్టము లీవుగావుతన్. 3

తతపింఛచ్ఛవి శక్రచాపముగఁ జెంతన్ లక్ష్మి సౌదామినీ
లతికాకారతఁబూన వేణురవ గర్జారావ మొప్పన్ మహో
న్నతి భక్తావళి చాతకంబులకు నానందామృతాసార ము
ద్ధతి వర్షించెడి కృష్ణమేఘ మఘసంతాపంబు చల్లార్చెడిన్. 4

అటు లిటు లేమరించి శకులాద్యవతార విహారహారియై
యెటు జనునో విభుండనుచు నెప్పుడుఁ దద్ధృదయస్థలంబునన్
స్ఫుటగతి నిల్చి లోకములఁ బ్రోచెడి లక్ష్మి మదీయసద్మమం
దెటులు చలింప కుండుచు మదిష్టఫలంబుల నిచ్చు నెంతయున్. 5

వదన చతుష్టయంబునను వాణి చతుర్నిగమ స్వరూపయై
కదిసి వసింపఁగా సురనికాయము పాయక చుట్టుఁ గొల్వఁ ద
ద్విదులు సనందనాదులు నుతింపగఁ గొల్వొనరింపుచుండు నా
త్రిదశవరేణ్యుఁడైన విధి దీర్ఘతరాయువు మాకొసంగెడిన్. 6

వాణి పయోజపాణి మృదు వాగ్రచనా స్తుతి గీత సర్వ గీ
ర్వాణి సమస్త శాస్త్రవిసరాగమ వేద నుతోరు సద్గుణ
శ్రేణి విరించిరాణి యతసీ సుమ నీల మిళిందబృందరు
గ్వేణి మదీయ జిహ్వపయి వేడుకతో నటియించుఁగావుతన్. 7

నిజజన కాగ్రభాగమున నిల్చినవేళఁ దదీయ మూర్ధ వా
రిజ రిపుఖండముం గని పరిస్ఫుట మౌళి నదీజ పాండురాం
బుజమని యెంచి చూచి దృఢపుష్కరముంచి పెకల్పఁబూను న
గ్గజముఖుఁ డస్మదీయ మగు కార్యతతిన్ ఘటియించుగావుతన్. 8

వ్యాస మయూర బాణులను భారవి మల్హణ దండి కాళికా
దాసులఁ గొల్చి యాంధ్రకవితాఢ్యుల నన్నయఁ దిక్కయజ్వ ను
ద్భాసితుఁ బోతరాజు ఘను భాస్కరు సోమునిఁ బ్రస్తుతించి యు
ల్లాసముమీఱ నీ కృతి విలక్షణతన్ రచియింపఁ బూనితిన్. 9

వృత్త నియమంబు నీతిని నెడలఁబుచ్చి
తమ ప్రబంధ రతికి మెచ్చి ధనము మూర్ఖు
లొసఁగ సుఖియించి వేశ్యల యొప్పు దెప్పు
కుకవి సత్కావ్యములఁ జూడఁ గోరుబెట్లు? 10

అని యిష్టదేవతా వందనంబును సుకవిజనాభినందనంబును కుకవి నింద
నంబునుం గావించి శైవకథావిధాన బోధకంబగు నొక్క ప్రబంధంబు
రచియింపంబూని యేకాంత ధ్యానావధానంబున నున్న సమయంబున 11

అరుణారుణాంశు భాస్వర జటావళివాఁడు
స్ఫురదిందు ఖండశేఖరమువాఁడు
భసిత త్రిపుండ్రాంక ఫాలభాగమువాఁడు
కరుణా కటాక్ష వీక్షణమువాఁడు
నీల నీరదకాంతి కాలకంఠమువాఁడు
కటితటి శార్దూల పటమువాఁడు
వరదాభయమృగాగ్ని కరచతుష్కమువాఁడు
దక్షిణామూర్తియై తనరువాఁడు
శాశ్వతామృతదాయి కోటీశ్వరుండు
నాదు సన్నిధిఁ బొడసూపి నాకు నొక్క
స్థల పురాణంబు రచియింపఁ జాలు దీవు
నేయుమని యదృశ్యస్థితిఁ జెందుటయును. 12

అంతట నేను రచియింపంబూనిన యతిచమత్కృతిమత్కృతి యగు నీ కృతి
రత్నముఖంబునకుఁ దిలకాయమానంబగు మద్వంశావతారం బభివర్ణించెద.

## కవివంశావళి

ఏ మౌనిప్రవరుం డనంత నిగమధ్యేయాత్మవిద్యాతపః
సామర్థ్యంబున నీ ప్రపంచము సృజించన్ బెంచ మాయించ ను
ద్దామ ప్రక్రియ మించు బ్రహ్మహరిరుద్రాఖ్యాత పుత్త్రత్రయం
బామోదంబునఁ గన్నమేటి దగ నయ్యత్రిం బ్రశంసించెదన్. 14

తదాత్రేయ పవిత్ర గోత్రంబున 15

ఏ మంత్రి యలరారె నామంత్రి తారాతి
ఘనరమా సౌభాగ్య కలన వలన
నే ధన్యుఁ డిరవొందె ప్రాధాన్య సద్గుణ
వ్రాతాభిరామ ధర్మములవలన
నే శౌరి విలసిల్లె నీశోరు పదపద్మ
పూజావిధాన విస్ఫూర్తివలన
నే మహామహుఁ డొప్పె భూమిపాలకదత్త
లసదనేకాగ్రహారములవలన
నతఁడు నతజనపోషుఁ డంచిత విశేషుఁ
డతులితాకారుఁ డాశ్రిత హితవిచారుఁ
డలఘుచరితుండు సత్యదయావ్రతుండు
కులపయోధికి రేరాజు కొప్పరాజు. 16

అలఘుతరాస్మదీయ బహుళాన్వయ మెవ్వనిపేర నొప్పె న
ల్పలవదరాతి గంధగజ భంజన సింహుఁ డసహ్య విక్రమం
బలవడ కొప్పరాజు విశదాద్భుతతేజుఁ దనూజుఁ గాంచె స
ద్విలసిత నీతికోవిద విధేయుని వీరయ నామధేయునిన్. 17

వీరమరాజ కీర్తిముఖ విక్రమ భవ్యతరంగరాజముఁ
బోరన వైరిభోగి ఘనభోగములం గడు వ్రచ్చి ప్రోదినిఁ
భూరి దృఢాప్తిచే గెలిచెఁ బొందుగఁ దద్రిపుజానుగుప్త వి
స్తార సుభద్రధా వసుధ జాల హరించె విచిత్రవైఖరిఁ. (?) 18

ఆరమ్య గుణాస్పదుని కు
మారుఁడు సౌందర్యమునకు మారుఁడు శౌర్యో
దార కుమారుం డతిసుకు
మారుఁడు చినకొప్పరాజు మహి నొప్పారెఁ. 19

నిస్తుల వీరతా విస్తార సార లఘూ
కృతాఖిల కులక్షోణీధరుఁడు
సాతత్య దానధారాతతవాహినీ
పరిరంభకోత్సాహభరిత వార్ధి
శరదభ్ర విభ్రమ స్పద్యశః కర్పూర
పేటీ భవదజాండ కోటరుండు
హవ్యవాహార్పిత హవ్యతర్పిత ధాతృ
హరిహరా ఖండలాద్యమరవరుఁడు
నగుచు జిన కొప్పరాజొప్పు ననుపమేయుఁ
డురు గిరిక్షోణి నాయక గురుదయా ప్ర
లబ్ధ ఘోటక హాటక లలిత *ఛత్ర
చామరాందోళికాదిక సంపదలను. 20

అట్టి మహానుభావ జననాస్పదమై సుయశోభివృద్ధికిం
బట్టయి కొప్పరాజు సచివాగ్రణిపేరఁ బ్రసిద్ధిగాంచి యు
న్నట్టి తదీయవంశమున నద్భుత శైవరహస్యకోవిదుల్
పుట్టిరి మెట్ట వేంకటయ ముఖ్యు లనేకులు లోకమెన్నఁగఁ. 21

* సంధి చింత్యము

తదీయ పుత్త్ర పౌత్త్ర పరంపరాభివృద్ధియగు నిమ్మహావంశంబునందు, 22

రక్షించె నెవ్వాఁడు రాజీవజాన్వయ
సంజాత జనుల నాసక్తితోడ
శిక్షించె నెవ్వాఁడు శితశస్త్రధారచే
మత్త దుష్ట విరోధి మండలంబు
వీక్షించె నెవ్వాఁడు వెసఁ దల్లిమాఱుగా
నైజాంగనాన్య పంకేజముఖుల
ప్రోక్షించె నెవ్వాఁడు భూరిదయాసుధా
సారంబు దీనవ్రజంబుమీఁద
నతఁడు శ్రీ కొప్పరాజాన్వయాబ్ధి చంద్రుఁ
డనఁగ నుదయించెఁ గువలయావనవిధిజ్ఞుఁ
డైన వీరయ నామధేయాంక మంత్రి
మంత్రిమాత్రుండె భువనైకమాన్యుఁ డరయ. 23

ఆ వీరప్రవరుండు గాంచె సుతు భవ్యాకార సుశ్రీ యశః
శ్రీ విద్యా బల శౌర్య ధైర్య గుణవిస్తీర్ణ ప్రబోధావన
ప్రావీణ్యంబున నాత్మసన్నిభుని వీరామాత్య దీపంబు దీ
పావిర్భావము నొందఁజేయుగతి శైవాచారసంపన్నుఁడై. 24

ఆనరనుతుఁ డతనికి ది
జ్ఞానవతీ మౌళిభాగ మానిత సుయశః
సూనుఁడగు సూనుఁడై తగె
సూనాయుధు చక్కఁదనము శూన్యము గాఁగ౯. 25

హిమగిరి సేతుమధ్యమున నెల్లెడ నున్న ధరామరాళి క
త్యమిత వినూత్నరత్నములు నశ్వకలాప రథాగ్రహారముల్

సమద గజేంద్రబృందములుఁ జామరముల్ గడుఁబ్రీతి నిచ్చె స
ద్విమలత నెవ్వఁ డా విభుఁడు వీరయమంత్రి జనుల్ నుతింపఁగన్. 26

వీరయమంత్రికి గుణవతి
గౌరమ్మకు నుదయమయ్యె గౌరీపతికిన్
గౌరికిఁ గుమారుఁడుంబలె
శ్రీరంగ విభుండు శంభుసేవాపరుఁడై. 27

భూరిప్రతాప దీప వి
దూరీకృత గర్వ తిమిర దుష్టారి మహా
వీర మకుటోరు మణి ఘృణి
తారుణ్య విరాజితాంఘ్రితలుఁడై యలరెన్. 28

అంబుజగర్భసన్నిభ మహోద్భుతతేజుఁడు రంగమంత్రి కృ
ష్ణాంబికయందు బుత్త్రుల విశాలచరిత్రుల హర్షపాత్రులన్
శంబరవైరిరూప సదృశామలగాత్రుల బద్మనేత్రులన్
సాంబశివార్చనానియమ చారు పవిత్రులఁ గాంచె నేవురన్. 29

వారెవ్వరంటేని, 30

దుష్టచిత్త సపత్న దుర్వార జీమూత
ఘోర మారుతసారి వీరశౌరి
హరిదబ్జలోచనా హారవల్లీకృత
విమలకీర్తివరుండు వీరవరుఁడు
సకల శాస్త్రపురాణ సారవేదాదికా
శేష విద్యా తంత్రి శేషమంత్రి
కల్యాణనగతుల్య గర్వాఢ్య సద్భోగ
మహిమ దేవవిభుండు మల్లవిభుఁడు

పత్రికోదార లేఖనమాత్ర ఘటిత
సకల దిగ్భ్రాజమాన రాజన్య శౌర్య
నిర్వహణ దివ్య పాండిత్య నీతిశాలి
మహితరుచిహేళి యన్నయామాత్యమౌళి. 31

వారిలోన— 32

సకలక్షోణిపతుల్ నుతింపఁగ శిలాస్తంభంబుపై 'నేలుచూ
రి' కడన్ వ్రాసిన యన్నపార్యుని సుకీర్తి స్వచ్ఛపద్యాళిఁ దా
రకలంకస్థితి రేపు మాపు నరసింహస్వామి పాదాబ్జ సే
వకు లేతెంచి సురల్ పఠింతు రొగి భావంబందు హర్షింపుచున్. 33

ఆ యన్నపార్యుఁ డలఘు స
హాయుఁ డనంతమ్మయందు హరి సిరియందున్
గాయజుఁ గన్న విధంబున
ధీయుతు నరసింహ నామధేయుం గనియెన్. 34

మిన్నున నున్న సౌరికరి మీఁదికి సింహములట్లు మీఱి య
త్యున్నత తారకాద్రిపయి నుజ్జ్వల శంబనిభప్రభావ సం
పన్నములై గడంగి భువి భవ్యరతి న్నుతిఁ గాంచె కొప్పరా
జన్నయ నారసింహ సచివాగ్రణి నవ్యయశోవిలాసముల్. 35

ధైర్యంబునకు మేరుధరము దీటనవచ్చు
వరధర్మగతియందు వంగకున్న
నలఘు గంభీరత నబ్ధి దీటనవచ్చు
నమిత భంగంబుల నందకున్న
దాతృత్వమున కంబుదంబు దీటనవచ్చు
జీవనస్ఫురణ గర్జింపకున్న

సత్కళామహిమకుఁ జంద్రు దీటనవచ్చు
తతకళంకము మేన దాల్పకున్న
ననుచుఁ గొనియాడుదురు మాళవాంగ వంగ
కుకురు కురు కాళ గాంధార కోసలాంధ్ర
పాండ్య కేరళ చోళ భూపాలసభల
నన్నయామాత్య నరసింహు ననుదినంబు. 36

జలజాస్త్ర బాణపంచకమని యనిశంబు
మత్తకాశినులెల్ల మదిఁ దలంపఁ
కల్పభూరుహపంచకంబని సతతంబు
యాచకావళులెల్ల నాశ్రయింప
శంకరు వక్త్రపంచకమని నిత్యంబు
శైవసంఘంబెల్ల సన్నుతింప
పద్మాక్షు నాయుధ పంచకంబని యెప్డు
ధృతిమాని రిపులెల్ల నతి భజింపఁ
వెలగు సుతపంచకంబు నృసింహమంత్రి
కాంచె సిరిపుర సత్కుల కలశవార్ధి
లక్ష్మి యన మించి విలసిల్లు లచ్చమాంబి
కా సతీరత్న మందు వికాసమొదవ. 37

దానానూనయశుండు వీరవరుఁ డుద్దామప్రభావుండు యో
గానందుం డనఘుండు గోప సచివాధ్యక్షుండు ధీశాలి ల
క్ష్మీనారాయణమంత్రి సద్గుణగణశ్రీకుం డనంతార్యుఁ డా
ర్యానందైక ధురీణు లేవురు సుధాహార్యోరు ధైర్యోన్నతుల్. 38

తత్క్రమంబున 39

రాజశ్రీమలరాజ సూరధరణీరాట్చంద్రుకార్యంబు ని
ర్వ్యాజప్రక్రియఁ జక్కఁజేయుచుఁ దదీ యామేయ సమ్యక్కృపా
రాజద్భాగ్యరమావిలాసములచే రంజిల్లె నే మంత్రి యా
తేజోధన్యుఁడు వీరయార్యుఁ డలరెన్ ధీమంతు లౌనౌననన్. 40

ఆ వీరేశ్వర సత్కృతేశ్వర సపర్యల్ చెప్పఁగా శక్యమే
భావింపంగ నతండొనర్చిన మహా భవ్యాభిషేకాంబువుల్
శ్రీవిస్తారతనిచ్చు పుష్పచయమున్ శ్రీశంకరుండెప్డు గం
గావారీందుకళాంశు దంభమున వేడ్కన్ మౌళిఁ దాల్చుం గడున్. 41

కైలాసగిరికూట కాఠిన్యగతిమాని
పురవైరి తన చిత్తమున వసింప
పంకజాతనివాస పారుష్య మెడలించి
శ్రీకాంత తనయింటఁ జెలువుచూప
వేధతోఁగూడిన విపరీతత నదల్చి
భారతి తనజిహ్వ బాదుకొనఁగ
సర్వభక్షకపదాసహ్యత విడనాడి
జ్వలనుండు తన మఖంబుల భుజింప
ప్రబలె నే మంత్రి యతఁడు దుర్మంత్రినికర
గర్వ దుర్వార తిమిర సంఘాతహరణ
తరణికిరణాభ వర మహాభరణ లలిత
మానశాలి యోగానంద మంత్రిమౌళి. 42

భూపాలాదరణీయ నిర్మలయశః స్ఫూర్త్యగ్ర గంగానదిన్
గోపాల ప్రభుఁడైన శౌరిక్రియ దాన్ శ్రీకరోద్యత్పదా
నౌపమ్యోద్భవగా నొనర్చి కడు బెంపొ రాజగోపాలు డా
గోపాలున్ నిరసించు సంభృతమహాగోత్రోరు భారస్థితిన్. 43

నానాశాస్త్రవచో విచారపరతన్ వాదించుచోఁ గీర సం
తానంబున్, వరశారికాప్రకట విద్యాసూక్తి, నిస్సంశయా
ధీనస్వాంతములై ముదం బెదల సంధిల్లంగ వర్తించు ల
క్ష్మీనారాయణ పండితోత్తముల సచ్ఛిష్యాగ్రహారంబులన్. 44

కణభుగ్వాగ్విభవంబుఁ గొల్లగొని సాక్షాదక్షపాదోక్త ల
క్షణ మెల్లన్ దనసొమ్ముఁ జేసికొని వ్యాసప్రోక్త భాషావళిన్
గణన ప్రాప్త సమస్త వర్ణచయముల్ గాఁగల్గి వర్తించి స
ద్గుణ రత్నాకరుఁడై యనంత సచివేంద్రుం డొప్పు భాగ్యోన్నతిన్. 45

తన దాన మల వనావనదేవ జానూన
సితభాను శరధుల సిగ్గుపరుప
తననీతి మను జాతి ఘనభీతి దమ హేతి
ధరురీతి వరభూతిఁ దాల్చుచుండ
........ ........ ........ ........
........ ........ ........ ........
తనధైర్య మనివార్యతరచర్య సదహార్య
మదహస్తి చలదాప్తి మలయుచుండ
తన దయారస మసమాన జన మనోభి
మత హితార్థ ప్రదాయక స్థితి నెసంగ
తనరు నీ కొప్పరాజనంతయ్య మంత్రి
మంత్రి మాత్రుండె దేవతా మంత్రి నిభుఁడు. 46

కలిమి కులంబు, పుణ్యముల గాదిలిచుట్టము, నీతిపెంపు వి
ద్యలగని, కీర్తిరాశి, వినయంబులలోగిలి, మేలుకుప్ప, సొం
పుల తొలిపంట, ధర్మముల పుట్టువు, దిట్టతనంబు చక్కి, య
క్కులపతి నెన్నఁగాఁదరమె కుండలిభర్తకునైన ధారుణిన్. 47

అతని దానాంబువు లర్థి సంపద్గతి
కతి నిధానంబులై యతిశయిల్లు
అతని లావణ్యంబు హరిణేక్షణావళి
కతను లావణ్యంబు గతి దలిర్ప
అతని యుక్తులు సజ్జనావన సత్క్రియా
యత నియుక్తిని పెంపు నందియుండ
నతని మానసపద్మ మభవ హంసోత్తమా
యతన మానస పద్మ మగుచు నెగడ

నిరుపమాత్మబోధ నిగమవాక్యవిదుండు
కొప్పరాజనంత కోవిదుండు
ఘనత న మ్మహాత్ముఁ గొనియాడ శక్యంబె
నలువకైన నతని చెలువకైన. 48

బాలేమర్తి పురాన్వవాయ జలధి ప్రాలేయ భానుండు వి
ద్యాలంకారుఁడు పానక ప్రభుఁడు ప్రోద్యత్ప్రీతి వేంకాంబికా
బాలారత్నమునందుఁ గాంచిన సుతన్ భామాభిధానన్ సతీ
శీలన్ వేడ్కనుఁ నంతమంత్రి వరుసన్ శ్రీయుక్తితోఁ బెండ్లియై. 49

పంచపాది:
సతత దిశాభిశోభిత విశాల యశోభర సాధులోక స
న్నుతుఁడయి వేడ్కను మువ్వురఁ దనూజులఁ గాంచె శశాంక శేఖరా
ద్భుత పదభక్తి సంజనిత భూరి కవిత్వ లసద్వచః సము
న్నతమతి లింగనాఖ్యు భువనస్తుత శేషు నశేష పుణ్యు నా
శ్రిత హితవృత్తియైన నరసింహుని సత్యదయాభిరాముఁడై. 50

వారిలోన. 51

వేదశాస్త్ర పురాణ వివిధాగమస్మృతి
కవితాద్యలంకార కావ్యవేది
వేదాంతసార మేధా దక్షిణామూర్తి
మను జపతోషిత మానసుండు
సకల రాజన్య సంసన్మధ్య సంచారి
విద్వజ్జనానీక వినుతకీర్తి
మంత్రలయ హఠాది మహిత యోగాభ్యాస
సాధిత బ్రహ్మైక్య సమరసుండు

విమలచిత్తుండు షడ్వర్గ విజయశాలి
కొప్పరాజ కులాంభోధి కువలయాప్తుఁ
డైన లింగన మంత్రీంద్రుఁ డమ్మహాత్ముఁ
బూని కొనియాడ దరమె వాగ్జానికైన. 52

తమ్ము లిరువురు నుభయ పార్శ్వమ్ము లందు
వామ దక్షిణ భుజములవలె భజింప
నొప్పు రాజన్యసభల దా నుచిత లీల
కావ్య రచనా చమత్కృతుల్ గనినవాఁడు. 53

రసము లొలుక విద్వన్మనోరంజనాఖ్య
మయిన కృతి చెప్పి వీరభద్రాంకితంబుఁ
జేసె, శంభుస్తవంబులు జేసెఁ బెక్కు
శివ గణాగ్ర్యుండు లింగన కవివరుండు. 54

వారిధితుల్య గుండిమెడ వంశజ వేంకట కృష్ణ మంత్రికిన్
భూరి వివేక వేంకమకు బుట్టిన కన్యక లక్ష్మమాంబికన్
వీర పతివ్రతాతిలక విశ్రుత లింగన మంత్రి పెండ్లియై
కూరిమిఁ బుత్త్రిఁ గాంచె ననుఁ గోవిదమిత్రుని నారసింహునిన్. 55

సేవించినాఁడ భక్తుల
రావించినవాఁడ శివుని రాజితశక్తిన్
గావించినాఁడ గృతులను
భావించినవాఁడ జగము బ్రహ్మంబనుచున్. 56

అరయఁ బ్రదోషపూజన మహత్త్వము పుష్కరదోదిత స్తవం
బుపతర సూతసంహితయు నొప్పుగ మల్హాణసూక్త సంగ్రహం
బరుదుగ నాంధ్రభాష పరమార్థముగా రచియించి యింక నే
స్థిర మగు కావ్యమొక్కటి విశేషముగా రచియింపఁ గోరుచున్. 57

# ప్రబంధరచనావిషయము

శాలివాహశకాఖ్య సంవత్సరంబులు
వేదాద్రి గిరి శశి విదిత సంఖ్య
గల విరోధికృదబ్ద కలిత మాఘాసిత
వరచతుర్దశి శివ వాసరమున
శ్రీ యెల్లమందాద్రి సేవింప సకుటుంబ
ముగ నేఁగి య మ్మహా నగముమీఁద
శివరాత్రి యుపవాస శివలింగ దర్శన
జాగర బిల్వార్చ నాగమోక్త
వినతు లాదిగ సత్కర్మ వితతి సల్పి
శివుని మదినిల్పి తత్పద చింతనంబు
జేసి యమ్మహోత్సవ పరిస్థితుల నెల్ల
సుమహితాశ్చర్య మొందుచుఁ జూచుచుంటి. 5

అంతట నేను సకల దిగ్దేశ సమాయాత భూసుర వ్రాతంబుల విలోకిం యిట్టి మహోత్సవంబు మీర లెందైనఁ గంటిరే యనిన వార లిట్లనిరి. 5

ఇలను బ్రాగంబోధిఁ గల జగన్నాథాది
సుకర స్థలంబులఁ జూచినార
మిల దక్షిణాంభోధి నెలమి రామేశాది
ప్రాచీన భూములఁ జూచినార
మిల పశ్చిమాంభోధి నెసఁగు గోకర్ణాది
శుద్ధోత్సవంబులు చూచినార
మిల నుత్తరంబున వెలయు కేదారాది
శుంభత్ప్రభావముల్ జూచినాము

కాని యిటువంటిస్థలములఁ గాన మనుచు
నిక్క మే బాసకైనను నిల్పు వార
మనుచు నందఱు నొక్క వాక్యంబుగాఁగ
బలికి రా మాట విని నేను బరమభక్తి. 60

అమ్మహాస్థలి కధీశ్వరుండగు త్రికోటీశ్వరలింగంబునకు నమస్కరించి కంచి కాళహస్తి చిదంబర కుంభకోణ రామేశ్వర శ్రీరంగ వేంకటాచల వృద్ధాచల మంగళాచల కాశి గయా ప్రయాగ శ్రీ పర్వతాది మహాస్థలంబులకు స్థలపురాణంబులు గలిగియుండ నిమ్మహాస్థలంబునకు స్థలపురాణంబు లేమి కేమి కతంబోయని విచారింపుచు మరునాఁ డన్నగేంద్రంబుడిగ్గి మన్నిలయంబగు క్రోసూరి పురంబున కభిముఖుండనై వచ్చునెడ మార్గంబునందు, శ్రీగిరి ప్రాంత నిలయుండును నుద్భటారాధ్య వంశజుండును ముదిగొండ వీరభద్రారాధ్యవర్య పౌత్రుండును కేదారలింగంబను నారాధ్యపుంగవుం డద్దేవు సేవింప నరుగునెడ నెదురైన నేను నమ్మహాత్మున కభివాదనంబు సేసి మదీయ చిత్తగతంబగు సంశయం బెఱింగించిన నమ్మహామహీసురుం డది విని మున్ను చిదంబరనటనతంత్రంబున శివుండు మాదేవికిఁ జెప్పిన విధానంబు జెప్పెదవినుము. దక్షాధ్వరధ్వంసానంతరంబున శివుండు కైలాస కుధరంబున దక్షిణామూర్తియై సమాధినిష్ఠం గూర్చుండిన బ్రహ్మోపదేశార్థం బచ్చటి కరుదెంచిన సనకాదులం దోడ్కొని యీ త్రికూటాచల మధ్యకూటంబు ప్రవేశించె నందువలన నీ స్థలం బెల్ల మునులకు నివాసంబగుట నెల్లమంద యని జనంబులచేతఁ బలుకఁబడె నిట్టి కథా విధానం బీవును నాంధ్రభాష నతిస్థిరంబుగా స్థలపురాణంబుగా రచియింపు మని యానతిచ్చిన నేను నిది శివప్రసాదంబుగా నంగీకరించి మదీయాభీష్ట సిద్ధి కిదియె కారణంబని తలంచి చిదంబర నటన తంత్రోక్తప్రకారంబున నీ కృతి రచియింపంబూని యేతన్మహాప్రబంధంబునకుఁ గృతినాథు శ్రీశైల నాథుంజేయుట యిహపర సాధనంబని తలంచి. 61

## షష్ఠ్యంతములు

శ్రీశైలపతికి శివునకు
నాశాధిప నుతపదునకు నాశ్రితహృదయ
క్లేశాపహరణ మూర్తికి
పాశవిదారునకు భక్తపాలనరతికిన్. 62

భ్రమరాంబా హృదయాబ్జ
భ్రమరంబున కఖిల భక్త బంభరవృత ప
త్కమల ద్వయ సేవాంచ
త్కమలాక్షున కిందు సూర్య దహనాక్షునకున్. 63

కదళీ బిల్వ వనాంతర
సదన స్థిత మౌనిహృదయ సంచారునకున్
మదన మదధ్వంసున కఘ
విదళన నిజదివ్య నామ విభవోద్ధతికిన్. 64

కరవీర వనోద్భాసిత
సుర కిన్నర యక్ష నాగ సుదతీ గాన
స్ఫురితానులాప తోషిత
పరమానందస్వరూప భాస్వంతునకున్. 65

జంగమ గిరితరు లతికా
సంగత విపినాంతరాళ సంచార మహో
త్తుంగ తపోవ్రత యమి రా
ణ్మంగళమోక్ష ప్రదాన మహిమాఢ్యునకున్. 66

అంకితంబుగా నా యొనర్పంబూనిన త్రికూటాచల మాహాత్మ్యంబునకు
కథారంభం బెట్టిదనిన. 67

# కథాప్రారంభము

మొదల వేదంబులు విదితంబుగాఁ బల్కి
సకల ధర్మాధర్మ సమితియెల్ల
నట్టి వేదార్థంబు నతి సుబోధముగాఁగ
బద్ధ చేతనులపైఁ బరమకరుణ
కామికాద్యాగమ గణము బోధించె నం
దు చిదంబర నటన ముచిత లీల
దక్షిణామూర్తి లీలాక్షర మాహాత్మ్య
మద్దేవుఁ డీ త్రికూటాద్రి మధ్య
శిఖర మధ్యస్థుఁ డగుచు నాశ్రిత మునీంద్ర
వితతి కాత్మోపదేశంబు విశదపరచు
విధము బోధించి యా తంత్రవితతిలోన
నధికతలమైన ప్రఖ్యాతి నధిగమించె. 68

తదుక్త విధానం బెట్లనిన 69

తనలోనం గల యా సదాశివుఁడె యంతర్లింగ రూపంబుగా
తన కాంతి ప్రసరంబులందు శివసూత్రస్ఫూర్తి భాసిల్ల గాం
చన గర్భాండ వపుర్విరాట్పురుష సచ్ఛైవాఢ్య వక్షస్థలీ
ఘన రౌప్యాంచిత లింగపేటిక క్రియం గైలాస మొప్పున్ ధరన్. 70

ఫలిత రసాల సాలతరు బంధుర బంధురమా విలాసమై
కలిత సుమేరు మేరునగ కాంత సుకేసర కేసరాఢ్యమై
లలిత సువర్ణ వర్ణి సుమరాజి కదంబ కదంబవాసమై
యలరు నగంబు దంబు గొనియాడఁగఁ జూడఁగ వింత యెంతయున్.

సాలోక్యము సామీప్యము
చాలగ సారూప్యపదము సాయుజ్యంబుల్
మేలొందవ నొసఁగు శివుఁ డా
శైలంబున నిల్చి భక్తసంఘము బ్రోచున్. 72

ఆ కలధౌత శైల శిఖరాగ్రమునన్ నవరత్న నూత్న సు
శ్రీ కమనీయ సౌధమున శ్రీపతి వాక్పతి ముఖ్యదేవతా
నీక కిరీట కోటి తట నిష్ఠిత పద్యుగళుండు శర్వుఁ డి
చ్ఛాకలితాకృతిన్ గొలువుశాల వసించె జగద్ధితంబుగన్. 73

ఆ సమయంబునన్ హిమధరాత్మజ శంకరుఁజేరి మ్రొక్కి యు
ల్లాసముతోడ నిట్లనియె రాజకిరీట మహేశ చిద్వియ
ద్వాస నిరీశ దేవ యపవర్గము నప్పుడె యిచ్చు తావకా
వాస మహాస్థలంబులు భవద్వచనంబున వింటి నెంతయున్. 74

ఇపు డెంతే విన నిచ్చ పుట్టెడిని కోటీశ స్థలాద్రీంద్ర స
ద్విపు లైశ్వర్య మహత్త్వ మీశుఁడిటకున్ విచ్చేయుటల్ తన్మహా
విపినస్థాద్భుతముల్ దదుద్భవము తద్విజ్ఞానమున్ సర్వమున్
గృపతోఁ జెప్పగదయ్య జన్మమరణక్లేశాపహారంబుగన్. 75

అన విని శంకరుఁ డిట్లను
వనజేక్షణ నీవుసేయు ప్రశ్న దలంపన్
జనహితము కొఱకు గాకను
వినవలెనే నీవు బ్రహ్మవిద్యవు గావే. 76

నేను నిర్గుణ తత్వంబ నిశ్చయముగ
నీవు మద్భక్తి వొటయు నిక్క మరయ

నాకు నీకును భేదంబు లేకయుంట
వేదములు బల్కుచుండును వేయునేల ? 77

అయినను మంత్రకోటులు మహాగమ జాలము కల్పసూత్రముల్
ప్రియమున నీకుఁ జెప్పుటయు ప్రేయసి ! లోకహితంబుఁగోరి యి
మ్మెయి మన కీ జగంబునకు మేలొనగూర్చుటె కార్య మెంతయున్
నయగతి నొందుకార్యము గనంబడునే మన కెంచి చూడఁగన్. 78

అట్లుగావున నీ త్రికూటాద్రిమీఁద
దక్షిణామూర్తి రూపంబు దాల్చి నేను
జగము రక్షింప నిలిచిన సరణి నీకుఁ
దెలియఁ జెప్పెద విను హిమాచలతనూజ. 79

కలదొక్క తత్త్వంబు ఘన సచ్చిదానంద
మద్వైత మమల మనామయంబు
పరమాత్మ యదియ తా పరశివుండనఁబడు
నీతఁడె స్వశక్తియై యలరు మాయ
చే గూడికొని సదాశివుఁడన విలసిల్లె
నా సదాశివమూర్తి కాత్మశక్తి
వరభోగమునకు భవానియై పురుషార్థ
నటనకు విష్ణువై చటుల కోప
మునకు కాళి యాయోధనంబునకు దుర్గ
యగుచు విలసిల్లె పురుష శక్త్యాత్ముఁడైన
విష్ణుదేవుని నాభి న వ్విధి జనించె
విధికి దక్షుండు జనియించెఁ బ్రభుల బలుఁడు. 80

ఆ దక్షుఁడు నిజ జనకుని
వేదమయుని విధినిఁజూచి వినుతించి మహా

మోదంబుతోడఁ బలికెను
"వేదార్థము మిగుల నీకు విశదం బగుటన్. 81

భుక్తి ముక్తుల నిప్పుడే పొసఁగనిచ్చు
దైవ మెవ్వఁడొ తెలుపవే తండ్రి !" యనుచు;
"పుత్త్ర ! శివుఁడొక్కఁడుఁన్నాఁడు భుక్తి ముక్తు
లిప్పుడే యిచ్చు దైవ మయ్యాతఁ దలఁపు." 82

అని విధి పలికిన దక్షుం డిట్లనియె. 83

"హరుఁడంచును హరియంచును
సరసిజగర్భుండటంచు శక్తియటంచున్
బరువడిఁ బల్కెద రిందునఁ
బరుఁడెవ్వఁడొ నాకుఁ దెలియ బలుకు విరించీ ! 84

అన విధాతయు నిట్లనె నాదరమున
"శ్రోతృ చిత్త విపాకంబుజూచి శ్రుతులు
హర్యజాదులు పరతత్త్వమని వచించె
గాని నిక్కంబుగాఁగ శంకరునిఁ బలుకు. 85

మఱియు వేదంబు లొక్కొక్క యంశంబున హర్యజాది దేవతలకుఁ బరతత్త్వం బాపాదించి సర్వాంశంబుల శివ పరతత్త్వంబే సాధించుఁ గావున వేదశాస్త్ర పురాణాగమ జాలంబులు సాంతంబుగాఁ జూచిన వారలు శివునియందె పరతత్త్వంబు నిస్సంశయంబుగాఁ బలుకుదురు. వీని యంశాంశ మాత్రంబె చూచినవార లితర దేవతలయందే పరతత్త్వంబు నిశ్చయించి నిస్సంశయంబుగా వాదింపు చుండెదరు. వేదంబులు మన్ముఖో ద్గతంబు లగుట తదర్థంబు నాకతి విశదం బందువలన శివుండే పరబ్రహ్మం బని యేను నీకుఁ దెలిపితి నీవును నమ్మహా దేవునికి భక్తియుక్తుల నారా

ధించిన భుక్తిముక్తు లీ జన్మంబు నందె చెందెద" వనిన నతండును మేరు నగ ప్రాంతంబున బహుకాలంబు జితేంద్రియుండై ఘోరతపంబుఁ జేసె నంత. 86

శతకోటి చంద్ర మోద్భుత దేహరుచితోడ
పటు జటామకుట విభ్రమముతోడ
నీలకంధర నీల నీలకంఠముతోడ
రమణీయ సర్ప హారములతోడ
కుందేందు రుగమంద మందహాసముతోడ
కరుణా కటాక్ష వీక్షణముతోడ
వరదాభయ మృగాగ్ని కరచతుష్కముతోడ
కటి తట పటుచర్మ పటముతోడ
వామ భాగస్థ పార్వతీ భామతోడ
నమల రుచిఁ బొల్చు నంది వాహనముతోడ
నతు లొనర్చెడి ప్రమథ గణంబుతోడ
దక్షునకు నంత శివుఁడు ప్రత్యక్షమయ్యె. 87

ఆ పరమేశుఁ జూచి నయనాంబుజముల్ వికసింప దక్షుఁ డు
ద్దీపిత భక్తియుక్తి నతి దీనగతిన్ వినుతుల్ ఘటించి యో
తాపసవంద్య నీచరణదాసుని నన్నుఁ గృతార్థుఁ జేయవే
పాపముఁ బాపి భక్తజనపావన యంచు నుతించె నీక్రియన్. 88

వృత్తస్తవము :

ముదా సదార్తి భంజనం - పదాహతార్క నందనం
విదారితాఘ సంఘటం - సదా సదా శివం భజే. 89

ఉమా సతీ మనోగతం - రమాధినాథ సేవితం
శమాఢ్య యోగి భావితం - సదా సదా శివం భజే 90

రసాధరేంద్ర కార్ముకం - వసుంధరా మహారథం
పురాసురాపహారిణం - సదా సదా శివం భజే. 91

గజేంద్ర చర్మ వాసనం - నగేంద్ర శృంగ వాసినం
వృషేంద్ర దివ్యవాహనం - సదా సదా శివం భజే. 92

అశేష భక్త పోషణం - విశేష శేష భూషణం
ప్రసిద్ధ తత్త్వ భాషణం - సదా సదా శివం భజే. 93

అని వినుతించు దక్షుఁగని యా పరమేశుఁడు బల్కె నీదు నె
మ్మనమునఁ గల్గు కోరిక శుభం బదె యిచ్చెద నేఁడు నీకు ని
వ్వనజభవాది దేవమునివారము లాది జగంబు నీదు పం
పునఁ జరియింప నీవు నతిపూజ్య జగత్పతివౌదు వెంతయున్. 94

నీదు ప్రజ్ఞచే జగములు నిండియుండి
పుత్త్రిలును పుత్త్రికలు గల్గి భూరిభోగ
శాలి వయ్యెదు నీయాజ్ఞ సకల భూత
చయము తప్పక నడచు నిశ్చయము గాఁగ. 95

అంత శర్వాణి కరుణమై నతనిఁజూచి
కోర్కెయేమైనఁ గలదేనిఁ గోరుమనిన
దక్షుఁడిట్లనె; "దేవి! నా తనయవగుచు
పుట్టు" మన నట్లె వరమును బొసఁగనిచ్చె. 96

ఇట్లు య్యుమామహేశ్వరులు నిజభక్తుం డగు దక్షునకు సకలాభీష్టంబు లొసంగి యంతర్ధానంబు నొందిన నతండంత నిఖిలైశ్వర్యసంపన్నుండై ప్రజాపతియయ్యె. భవానియు సతీనామంబునం బుత్త్రికయై జనించె నద్దేవిని శివునకిచ్చి వివాహంబుజేసి యఖండైశ్వర్యానుభవంబున మదోన్మత్తుండై యొక్కనాఁడు హర్యజాద్యమర్త్యులంగూడి పుత్త్రీజామాతృ దర్శనార్థంబు

కైలాసంబున కరిగిన నందుఁ బరమేశ్వరుండు దనకుఁ బ్రత్యుత్థానాభివంద
నంబులు సేయమికి మనంబునఁ గలుషించి శివరహితంబుగా యాగంబు
సేయఁదలంచి విష్ణుబ్రహ్మాద్యఖిల దేవర్షిగణంబుల రావించి శివుం బిలువక
యఖండైశ్వర్యవంతుండై మహావిభవ విస్తరంబుగా యాగంబుసేయు
సమయంబున. మహాశైవుం డగు దధీచిమహాముని శివరహితం బగు
యాగం బవలోకించి కోపోద్దీపిత మానసుండై సభాసదులందఱు విన
నుచ్చైస్స్వరంబున దక్షుని వీక్షించి యిట్లనియె. 97

ఏదేవు కరుణచే నిందిరాధీశుండు
విశ్వంబు బాలించు విభుతఁగాంచె,
నేదేవు కరుణచే నీవిధాతయు సృష్టి
కృత్యంబు రచియించె కేవలముగ
నేదేవు కరుణచే నీదిగీశావళి
స్వాధికారస్థితి సరణిఁగాంచె
నేదేవు కరుణచే నీమహైశ్వర్యాది
భోగభాగ్యంబులు పొలుపుమిగిలె

నట్టి జగదీశు నీశ్వరు నంబికేశు
బిలువ కీవు మఖము సేయఁ దలఁచినావు
దీన నీకును నీదేవమౌనితతికి
విలయకాలంబుగాఁదోఁచె వేయునేల ? 98

అనిన దక్షుండిట్లనియె. 99

రూపహీనుఁడయ్యును బహురూపియైన
నటుఁడు భిక్షుకుఁ డగుటుండు జటిలుఁ డెపుడు
నామరహితుండు కల్పితనామకలితుఁ
డెఱుఁగ కిన్నియుఁ దనయ నే నిచ్చినాఁడ. 100

అనిన దధీచి యిట్లనియె. 101

నీవు శివనిందఁ జేసిన నీచవాక్య
ములకు నత్యర్థముంట నే దెలిసియుంట
బ్రదికితివిగాక, శివనింద పలుకు వినిన
బ్రతుకరా దేరికైనను బాపచరిత ! 102

శివదేవుని, శివభక్తుల,
శివయోగము, శివపురాణ సిద్ధాంతంబుల
గువిచారత నిందించిన
శివనింద యనంగఁబడును జెప్పఁగ నేలా ? 103

తల్లినిఁ దండ్రినిన్ సుతుల దాతను దైవము నెల్లవారలన్
బల్లిదులైన యా నృపులఁ బట్టి వధింతురు నిందఁ జేసినన్
జెల్లునె నీకు దక్ష ! శివు చిన్మయు నిందయొనర్ప నక్కటా !
యెల్ల శరీరధారులకు నీపని కూడదు కూడ దెంతయున్. 104

దక్ష ! నీవు శివు న్భజించి మును తద్దాక్షిణ్య వీక్షాప్తిచే
నక్షీణాద్భుత సంపద ల్గని యనంతైశ్వర్య మత్తుండవై
కుక్షిస్థాఖిల లోకు నయ్యభవు సంకోచింప కుద్వృత్తిచే
నాక్షేపంబులు బల్కినా వకట ! మోహ భ్రాంత చిత్తంబునన్. 105

అర్థయుతముగ సర్వవేదాళిఁ జదివి
శంభు భక్తుండవయ్యును సర్వవేది
వయ్యు శివనిందసేయుట యరసిచూడ
ప్రకటితైశ్వర్య సంప్రాప్తివలనఁ గాదె ! 106

ధనధాన్య వస్తువాహన దాసదాస్యాది
కలిత సద్గృహరాజి గలిగెనేని

స్రక్చందనాలేప సకల భూషణ వస్త్ర
పర్యంక పంక్తు లేర్పడియె నేని
వర వయో లావణ్య సరసిజాక్షులతోడఁ
దోరమౌ రతికేళి దొరకెనేని
సరసాన్నపాన సంసక్తి నిరామయ
స్ఫురితాంగ విభవంబు పొసఁగెనేని

మత్తుఁడగు గాక శివభక్తి వృత్తుఁడగునె
నిరయగతిగాక కైలాస పురముఁగనునె
నీకు నిన్నియుఁగలుగుట నీచహృదయ!
శివునిఁ జింతింపనేరవు చెప్పనేల? 107

విను దక్ష! మేము నీ క్రియ
ఘనతపముల శివునిఁగూర్చి కావించియు శ్రీ
లను గోరకుంట యీగతి
జనియించును మదమటంచు చర్చించికదా! 108

అయినను శివప్రసాదగతంబులైన సంపదలు విపరీత ఫలంబులఁ జేర్చునే యనిన నందు శివభక్తి వితథస్వార్థంబుగాఁగోరిన శివుండిచ్చు సంపదలును నిస్పృహుండైనను నయ్యీశ్వరానుగ్రహంబునం గలుగు సంపదలును భుక్తిముక్తిప్రదంబులగు గాని రజస్తమోగుణగ్రస్తులై భోగార్థంబుగాఁ గోరిన నీశ్వరుండిచ్చు సంపదలు రావణాద్యసురులకుంబోలె మదంబుఁ బుట్టించు. నీవు భోగార్థంబుగాఁ గోరితి వట్లగుట విపరీతఫలంబు నొందఁగల వహో! శివనిందాఫలంబు నీ యట్టి ప్రజాపతి కమేయ దుర్గతింబొందింప సిద్ధంబయ్యె నింక మనుష్యమాత్రులు—శివనిందజేసినఁ బ్రాయశ్చిత్తంబులేని కతంబున ననేక బ్రహ్మకల్పంబులు ఘోరనరకంబునం గూలుదురని వేద పురాణ సిద్ధాంతంబులు వలుకుచుండు నేమిసేయవచ్చునని నిజకీర్తి విజిత సుధామరీచియగు దధీచి వగచి విషణ్ణుండై దక్షునింజూచిదక్షా! నీవు శివద్రోహి

వగుట నిన్నుఁ జూచుచు నీ యజ్ఞవాటంబున నిలువఁగూడ దచిరకాలంబున నీవాజ్ఞావశంబున నీమఖధ్వంసంబగు నీవు నిహతుఁడవగుదు వీసర్వసుపర్వ నికాయంబును శివనిందాశ్రవణదోషంబున నిప్పుడే శిక్షితులై చండాసురకృత బాధాపీడితులయి సర్వసంహార యోగంబున మృతిబొందెదరని శపించి కరద్వయీ పిహిత కర్ణపుటుండై లేచి చనిన దుర్వాసోజాబాల్యత్ర్యుపమన్యు గౌతమాది శైవర్షి సమాజంబు తోడనం జనియె. నా సభికులందఱు తదాజ్ఞా భయంబునం జనలేక నిలిచిరంత. 109

నారదుఁడు రజతశైలము
జేరి మహాదేవుఁజూచి సేవించి మహో
దారుఁడు దక్షుఁడు యజ్ఞము
వారక యొనరించె నిన్ను వర్జించి శివా! 110

అని శివుని బలుక సతి విని
జనకుని యజ్ఞంబుజూడఁ జన మనసయ్యెన్
ననుఁబనుపు మనఁగ శంకరు
డనియె ననాహూత గమన మర్హామె నీకున్. 111

అన సతియు భవుని వాక్యము
వినియును నే జనకుయజ్ఞవిభవముజూడన్
జనియెదననె; శివుఁడంతట
పనిగొనఁ బ్రమథాళి నిచ్చి పనిచెన్ వేగన్. 112

అంతట నా జగజ్జనని యద్భుతదివ్య విమానయానయై
ప్రాంతమునన్ గణావళులు భక్తిభజింపఁగ దక్షయజ్ఞ శా
లాంతర వీథికేఁగి సుషమాఢ్య విమానము డిగ్గి (పోయి) య
త్యంత మనోజ్ఞవేదిక మహావిభవంబున నిల్చె నయ్యెడన్. 113

సభికులు దక్షభీతి నతిసల్పక యూరకయుండి రంత నా
సభగని దక్షసన్నిధికి సాగిన నాతఁడు బంధుకోటియుఁ
విభవ మెలర్పఁగాంచి యవివేకమునం బలుకాడరైరి య
య్యభవునితోడి వైరమున; నా సతి దక్షునిఁజూచి యిట్లనెఁ. 114

తండ్రి మీయజ్ఞ మీక్షింపఁ దలఁచి నాదు
నాథు నెడఁబాసి వచ్చిన నన్నుఁజూచి
పలుక కుండుట యవివేక పథమటన్న
దక్షుఁడిట్లనె క్రోధ తామ్రాక్షుఁడగుచు. 115

తరుణి మాకు విరోధి నీధవుఁడతండు
ప్రేత భూత పిశాచ సత్ప్రియ సఖుండు
యజ్ఞభూమికి నరుదేర నర్హుఁడగునె
యతని సతివౌట నీవు ననర్హవిపుడు. 116

అన విని దక్షుని తోడుత
వనజేక్షణ పలికె నీదు వలన జనించెఁ
తను విది దీని విసర్జన
మొనరించి హిమాద్రికేను బుట్టెద సుతనై. 117

అని యోగమార్గ సంజనిత వేగముతోడ
హిమశైలమున కేగ ప్రమధులంత
కైలాసమునకేగి గరళ కంధరు జూచి
యీ వార్త దెలుప న య్యీశ్వరుండు
చటు లోగ్ర కోప సంఘటిత భ్రుకుటితోడ
వికటాట్టహాసుఁడై వీరరౌద్ర
రస సముద్ధతి మేన బొసఁగ ఘర్మాంబువుల్
తనచేతఁబట్టి యుద్ధతి విశాల

పటుశిలా మధ్యభూమిని బారజల్లె
జల్లునంతట నది యతి స్ఫారి తోరు
భిదుర విదళితమైనట్లు బీటలెసఁగి
పగుల విస్తృత తద్రంధ్ర పథమునందు. 118

## వీరభద్ర జననము

శ్రీమత్సహస్రాంశుకోటి ప్రభాభాసమానా సమానాంగ రోచిశ్ఛటాచ్ఛాదితా జాండ భాండాంతరాళుండు, నానామణీ కోటి కోటీర కోటి స్ఫురచ్చంద్ర ఖండావతసుం, డనల్పోగ్ర కల్పాంతవేళా కృశానుజ్జ్వలజ్జ్వాలికా మాలికా భీలఫాలేక్షణుండున్, సుధాధామ భీమోష్ణ ధామాగ్ని నేత్రుండు, ఘోరారి సేనావలి స్ఫార ధైర్యాద్రి నిర్భేదనా క్షుద్ర వీరాట్టహాసుండు, భాస్వన్మహా యుద్ధసన్నద్ధ శౌర్యోల్లసద్దైత్యరాజోరు దోరబ్జనాళావళీఖండనాఖండలోద్దండ వేదండ తుండాభ లీలా ప్రచండోగ్రబాహాసహస్రుండు, సత్తారహారావళీ పారిజాత ప్రసూనాచ్ఛమాలా విశాలాఢ్య వక్షస్థలుండుఁ, మహాశైలరాజ న్నితంబాభ సమ్యఙ్నితంబోపరిస్ఫీత కాంచీకలాపాతిశోభావిలాసుండు, నీలాళి నీలాబ్జ కాలాంబుదశ్యామలాకారుఁడై వీరభద్రుండు రౌద్రాకృతిఁ మీఱి యావిర్భవించెఁ. 119

అట్లు జనియించి విపులాట్టహాసచకిత
సకల భూత వితానుఁడై శంభుఁజేరి
వినుతిఁ గావించి నేను గావింపవలయు
కార్యమెద్ది మీయాజ్ఞ వేగంబ సేతు. 120

కొండలు పిండి సేయుదునొ, కుంభినిఁగొట్టి రజంబుజేతునో
దండధరుఁ సమిద్ధగతి దర్పమడంచి వధించివైతునో
ఖండనకేళి సర్వసుర పంక్తులఁబట్టి మదంబడంతునో
ఖండశశాంకమౌళి యధికంబగు నీదగు నాజ్ఞపంపునఁ. 121

శివుఁడు వీరభద్రుని దక్షునికడ కంపుట

ఆమాటల్విని శంభుడిట్లనియె వీవత్యంత రౌద్రక్రియో
ద్దామ ప్రౌఢిమ దక్షుఁజంపి మఖవిధ్వంసంబుగావించి సు
త్రామాజాచ్యుత ముఖ్యదేవతల గర్వంబెల్ల వారించి సు
క్షేమంబొప్పగ వేగరమ్మిటకు నక్షీణప్రభావోన్నతిన్. 122

అని యిట్లు శివుఁడు బలికిన
ఘనుఁడవ్వీరుండు భద్రకాళియుతుండై
చనువేళఁ దత్సహాయం
బనఘుల గణవరులఁబంచె నధికప్రీతిన్. 123

వారు ననేకోత్కట కరవాల భిండివాల తోమర ముసల ముద్గరాది నానాయుధ పాణులై వీరభద్రేశ్వరుంజుట్టుకొని దక్షాధ్వరశాల కభిముఖులై చనునపుడు కొందఱుగణంబు లద్దేవు నుద్దేశించి వందిమాగధగీతంబులు పాడుచు నిట్లని స్తుతియించిరి. 124

చటుల భుజాస్ఫోట జనితోద్భటార్భటి
బ్రహ్మాండ భాండంబు పగిలిపడఁగ
గమనవేగాకీర్ణ ఘనజటానిహతిచే
గ్రహవీథినుండు తారకలుబ్రాల
నిటల నేత్రానల స్ఫుట విస్ఫులింగంబు
లంబరంబునఁ దారకాళి గాఁగ
తతపదఘట్టనోద్ధత భూపరాగంబు
నిర్జర వాహినీ నీరమడఁప
నీవు దక్షుని మర్దింపఁబోవుసరణి
నిఖిల లోకాద్భుతస్ఫూర్తి నివ్వటిల్లు

ప్రళయతర రౌద్ర పరమకృపాసముద్ర
వినుత శతరుద్ర భద్ర శ్రీ వీరభద్ర ! 125

భవదీయ హుంకార పటుమరున్నిహతిచేఁ
గుల పర్వతములు దిక్కులకుఁ జెదర
తావకోత్కట జటాతాడన ప్రౌఢిని
ఘన శింశుమార చక్రంబుదిరుగ
యుష్మత్కరాగ్ర సంయోజితాసి స్పర్శ
బ్రహ్మాండ మూర్ధ్వ రంధ్రంబుగాఁగ
భవదుగ్రసింహ రావార్భటి మేరుమం
దర గుహావళి ప్రతిధ్వనులు సేయ
నీవు వీరాంగమేయుచు నిష్ఠురముగ
దక్ష మఖవాటి కరుగుట దలఁపవశమె
ప్రళయతర రౌద్ర పరమకృపాసముద్ర
వినుత శతరుద్ర భద్ర శ్రీ వీరభద్ర ! 126

అని వినుతించెడి గణముల
వినుతులు చెవులార వినుచు వీరేశుఁడు దాఁ
జనె దక్ష యజ్ఞవాటం
బునకుఁ గణరాజితోడ పురహరునాజ్ఞ. 127

ఇట్లు చని ముందట ననంతమణి రుచిరానంతమణి గణభ్రాజిత ద్వారకవాట గేహాళీ విరాజితంబును, రాజితాచలసంకాశ సౌధనికాయంబును, కాయమాన నివిష్ట విశిష్ట భూసుర వేదనినాదంబును, నాది తానేక వాద్యకూటంబగు దక్షయజ్ఞవాటంబులోనికిం జని తదీయ ద్వారంబులు నిరోధించిన గణంబులును, నిశితాశు గోద్దండ కోదండపాణులును, భండనప్రచండ గదాదండ మండితులును, వివిధాయుధధారులై తదధ్వరోపగతులైన గరుడ గంధర్వ

కిన్నర కింపురుష సుపర్వుల గర్వంబు సర్వంబును నిర్వాపణంబుజేసియు, ముఖశాలాంగణ స్థాపితంబులగు యూపంబుల రూపణంచియు, నగ్నుల భగ్నంబుజేసియు, వేదికల భేదించియు, పురోడాశంబుల నాశంబునొందించియు, నానావిధంబుల యజ్ఞంబు ధ్వంసంబుజేసి రంత వీరభద్రేశ్వరుండు శివరహితంబైన యజ్ఞశాలా మధ్యంబునందున్న దేవర్షి సదస్య ఋత్విఙ్నికాయంబుల కాయంబుల మహోద్దండ నిజభుజాదండ మండిత గదాకాండ ఖండితంబులుగాజేసి దక్షజామాతయై యందుండునిందునిఁ దన పాదతలంబు క్రిందంబెట్టి మర్దించి, దక్షుండుసలుపు శివనిందల హాసన్ముఖుండై వినిన పూషాదిత్యు దంతంబులును, తదభిముఖుండై చూచిన భగుని నేత్రంబులును, నందు బ్రహ్మత్వంబు వహించిన భృగుని శ్మశ్రువులునుం బెకలించి యచ్చట వీణాపాణియైపాడు వాణి నాసికాచ్ఛేదంబుంజేసి తన్ముఖంబున నాహూతులుగొనిన సప్తజిహ్వుని జిహ్వలు మొదలంటంగోసి శివద్రోహి యగు దక్షువధింపంబోవు సమయంబున దదధ్వర రక్షకులైన విష్ణువిధాత లమ్మహావీరవరుంజూచి భయభ్రాంతచిత్తులై రందు విధాత యద్దేవదేవున కెదురేగి దేవా ! నీవే శివుండవు. జటాజూట చంద్రావతంస ఫాలేక్షణోక్ష వాహనాది చిహ్నంబులు గలిగియు, శివద్రోహియగు దక్షు వధించుటకై రౌద్రంబగు తమోగుణరూపంబు ధరించుటంజేసి నీలవీరదశ్యామలాకారుండ వయితి విట్టినీవు త్రిపురసంహారంబు గావించునెడ నీకు సారథినై వేదాశ్వంబులందోలితిఁగాదె యిప్పుడు భవద్రథ సారథ్యంబుఁజేసెద ననుగ్రహింపవే యని ప్రార్థించిన నవ్వీరుండవ్విధాత సారథిగా నంగీకరించె నంత విష్ణుం డవ్వీరభద్రేశ్వరు సన్నిధికేతెంచి యిట్లని స్తుతియించె. 128

జయ జయ దక్షాధ్వరహర !
జయ జయ శ్రీ వీరభద్ర ! జయ సర్వజ్ఞా !
జయ జయ మృత్యు వినాశన !
జయ జయ భక్తార్తి హరణ ! జయ సర్వేశా ! 129

నీవు పరాత్పర నిర్గుణ బ్రహ్మమౌ
హరుఁడవు, నేను నీ పురుషశక్తి
నగుదు, నీకును నాకు నొగి భేదమనరాదు,
త్రిపురాసురులఁ జంపఁదివురు నీకు
బాణమైతిని, నేఁడు పాపాత్ము దక్షుని
శివవిరోధినిఁ బట్టి శిక్షసేయఁ
దలఁచు నీకును వేడ్కఁ దగు సహాయము జేతు,
జగతి శివద్రోహిఁ జంపవలయు,

ననుచు నుతిసేయు విష్ణునియందుఁ గరుణ
దొడర మన్నించి దక్షునికడకుఁ జనియె,
శమిత సమవర్తి దేవతా చక్రవర్తి
పటుతరస్ఫూర్తి శ్రీ వీరభద్రమూర్తి. 130

ఆ వీరభద్రుఁ గనుఁగొని
భావంబున బెరుకుదోఁప భయమున దక్షం
డీవీర మూర్తి యెన్నడు
నేవిన్నదిగాదు చూచియే నెఱుఁగఁగదా! 131

అనుచుఁజింతించి శంభువిందాఘఫలము
తప్పనేయంచు మిగుల సంతాపమొందె
నీచునకు శిక్షచే బుద్ధి తోఁచుఁగాని
పుట్టదెందు వివేకంబు బోధచేత. 132

అంత వీరుండు నిశిత వాలాగ్రమునను
దక్షుని శిరంబు ఖండించి దహనశిఖల
వ్రేల్చె శివనింద కిదియపోఁవిధి యటంచు
దెల్పురీతిని సురలు భీతిని జలింప. 133

ఆ వీరభద్రుఁ గనుఁగొని
భావి మహాప్రళయ రుద్ర భాస్వత్తేజ
శ్శ్రీ విభవమూర్తి యీతఁడు
కేవల శివుఁడనుచు మిగులఁ గీర్తించి రొగిన్. 134

భుక్తి ముక్తి సౌఖ్యదాయకం సమస్తలోకనాయకం
వాసవాది దేవ సన్నుతం మునీంద్ర భావభావితం
నిత్యసత్యబోధ విగ్రహం నితాంత దుఃఖనిగ్రహం
భక్త దుర్విపద్వినాశకారి వీరభద్ర మాశ్రయే. 135

దక్ష దుష్ట యజ్ఞ సూదనం విపక్ష పక్షభేదనం
పూషభాను దంతఖండనం భుజంగరాజమండనం
నీలనీరదాంగ భాస్వరం పరాత్పరం నిరీశ్వరం
భక్త దుర్విపద్వినాశకారి వీరభద్ర మాశ్రయే. 136

దుష్ట దైత్య రాజ శిక్షణం కృపాకటాక్షవీక్షణం
మృత్యు గర్వ పర్వ తోద్భిదం సమస్తరాట్పరిచ్ఛదం
యోగి మానసాబ్జ హంసకం సువర్ణ మంజు హాసకం
భక్త దుర్విపద్వినాశకారి వీరభద్ర మాశ్రయే. 137

సర్వలోక సౌఖ్యదాయకం మురారి దివ్యసాయకం
కోటికోటి భానుతేజసం నిరస్త మోహరాజసం
భూరి భోగ భాగ్యదాయినం వినష్ట దైత్యమాయినం
భక్త దుర్విపద్వినాశకారి వీరభద్ర మాశ్రయే. 138

కాలకాల మద్భుతాకృతిం కృశాను ఫాలలోచనం
బాలచంద్రమౌళి మద్వయం కృపా రసామృతాలయం

భద్రరూప భద్రకాళికా మనోంబుజాత భాస్కరం
భక్త దుర్విపద్వినాశకారి వీరభద్ర మాశ్రయే. 139

అని వినుతించు దేవతాగణంబునం దనుకంపాయత్తచిత్తుండై తద్విప న్నివారణంబుసేసి గణాళితోడంగూడి శ్రీమత్కైలాసాచలంబుఁ బ్రవేశించి పరమేశ్వరునకు నమస్కరించి తన విజయం బెఱింగించి వీరభద్రేశ్వరుండు భక్తసురక్షణశీలుండై నిజేచ్ఛం బ్రవర్తింపుచుండె నంత విధాతయు విచ్ఛిన్నంబైన దక్షునియజ్ఞంబు సంపూర్తిగావించె నా దక్షుండు శివాజ్ఞావశంబునఁ బునర్జీవితుండై కాశికాపురికిం జని సకలలోకేశ్వరుండైన విశ్వేశ్వరుంగూర్చి తపంబుజేసి ముక్తుఁడయ్యె నిట్టి వీరభద్రవిజయ కథావిధానం బెవ్వరైన వినినఁ జదివిన లిఖించిన విపత్సముదాయంబులం బాసి భుక్తిముక్తులం జెందుదురని చెప్పి శివుం డుమాదేవికి మఱియు నిట్లనియె. 140

ఆశ్వాసాంతము

చక్షుశ్శ్రోత్రపభూష, పోషితమునీశా, శాసితాశాధిపా,
కుక్షిస్థాఖిలలోక, దేవవినుతాకుంఠప్రభావోదయా,
రక్షశ్శిక్షణదక్ష దక్షిణభుజా, రాజత్త్రిశూలాయుధా,
వీక్షాశిక్షిత పంచబాణ, సుమనోవేద్యస్వరూపోజ్జ్వలా! 141

కరుణా కటాక్ష రక్షిత
సరసిజ గర్భాండ, భక్తసంఘ నిషేవ్యా,
పరమేశ, చంద్రశేఖర,
గిరిరాట్కూట ప్రచార, కేవల సుఖదా! 142

నిగమ వినుత లీలా, నిత్యకల్యాణ శీలా,
ఖగ గమన నిషేవ్యా, గాఢవిజ్ఞాన భావ్యా,

మృగధర, గతపాశా, మృత్యుదర్ప ప్రణాశా,
దిగధిపనుతకీర్తీ, దేవ, శ్రీశైలవర్తీ ! 143

ఇది కొప్పరాజనంతామాత్య పౌత్ర లింగనామాత్య పుత్ర సుజన విధేయ నరసింహ నామధేయ ప్రణీతంబయిన చిదంబర నటన తంత్రోక్త శ్రీమత్త్రికూటాచల మాహాత్మ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

★

# శ్రీమంత్రకూటాచల మాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము



శ్రీసమధిక మురజిద్విధి
వాసవముఖ దేవలోక వర్ణిత చరణా
దాసజనావన పావన
భాసుర కరుణాంతరంగ పర్వతలింగా! 1

అవధరింపు మద్దేవుం డుమాదేవి కిట్లనియె. 2

అంతమీఁదట సతియు హిమాద్రివరుని
వరము మన్నించి యాతని భవనమునను
జననముం బొందె నటమీఁద శంకరుండు
దక్షిణామూర్తి రూపంబు దాల్చి మఱియు. 3

కైలాసాచలశృంగసంగత మహాకల్యాణసౌధాంతిక
ప్రాలేయాంశుదృశద్వితానకృత శుంభద్వేదికామధ్యమం
దాలోలాతివిశాలపత్ర విలస న్న్యగ్రోధమూలస్థలిన్
హేలామీలితలోచనుండయి శివుం డేకాంత లీలారతిన్. 4

వీరాసనస్థుఁ డగుచును
ఘోరాపస్మారవృష్టికుంచితపరుఁడై
ధీరత్వ మొప్పఁ దను దా
వారక వీక్షింపుచుండె పరమసమాధిన్. 5

ఆ సమయమ్మునందు సనకాదులు యోగ తపోవ్రతక్రియా
భ్యాస విశేషబోధముల బ్రహ్మ మెఱింగియు దేశికోక్తి న
జ్ఞాసన విష్ణురుద్రులు గుణాశ్రయులంచుఁ దలంచి నిర్గుణో
ద్భాసిత దక్షిణాభిముఖ దైవము జూడఁగ వెండికొండకున్. 6

చనునెడ ముందట నఖండ పాండు డిండీరఖండాచ్ఛచ్ఛవిభాసురంబులును శరత్కాల కాదంబినీ కదంబక ప్రభాడంబర విడంబితంబులు నగు మహా కలధౌత శిఖరిశిఖరంబుల విలోకించి నమస్కరించి డగ్గరి య గ్గిరీంద్రంబు నకు జుట్టునుంగల గణేశ వీరభద్ర నంది భైరవ కుమార దుర్గా మహాకాల మహాదస్త్రాభిరక్షి తాష్టదిగ్గోపురద్వారంబగు ప్రాకారం బతిక్రమించి కాంచ నాంచితభూభాగంబగు ప్రథమావరణంబున భక్తులగు ననేక దేవర్షిబ్రహ్మర్షి సిద్ధసాధ్యగణంబుల నాలోకింపుచు నేకోత్తరశతకోటి రజితశిఖర విరాజితం బగు ద్వితీయావరణంబున త్రైలోక్యముక్తులగు నసంఖ్యాత ప్రమథుల వీక్షింపుచు నేకోత్తరకోటి సువర్ణశిఖరాకలితంబగు తృతీయావరణంబున ననేకకోటి రుద్ర రుద్రకన్యా ద్యష్టైశ్వర్యసిద్ధవితానంబులంజూచుచు నేకో త్తరలక్ష లక్షిత మణిశిఖరాలంకృతంబగు చతుర్థావరణంబున స్వాధికారం బులు వదలి మోక్షాపేక్షులై జ్యోతిర్లింగంబు ధ్యానంబుసేయు ప్రాచీన విధి విష్ణుపురందరాది బృందారక సందోహంబు నీక్షింపుచు నేకోత్తరదశసహస్ర స్ఫటికశిఖరాభిరామంబగు పంచమావరణంబున ఋషభ క్షేత్రపాల చండీశ దుర్గా స్కంద నంది గణేశసైన్యపతుల సామీప్యముక్తుల నవలోకింపుచు నేకోత్తర సహస్ర సూర్యకాంత శిఖరోత్తుంగంబగు షష్ఠావరణంబున నేకోత్తరశత తాండవమూర్తులను సారూప్యముక్తులనుం గనుంగొనుచు నేకోత్తరశతాగ్నికాండశిఖరోదారంబగు సప్తమావరణంబున పరమేశ్వరు పంచవింశతి లీలాస్వరూపంబుల నుతింపుచు నేకాదశ చంద్రకాంత శిఖ రాభిశోభితంబయిన యష్టమావరణంబున నేకాదశరుద్రమూర్తులకు నమస్క రింపుచు నవరత్నమయైక శిఖరమయంబగు నవమావరణంబున సాయుజ్య

ము క్తిస్థానంబగు సదాశివు నిలయంబు నందీశ్వరానుమోదితులై ప్రవేశించి
యందు దివ్యసౌధప్రాంతంబున నమృతకాసారతీర న్యగ్రోధమూల నవరత్న
వేదికాస్థిత మణిగణాకుంఠిత కంఠీరవాసన మధ్యంబునందు. 7

శతకోటిచంద్రమోద్భుతకాంతి గలవాని
గడు మించు మించెడి జడలవాని
నీరదరుచి నింపు నీలకంఠమువాని
చారుబాహాచతుష్కంబువాని
స్ఫుట భస్మలేపత్రిపుండ్రాంకములవాని
ప్రకట రుద్రాక్షమాలికలవాని
నాసాగ్ర వీక్షణాభ్యాస శీలమువాని
స్వానుభూతిక్రియాసరణివాని
మన్మథాయుత సౌందర్యమహిమవాని
సకల సద్భక్త రక్షణక్షణమువాని
పూర్ణగుణభావు దక్షిణామూర్తిదేవు
గనిరి మౌనులు కన్నుల కఱవుదీఱ. 8

కని సాష్టాంగ ప్రణతులు
వినయంబునఁ జేసి లేచి విశ్వాతీతుఁ
జననాంతదూరు శంకరు
వినుతించిరి మౌనివరులు విమల మనీషన్. 9

జయ జయ చంద్రకళాధర
జయ జయ దేవాదిదేవ జయసర్వేశా
జయ జయ సకల ఫలప్రద
జయజయ గౌరీహృదంబుజాతమిళిందా ! 10

నీవు నిర్దేహివయ్యును నీలకంఠ
సువిమలస్ఫుటమూర్తివై సులభముగను
పక్వచిత్తుల కుపదేశపథము దెలుప
దక్షిణామూర్తి రూపంబుదాల్తు వభవ. 11

బ్రహ్మమానసమున బ్రభవించియును మేము
సకల వేదార్థముల్ జదివి వినియు
బ్రహ్మ మిట్టి దటంచు భావించి తెలిసియు
స్వానుభూతిక్రియాసరణిలేక
దేశికశ్రేణిచే దేవ ! నీ యనుభూతి
వెలయు శాస్త్రాళిచే, దెలియదనుచు
బుధవర్యులను జేరి బోధింపుఁడని పల్క
మే లెఱింగిన యట్లు ప్రేమ వారు
పల్కి రటులౌట బల్కులు పల్కరాని
పరమనిర్గుణ తత్త్వంబు బట్టబయలు
గాగ తెలివిడి నేయుమీ కాలకంఠ !
గురువులకునెల్ల మొదలింటి గురువ వీవ. 12

అని మునులు విన్నవించిన
ఘనయోగసమాధి వదలి కరుణాన్వితుఁడై
జననాంతదూరుఁ డీశుఁడు
మునివర్యులఁజూచి పలికె మోదంబెసఁగన్. 13

గంధమాదన కైలాస కనకశైల
మందరంబుల గౌరి ప్రమథనిచయము
గొలువఁ గొలువుందు భక్తులకోర్కె లొసఁగ
నిల మహాస్థలి లింగమై నిలిచినట్లు. 14

మఱియు వ్యష్టిభూతులైన మునులు స్వదేహంబుల త్రికూటాగ్రంబుల నాత్మధ్యానంబు సేయుచు రట్లు సమష్టిభూతుండనైన నేనును బ్రహ్మాండ దేహంబునకు త్రికూటస్థానంబగు నా త్రికూటాద్రియందు ధ్యానసమయం బుల నేకాంతంబుగా నివసించి యుందును గావున నచ్చోట మీకును బ్రహ్మోపదేశంబు జేసెదనని వారలతోడం బలికి సనకసనందనాది పరమ హంసలను వాలఖిల్యాది యోగసిద్ధులను నారదాది దేవర్షులను వసిష్ఠాది బ్రహ్మర్షులను మేధాది ప్రధాన రాజర్షులం దోడ్కొనివచ్చి సవ్యాపసవ్య మధ్యదేశంబులంగల బ్రహ్మ విష్ణు రుద్రులతోడ నేకీకృతయగు నిజమూర్తి ననుసరించి సవ్యాపసవ్య మధ్యదేశంబుల బ్రహ్మ విష్ణు రుద్రరూప శిఖ రంబుల నొప్పు నప్పరమేశ్వరాకార ధారుణీధర మధ్యశిఖరంబున బిల్వ కాంతార కాంతేందుకాంత కుట్టిమస్ఫుట వటవిటపి నికట స్ఫటిక ఘటిత సహస్రస్తంభ సంభార సంభృత మణి మండ పాంతర భాస్వర కార్తస్వర వేదికామధ్యంబున నుద్భాసిత వీరాసనాధ్యాసిత పదుండును జ్ఞానముద్రిత హస్తుండును నాసాగ్ర నిరీక్షణుండునునై స్వరూపాలోకానంద పరవశుండై యుండె నంత నమ్మునిసమాజంబుల గిరీంద్రోపత్యకాధిత్యకా స్థలంబులం బ్రవేశించిరి. 15

కొందఱు భూరిసానువులఁ గొందఱు దివ్యనితంబ భూములన్
కొందఱు గండశైలములఁ గొందఱు బిల్వవనాంతరంబులన్
కొందఱు రత్నకూటములఁ గోరి వసించుటఁజేసి మారజి
న్మందిర మన్నగంబు మునిమందయనన్ విలసిల్లె నెంతయున్. 16

అంత నద్దేవు నర్చించి యాత్మవిద్య
కరుణ దయసేయుమను సనకముఖమౌని
నికరములఁజూచి యానంద నిలయుఁడైన
దక్షిణామూర్తి బల్కె తత్త్వైక సరణి. 17

మీరలు సాధనచతుష్టయ సంపన్నులును కామక్రోధాది రహితులును దేహాభి మాన వర్జితులును జితేంద్రియులు నగుట పూర్ణాధికారులగు మీకతి సుల భంబుగా స్వాత్మావ బోధంబగుగాని యనధికారులకు నెన్నివిధంబుల బోధించినం దెలియదనిచెప్పి దయాళుండై. 18

ముందర పార్శ్వంబు లందును వెనుకను
సందుల గొందులఁ గ్రిందుపడఁగ
క్రిందట మీఁదట ముందట ముంగిట
లోపల వెలుపల లోకమెల్ల
ప్రళయ కాలాంభోధి భంగిని బూర్ణమై
యచలమౌ బ్రహ్మంబు నాశ్రయింప
మౌనముద్రారూఢ మహిమచే సూచన
గావించి చూచి యుత్కంఠమీఱ
*చాక్షుషీ దీక్ష యొసఁగి నిస్సంశయముగ
శక్తి పాతప్రకారైక సరణిఁ దెలుపఁ,
బడియె విగ్రహ మవనిపై వారి కంత
నంత కాంతకు సత్ప్రసాదా ప్తివలన. 19

అపుడు విస్మృతిజెంది బాహ్యాంతరముల
మరచి సనకాదులంతట నెఱుకగలిగి
గురునిఁబూజించి బ్రహ్మైక్య గరిమగనిరి
మరలవారల కనియె నా పరమగురుఁడు. 20

చాక్షుషీ దీక్షచేతను శక్తిపాత
మరయనేరక బయలు బ్రహ్మంబటంచు

*చాక్షుషీదీక్ష—చేప గ్రుడ్లులను చూచినంతనే పిల్లలగును. అట్లే దక్షిణామూర్తి మౌనముద్రతో చూచినంతనే గురుబోధ జరిగినది అని భావము.

బలుకుదురు కొంద అంబర భ్రాంతిదొలఁగు
టెట్లొకోయని యెంచ రొకింతయైన. 21

బయలిదె బ్రహ్మంబైనను
వియదాకృతియెద్ది దాని వెదుకంగదగుఁ
వియదాత్మలకును రూపము
లయి తగు శబ్దం బశబ్దమనునవి వినుడీ! 22

ఇట్లశబ్దంబగు బ్రహ్మం బీ బయలేయని యూహించునెడ నది మనంబునకు విషయంబగుట బ్రహ్మంబెట్లగు నిర్విషయంబగు బ్రహ్మంబు దానిచేతం దెలియంబడదు. తెలియఁబడెనేని సవిషయంబగు నిట్టియెడ నీ ప్రపంచం బంతయు బ్రహ్మంబేయని పలుకుట స్వానుభవంబుగా దట్లగుట నుపదేశసమయంబునందె శక్తిపాతవశంబున సంకల్పశూన్యంబై శరీరపతనంబైన యప్పుడు బ్రహ్మంబు తానగునంత నీ జగజ్జాలంబంతయు బ్రహ్మంబని స్వానుభవంబునం దెలియంబడునట్టి శక్తిపాతంబు మోచకానుగ్రహంబునం గాని కా దట్లగుట మోచకోపాసనంబు చేయవలయు నదెట్లనిన 23

ముక్తియును ముక్త్యుపాయంబు మోచకుండు
మోచనప్రదుఁడను నాల్గు ముఖ్యముగను
శ్రుతులు వివరించిపల్కు విశ్రుతముగాఁగ
బరగ వీనిని వరుసతో నెఱుఁగవలయు. 24

అందు ముక్తి చతుర్విధ యగు నెట్లనిన 25

సాలోక్యము సామీప్యము
చాలగ సారూప్యపదము సాయుజ్యంబుఁ
నాలుగు ముక్తులు గలవట
మేలౌ సాయుజ్యపద మమేయముదలఁపఁ. 26

జగమంతయును రజ్జుసర్ప ప్రతీతిగా
నాభాసమాత్ర మౌనని తలంచి
తనకు నావరణమై తగు నవిద్యను విద్య
చే రయంబున బాసి వేరులేక
బ్రహ్మంబు తానయై వాసనా త్యాగాఖ్య
యోగంబుచేత విరాగియగుచు
చిన్మయానందంబు జెందుట సాయుజ్య
ముక్తినాదగు నిదె మోక్షమనుచు
శ్రుతులఁ బలుకంగబడియె విశ్రుతముగాఁగ
ముక్త్యుపాయంబు జ్ఞానమౌ ముఖ్యముగను
జపతపోవ్రత సత్యశౌచములు క్రమము
దనర ముక్త్యుపాయంబులౌ తపసులార! 27

ముక్తి తెలిసియుఁ దదుపాయ ములనుగలిగి
యుండియును మోచకుం డీశు డుండకున్న
ముక్తి కల్గదు, షడ్వర్గ ముక్తికాదు;
వసుధ నపవర్గ మపగత వర్గమండ్రు. 28

కొందఱు కామాదులు మదిఁ
జెందినఁ గొరతేమి తాను జిన్మయుఁడగుటన్,
జెందును తద్వికృతుల నది
యందురు విజ్ఞాన హీనులయి ధరలోనన్. 29

మది కామ క్రోధాదులు
గదియుటచే గాదె మున్ను కల్పావధిగా
వదలక జన్మ జరామృతు
లొదవెఁ సంసారమమత యుడుగక నిలిచెఁ. 30

మఱియుఁ దానచలం బగు చిదాకాశంబని ప్రతీతిచేఁగాని స్వానుభవంబున
నెఱుంగని కతంబున గదా, స్త్రీదేహంబుల కామంబులచేత రతియును,
యహితులయందు క్రోధంబుచేత హింసయును, ధనంబులయందు లోభంబు
చేత దృష్ణయును, బంధువులయందు మోహంబుచేత నాసక్తియును, నైశ్వ
ర్యంబులయందు మదంబుచేత గర్వంబును, దాయాదులయందు మత్స
రంబున దీర్ఘక్రోధంబును గలిగి యనేక జన్మనరకంబులొందెఁ; దదీయారి
షడ్వర్గంబు లేకుండుటవలన మోక్షంబున కపవర్గంబను పేరుగలిగె, నట్టి
కామాదులు ప్రారబ్ధంబున నొకానొకప్పుడు కలిగినను వశిష్ఠాదులు వాసనా
త్యాగ యోగ సంపన్నులగుటఁ దద్దోషంబులం బొరయక త్రికాలజ్ఞాన
సంపన్నులయి యణిమాది సిద్ధులుగలిగి జీవన్ముక్తులై రట్లగుట వీని
జయించుటకు మోచకుండగు దక్షిణామూర్తి నుపాసించిన నద్దేవు కరుణఁ
గామాదులం గెలిచి యిహంబునందె సకల భోగంబులంబొంది వాసనా
రహితులై జ్ఞానంబున సాయుజ్యముక్తిఁ గాంతురట్టి దక్షిణామూర్తినగు నేనే
త్రికూటాచలంబున కోటీశ్వరాఖ్యునంట నన్ను భజించిన ముక్తులగుదురని
చెప్పి యద్దేవుండు మఱియు నిట్లనియె. 31

జగతి కలివేళ మోచకస్మరణ కంటె
ముక్తి వేఱొండు సాధన పొసఁగ దెందు
నదియు మూఁడువిధంబుల నలరుచుండు
నామరూప స్వరూపక నామములను. 32

అందు నామస్మరణంబు శివశంకర మహాదేవాది నామోచ్చారణంబు, రూప
స్మరణంబు జటాజూట కాలకంఠ చతుర్భుజ గజాజినాగజాంచిత వామాంగ
దివ్యమంగళ విగ్రహస్మరణంబు, స్వరూపస్మరణంబు నిర్గుణనిర్వికల్ప నిరా
లంబ చిదంబర స్మరణం; బందు నామస్మరణంబున పాపహరణంబును,
రూపస్మరణంబున చిత్త నిగ్రహంబును, స్వరూపస్మరణంబున మనోలయం
బునుం గలుగు. 33

ఈలీలఁ స్మరణంబుసేయుటకు నయ్యాశ స్వరూపంబు దా
నాలోకించినగాక శక్యమగునే యట్లౌటఁ దత్ప్రాప్తికై
చాలఁ మోచకదాయి సద్గురు తను స్వాంతార్థ దానంబుచే
నోలిం బూజ యొనర్పఁగాఁదగు మహాయోగ్య ప్రకారంబునన్. 34

ఇక మోచకప్రద గురుని రూపంబెట్లనిన 35

క్ష్మా దేవతగురుండు సకల వర్ణాళికి
బ్రాహ్మణేతరులకు బార్థివుండు
వైశ్యుండు గురుఁడగు వైశ్యశూద్రులకును
స్త్రీ శూద్రులకు గురుసిద్ధిగాఁగ
నఖిలాశ్రమంబుల కాత్మవిదుండగు
బ్రాహ్మణుండు గురుండు బ్రజ్ఞవలన
వర్ణాశ్రమంబుల వాసనల్ విడనాడి
మహి నతి వర్ణాశ్రమస్థుఁడగుచు
విగత కామాది షడ్వర్గ విభవుఁడగుచు
సమధికోన్మత్త బాలపిశాచవృత్తి
నరుగునాతండు ననుబోలె నఖిలమునకు
జూడ గురుఁడగుగాని శిష్యుండుగాఁడు. 36

గురుమహిమ లిట్టివనుచును
బరగఁ భాషింపవశమె భాషాపతికిఁ
గురుమహిమ తెలియనేరని
నరునకు మోక్షంబులేదు నానాగతులఁ. 37

హరుఁడు కోపింప రక్షించు గురువరుండు
గురుఁడు కోపింప రక్షింప ధరణిగలరె

గురుఁడె రుద్రుండు, విష్ణుండు; గురుఁడె యజుఁడు,
గురుఁడె పరమాత్మ యతనికిఁ బరుఁడులేఁడు. 38

శివుఁడు గురురూపమై వచ్చి చెప్పకున్న
నిరత నిర్మల నిర్గుణ నిర్వికార
నిత్యపరిపూర్ణ తత్త్వంబె నేనటంచు
తెలియఁబడుటెట్లు గ్రంథముల్ దెలుపగలవె? 39

గురుబోధ లేనివారికిఁ
బరగ ననేకార్థశాస్త్ర పాఠవ్యసనం
బెఱుకను దొరకొనజేయునె?
పరిపక్వము గానివాని భ్రాంతులుగాకన్. 40

మఱియు నీశ్వరానుగ్రహంబున పరిపూర్ణబోధంబు గల్గదేయనిన నీశ్వరుని నిజరూపం బెఱింగి భజించినంగాని పూర్ణానుగ్రహంబు గల్గదదిలేక ముక్తి లేదట్టి యీశ్వరు నిజరూపంబు సద్గురుప్రసాదంబునఁగాని తెలియఁబడ దట్లు తెలియక భజించుటవలన పుణ్యఫలంబెకాని యీజన్మంబునఁబూర్ణబోధంబు కలుగ దట్లౌట నెన్నివిధంబులనైన గురూపదేశంబుచేఁగాని యీజన్మంబు నందె కేవల ముక్తి సంభవింప దట్టి గురుమూర్తిని చతుర్విధ శుశ్రూషల సేవింపని దేహాభిమానులకు ముక్తిలేదని వేదపురాణజాలంబులు పలుకుచుండునని చెప్పి వెండియు నిట్లనియె. 41

గురుభజనమె హరభజనము
గురునిందయె హరునినింద గురుభక్తియె దా
హరభక్తియగును దలఁపఁగ
గురుహరులకు భేదిమెద్ది కోవిదులారా! 42

గురుపాద జలము గ్రోలుట
గురుతర గంగోదకంబు గ్రోలుటగాదే
గురుసుప్రసాదసేవన
మరయ పురోడాశ భక్షణాతిశయమగున్. 43

గురునిర్ణయ విధమెఱుంగక
గురుభక్తియు లేక మనసు గుదియింపని పా
మరుఁ డుపదేశంబొందిన
దొరకునె సన్ముక్తి యెన్ని త్రోవలనైనన్. 44

ఇట్లు గురు లక్షణస్థితి యెఱిఁగి యతని
వలన మోచకు ననుగాంచి లలితభక్తి
నన్ను భజియించెనేనియు నాదుకరుణ
విగతషడ్వర్గుఁడై ముక్తి విభవమొందు. 45

ఎన్ని విధంబులనైనను
పన్నుగ కామాది శత్రుపంక్తిని విజయా
భ్యున్నతి నణఁచక మోక్షం
బెన్నటికిని గలుగనేర దేరికినైనన్. 46

అని బోధించిన దక్షిణాస్యునకు సాష్టాంగంబు గావించి య
మ్మును లాత్మైక్య సమాధిఁజెంది యగరాణ్మూలస్థలిన్ నిల్చి "ర
య్యనఘాద్రీంద్ర మహత్వ మెన్నదరమే యాచక్రవాళావనిన్
ఘనతంగాంచు నగంబు లిగ్గిరి లసద్గండోపభాగంబులే." 47

అని చెప్పి శివుండు పార్వతికి మఱియు నిట్లనియె. 48

ఉరు తదద్రి మాహాత్మ్య మటుండనిమ్ము
గుణవికారత మాని నిర్గుణ సమాధి

బూని యేనందు దక్షిణామూర్తి నొచు
వెస వసించితి నగ్గిరి విడువకుండు. 49

ఇట్లు నివసించిన మద్రూపంబు సేవింప నా త్రికూటాచల కూటాధిపతులగు బ్రహ్మ విష్ణు రుద్రు లరుదెంచి దేవా : నీవు చిదాకాశ రూపంబగు పరశివ తత్త్వంబవయ్యును ఘృత కాఠిన్యమూర్తియగు సదాశివు రూపంబు బొంది యిమ్మునుల కనుగ్రహింప నిపుడు దక్షిణామూర్తి లీల నంగీకరించి యిన్న గంబున నిరంతరంబు నుండఁదలంచుటవలన నేము నస్మచ్ఛిఖరాగ్రంబు లందు నిలిచి నిన్ను సేవింపు చుండెదము. నీవు ననేకకోటి బ్రహ్మాండంబుల కధీశుండవగుట కోటీశుండవని నిన్నఖిలలోకంబులుఁ బలుకుఁగాక యనిన నద్దేవుండు రానంగీకరించి వారల కిట్లనియె. 50

మీకు నిలయంబులై కాంతి మెఱయుచున్న
మూఁడు శిఖరంబులందున మూఁడులింగ
రూపములనుందు, మీరు నిరూఢభక్తి
పూజ గావింపుఁ డానంద పూర్ణులగుచు. 51

ఈమూఁడు లింగంబు లిహమందు మర్త్యుల
కగపడకుండుట నవనిజనము
లా మూఁడు శిఖరంబులందున పటుశిలా
రచితలింగంబు లేర్పఱిచి భక్తిఁ
బూజించి యిహపరముల భోగమోక్షంబు
లందంగ గల రనాయాసవృత్తి
నని సర్వగురుఁ డీశుఁ డానతి యిచ్చిన
నజ జనార్దన రుద్రు లాత్మ శిఖర
ములను నివసించి తల్లింగపూజనంబు
సేయుచున్నారు తన్మహాక్షేత్ర మహిమ
వేయి యుగములకైనను వేయినోళ్ళ
శేషఫణిరాజుకైనను జెప్పఁ దరమె. 52

ఫలశ్రుతి

ఈ కథ వినినను జదివినఁ
బ్రాకటముగ భోగమోక్షపదవులు గలుగున్
జేకూరు ముక్తి సౌఖ్యం
బాకల్పాంతంబు కీర్తి యవనిని నిలుచున్. 53

అనిన మహాదేవున కుమాదేవి యిట్లనియె. 54

రత్నకాంచన రాజితరాజితంబు
లైన శైలంబులను బాసి యంధకారి
ఘోరపాషాణ జర్జర దారుణాద్రి
శిఖర మెట్టులుచేరెనో చెప్పు మభవ ! 55

అన విని శంకరుఁ డిట్లను
వినుము త్రికూటాద్రిరాజ విభవము జెప్పం
గను శక్యమౌనె యేరికి
ముని సుర గంధర్వ సిద్ధ పూజిత మెపుడున్. 56

త్రికూటాద్రిమహిమ

పూర్వయుగంబుల భూరి రాజిత రత్న
శృంగ సంఘాతమై చెలఁగుచుండి
కలియుగంబున శిలాకలిత శృంగంబయ్యె
నిదిగాక యి న్నగం బెంచిచూడ
సరసిజభవ విష్ణు శర్వ మహేశ స
దాశివమూర్తియై తనరుచుండు
శృంగంబులును మూఁడు శివహరిబ్రహ్మలు
నగరాజ మీశ్వరుండగుఁ దదగ్ర

లింగము సదాశివుండుగ లీల బ్రహ్మ
పంచకాకృతి నొప్పుచు పరమమౌని
జాలసంగతమైన యాశైలమహిమ
బూని కొనియాడఁదరమె వాగ్జానికైన. 57

అరయగఁ బంచకృత్య విభవాస్పదమై తగు బ్రహ్మపంచకం
బురుతరమూర్తిగాక భువనోన్నతమై తగు న న్నగంబుతో
సరియనవచ్చునెట్లు హిమశైలసుమేరు మహీధ్రరౌప్య భూ
ధర వర మందరాద్రులు సదాశివవాసములయ్యు నెంతయున్. 58

ఏ వంకన్ గనుఁగొన్న శృంగములు మూఁ డేపార గన్పట్టుటన్
భావింపంగ త్రికూటనామకముచే భాసిల్లు న ప్పర్వతం
బేవేళం దెడలేక నిల్చె శివుఁ డం దేకాంత మౌనస్థితిన్
ధీ విశ్రాంతి వహించు చోటగుట యందే నిల్చి రమ్మౌనులున్. 59

అట్టి దివ్యస్థలంబున నభవుఁగూర్చి
జపతపంబులు గావించు జనుల కిష్ట
సిద్ధు లతివేగముగనిచ్చు శివుఁడు భక్త
కామధుఙ్మూర్తి సమ్మనిఖ్యాతకీర్తి. 60

అచ్చోట నొకసారి యభవు నామముఁబల్క
సాహస్రనామ సంస్మరణ ఫలము
నచ్చోట నతిథికి నన్న మించుక యిడఁ
గోటి భూవిబుధుల కొసఁగు ఫలము
అచ్చోట దొనలలో నభిషేక మొనరింప
సార్ధత్రికోటి తీర్థాళిఫలము
అచ్చోట శివయోగి కణుమాత్రమిచ్చిన
మేరుదానోన్నతి మీఱు ఫలము

నెసఁగ నొసఁగెడి నా త్రికోటీశు నీశు
నర్థిఁబూజించి దిక్పాలకా ద్యమర్త్య
గరుడ గంధర్వ యక్ష కిన్నరులు నరులు
నిజ మనోభీష్ట సిద్ధులు నెమ్మిఁగనిరి. 61

ఆ కోటీశ్వరుఁగొల్చి యోగు లిల బ్రహ్మైకాన్యానుసంధానులై
రా కోటీశ్వరుఁగొల్చి భక్తు లొగి తారాద్రీంద్ర సంవాసులై
రా కోటీశ్వరుఁగొల్చి కర్మఠులు దేవావాస సంచారులై
రా కోటీశ్వరుఁగొల్చి లౌకికులు నిత్యైశ్వర్యులై రెంతయుఁ. 62

ఏమని చెప్పవచ్చుఁ బరమేశుని కన్నగమందుఁ బ్రేమ సు
శ్రీ మహనీయ బిల్వవనసీమల గాంచన పుల్లహల్ల కో
ద్దామ సరోవరంబుల సుధామధుజీవన నిర్ఝరంబు లం
దా మునికోటితోడ ననయంబు విహారముసల్పు నెంతయున్. 63

మూఁడు మూర్తుల రూపమౌ మూఁడు శిఖర
ములనుగాక యితర దేవమూర్తులయిన
హ్రస్వశిఖరంబు లెన్నేని య గ్గిరీంద్ర
మందు గల వన్నియునుజెప్ప నలవియగునె ? 64

గుహలును బిలములు దొనలును
బహుళముగా బిల్వవనులు వాపీతతులుఁ
మహిమాస్పద సిద్ధక్రియ
లహహా ! యసంఖ్యంబు లెపుడు న గ్గిరిమీఁదఁ. 65

కరిహరి శంబర కాసర
కరిహరి భల్లూక గవయ గండక చమరీ
శరభ వ్యాఘ్రాదిభయం
కర మృగము లనేకకోట్లు గల వ గ్గిరిపై. 66

ప్రస్ఫుట చ్ఛత్రాభ బర్హి బర్హచ్ఛాయ
పవళించి నిద్రించు ఫణిగణంబు
నట దుగ్ర పంచాస్య నఖనిరాకృత గండ
కండూతియైన వేదండచయము
శరభ పక్షోద్ధూత చటులానిలంబున
స్వేదంబు నణఁగించు సింహసమితి
వనగత శార్దూల వాహనారూఢులై
చరులలోఁ గ్రీడించు శబర వితతి
గలిగి యచ్చోటఁగల భూతములకు నెపుడు
జన్మజాతివిరోధముల్ సడలిపోవ
తపముజేసిన మౌనుల తపముకలిమి
కభవు డెంతయుఁ బ్రత్యక్షమగుచునుండు. 67

శిల లన్నియు లింగంబులు
జల మంతయుఁ దీర్థ మచట సన్మతి నందున్
గలకాల ముండు వారికిఁ
గల కాలమె సఫలమైన కాలము తలఁపన్. 68

మాటలేటికి నచ్చోట మలహరుండు
బ్రహ్మపంచకరూపమౌ పర్వతేంద్ర
మగుచు నుండియుఁ దచ్ఛిఖరాగ్రమందు
లింగమైయుండె మానవశ్రేణిఁ బ్రోవ. 69

శివరాత్రి నా శైవ శిఖరంబుపై కెక్కి-
దొనలలో స్నానంబు దనరఁ జేసి
భసితంబు దేహంబుపై నిండుగాఁ బూసి
రుద్రాక్షమాలికల్ రూఢిదాల్చి

శైవపంచాక్షరీ జప మొప్పఁగాఁ జేసి
యుపవాస జాగరం బొనర సల్పి
రంగారు కోటీశ లింగ మస్తకమందు
బిల్వ దళంబులు బెట్టిరేని
మోక్షమప్పుడె గల్గు ముముక్షువులకు
తపము లేల ? మహా మంత్రజపము లేల ?
క్రతువు లేల ? సుదుష్కర వ్రతము లేల ?
యోగ మేల ? నిరంతర త్యాగ మేల ? 70

శిఖరాగ్ర గైరికాశేషధాతు ప్రభా
చ్ఛన్న లతావళుల్ జడలు గాఁగ
నిఖిల శృంగోద్భూత నిర్ఝర వాహినుల్
రమణీయ సర్పహారములు గాఁగ
ఘననితం బాభోగ కాదంబినీశ్రేణి
కటి తటి గజచర్మ పటము గాఁగ
శశికాంత విస్ఫుట స్ఫటికచ్ఛవివ్యాప్తి
పూసిన సితభూతిపూత గాఁగ
మౌని సేవితమగుచును మౌనముద్ర
దనరఁగా దక్షిణామూర్తి యనఁగనొప్పు
నమ్మహీధ్రంబు తనచుట్టు నర్థిఁ దిరుగు
జనములకు వేగ భోగ మోక్షము లొసంగు. 71

పిఱుదులు పొదుగు నిండను పెద్దకాల
ముండి తత్ క్షీర మెఱుఁగక యుండినట్లు
ల గ్గిరిని నెప్పు డుండియు నల్పమతులు
తత్ప్రభావంబు గనలేరు తథ్యముగను. 72

ఎఱుగని వారికి నెఱి ప్రపంచముగాఁగ
గనుపడి యెఱిగిన ఘనులకెపుడు
బ్రహ్మమై యుండిన పరశివు కైవడి
య మ్మహాపర్వతం బరసి చూడ
నెఱుఁగని వారికి గిరిరాజముగఁ దోఁచి
యెఱిఁగిన విజ్ఞానివరులకెపుడు
నజ హరి రుద్రేశ్వ రాఢ్య సదాశివ
పంచకాకృతిగ నేర్పడఁగఁ దోచు
తన్మమహత్వంబు చిత్రమౌ తత్త్వవేది
బృంద సంసేవ్యమును మహానందదాయి
యైన య గ్గిరి నివసించునట్టివారి
కిష్ట సిద్ధు లొసంగు కోటీశ్వరుండు. 73

ఆ పరమాద్రిరాజ శిఖరాగ్ర దృషన్మయ సద్మమందు తా
రాపతి శేఖరుండు సుచిరంబుగ నుండుట త జ్జటాటవీ
దీపిత యౌ సురాపగ నదీముని వారిధిఁ జేరబోవు నెం
తే పరిపూర్ణ మౌ నొక నదీతిలకంబు వసించు నచ్చటన్. 74

అరయంగ ద్రికూట స్థలి
పరగఁగ నోంకార మెపుడు భాసిలుచుండున్
ధరణి త్రికూటాద్రి స్థలి
పరగఁగ నోంకార నదియు భాసిలుచుండున్. 75

అన విని పార్వతి యిట్లను
మునిసేవిత ! యచటి నదికి మోక్షప్రదమై
చను ప్రణవాభిధ యిల నే
యనువున వర్తించెఁ దెలియ నానతి యీవే? 76

అని మహాదేవి పలికిన నభవుఁడనియె
ఘనతరంబైన యా నదీజననవిధము
తత్ప్రభావంబు సర్వంబు తథ్యముగను
తెలియ జెప్పెద విను హిమాచలతనూజ! 77

## ఓంకార నదీ వృత్తాంతము

మును శిబిచక్రవర్తి పరభూభుజులన్ బరిమార్చి వేడ్కమే
దిని గిరి వార్ధి కానన నదీ సహితంబుగనేలి, సర్వభూ
మినిఁ గల భోగ భాగ్యము లమేయగతిన్ భుజియించి మించి తా
వనమున కేఁగె నందు నపవర్గము గోరి తపంబు నేయఁగన్. 78

చని యాతండు త్రికూటనామక మహాశైలాధిరాట్పశ్చిమా
శను దానేగియు యోజన త్రయిని శేషాద్రీంద్ర పుచ్ఛస్థలీ
ఘన భూభృన్నికటంబునందు నిలిచెం గాంక్షావిహీనస్థితిన్
మునివేషంబున వల్కలాంబర జటామూర్ధప్రభాభాసియై. 79

అందు నొక పర్ణశాలయం దధివసించి
మున్ను తన రాజ్యభోగంబు లెన్నికొనుచు
నింతకాలంబు విషయైకచింతచేత
పోయెఁగాలము తృష్ణ తాఁ బోవదయ్యె. 80

అని తలంచుచుఁ దన మనంబున నిట్లని వితర్కించె. 81

తలిరుంబ్రాయము మోహినీసదృశ సౌందర్యంబు విన్నాణముల్
గులుకుం గుబ్బలు నవ్వుమోము సుమనః కోదండభ్రూవల్లరుల్
గల కాంతామణులన్ రమించితి ననేకావృత్తినైనం గనం
గలనే తృప్తి యొకింతయేని యహహా! కామంబు దుర్లంఘ్యమౌ. 82

ధనము రాసులు మేరు మందరము లట్లు
గూర్చితిని బుత్రపౌత్రులఁగూడి సుఖము
నొందితినిగాని తృప్తి దా నొందదయ్యె
నీషణత్రయమును గెల్వ నెవరితరము ? 83

దానములు పెక్కు జగదేకదాతనౌచు
జేసితిని జన్నములు వేయుఁ జేసినాఁడ
నిన్ని చేసిన ముక్తి లే దెంచిచూడ
తుచ్ఛసంసార మోహంబు దొలఁగకుంట. 84

రోగ దారిద్ర్య బంధు విరోధగేహ
కలహ దౌర్భాగ్య దుఃఖసంకలితులయ్యు
వికట సంసారమోహంబు విడువలేరు
వివిధ సుఖభోగవంతులు విడువగలరె ? 85

ఇటువంటి సంసృతి భ్రమ
నెటులైన న్విడువకున్న నెవ్వరికైనన్
ఘటియించు నరకవాసము
కటకట ! సంసార మింత కష్టంబగునే ? 86

అనుచు మహా ధైర్యంబున
జననాథుఁడు సుతులు హరులు సామజఘటలున్
ధనధాన్య వస్తుసంపద
లనయ మనిత్యంబటంచు నాశదొరంగెన్. 87

ఇట్లు విరక్తుండై యన్నరేంద్రుండు తొల్లి గురూపదేశ శాస్త్రంబులవలనం బడసిన విజ్ఞానంబున తాను శుద్ధచైతన్యం బనియును, తనయందు నారోపితంబైన ప్రపంచంబు తాననియు దెలసియు, జ్యోతిశ్శాస్త్ర విచారంబున గ్రహమండలస్థితి తెలిసియు గ్రహలోకప్రాప్తి లేనియట్లు మననంబులేమి

సమాధి వాసనా త్యాగయోగంబులు సంభవించని కతంబున బ్రహ్మపదా
రూఢి నొందనైతి నిదిగాక దేహాభిమానులై పరస్త్రీ రతులై పరహింసా
పరులగుచు కామక్రోధాదిగ్రస్తులైన శుద్ధతామసులు గురూపదేశశాస్త్ర
బోధంబుల నీజ్ఞానంబుగల్గియు రావణాద్యసురులంబోలి దండార్హులగుదురు
గాని ముక్తినొంద రట్లగుట శుద్ధసాత్వికులయిన యధికారు లీజ్ఞానంబుగల్గి
యీశ్వరోపాసనంబు జేసినఁ గ్రమంబుగా మనన సమాధి వాసనా త్యాగ
యోగంబులుగల్గి ముక్తిగాంతురని తలంచి తాను నీశ్వరోపాసనంబు చేయం
దలంచియున్న సమయంబున. 88

శిబికడ కగస్త్యుఁడు వచ్చుట

శుద్ధశైవుఁ డగస్త్యుఁ డా క్షోణినాథుఁ
పాలి కేతెంచి మోచకోపాసనంబు
నీకుఁ దెల్పంగవచ్చితి నేఁడు మోచ
క ప్రదుఁడనయి తద్విధికలన వినుము. 89

అని మునిముఖ్యుఁడు మోక్షము
దనరంగాఁదెల్పి యంతఁ దదుపాసనముఁ
మనమునఁ బనుపడఁ జేసిన
జననాథుఁడు వికచహృదయ జలజాతమునన్. 90

ధ్యానంబుజేసె నీశ్వరు
మానితవట మూలదేశ మణిమండపమ
ధ్యానూన సింహపీఠిక
బూనిక గిరిజాసమేతముగ సద్భక్తిఁ. 91

సనకాది సన్ముని సంఘంబు లిరువంక
నుతియింపఁ బ్రమథు లున్నతి భజింప

గనకలతా పింగ ఘనకపర్దముతోడ
గంధర కంధర కాంతితోడ
నురగ హారావళీ స్ఫురిత వక్షముతోడ
బాహాచతుష్క విభ్రమముతోడ
కటిరూఢ గజచర్మపట విలాసముతోడ
వీరాసనాభ్యాస విధముతోడ
దనరు శ్రీ దక్షిణామూర్తి దనదు చిత్త
పద్మమందున నిల్పి తాఁ బరమభక్తిఁ
దపముగావించు నారాజు తపము జెఱుపఁ
దలఁచె నింద్రుండు కపట కృత్యంబుతోడ. 92

అంతఁదా నొక్క శ్యేనంబై పావకుండు కపోతరూపంబై రాజు మఱుంగున కరిగిన దాని భక్షించు తెఱంగునఁ దన్నికటంబున కేఁగిన నన్నరేంద్రుండు శరణాగత రక్షకుండగుట నక్కపోత సమాన మాంసంబిచ్చి దాని బ్రది కించెదనని నిజ దేహస్థిత మాంసంబు నిశితాసిం జెండి తులారోపణంబు చేసిన నది కపటకపోతంబగుట స్వదేహస్థిత సర్వమాంసంబును దానితోడ సరిఁదూఁగకున్న తన శిరోదేశంబున బిలంబు గావించి శిరస్థితమాంసం బంతయుఁ దులయందిడు సమయంబున నమ్మహేశ్వరుండు, 93

శివుఁడు శిబికిఁ బ్రత్యక్షమగుట

అతని ధైర్యంబునకు మెచ్చి హర్యజాది
సురలు గొలువంగ బార్వతీ సుదతిఁగూడి
నందివాహనమెక్కి యానందమొదవ
యవనిపతి కంత నెదుటఁ బ్రత్యక్షమయ్యె. 94

ఇట్లు ప్రత్యక్ష మగుచు న య్యీశ్వరుండు
క్ష్మాపతినిఁ జూచి యో శిబిచక్రవర్తి!

నేను మెచ్చితి నీతపో నియతి కిపుడు
కోర్కులేమైన నిచ్చెదఁ గోరుమనియె. 95

అనిన నమ్మహీజాని దేవా! ముక్తి ముక్త్యుపాయంబులు దెలిసియు దేహాభిమానంబునఁ గామ క్రోధాద్యంతశ్శత్రుల జయింపం జాలమి మనన సమాధి వాసనాత్యాగ యోగంబులు లభింపక ముక్తుండఁగానైతి నిపుడు మోచకప్రదుండగు కుంభసంభవు వలన మోచకుండవగు నిన్నెఱింగి భజించుట చేత భవత్ప్రసాదంబున దేహాభిమాన కామక్రోధాదులు వదలుటచేత నచల బ్రహ్మంబు నేనయై ముక్తుండనైతి నింక నాత్మదృష్టి నాకంటె నన్యంబేమియు లేకుంట నేనేమి కోరువాఁడ ? నింతకాలం బవిద్యా ప్రతిబింబ చైతన్యుండనై జీవుండనఁబడి కించిద్‌జ్ఞత్వంబున ననేక జన్మంబుల సుఖ దుఃఖంబు లనుభవించి మాయా ప్రతిబింబ చైతన్యుండవై యీశ్వరుండవై నీవు సర్వజ్ఞత్వంబున బ్రహ్మంబవగుట నిన్ను గురూపదేశంబున నెఱింగి భజించుట నీవు నేనయై యచల బ్రహ్మస్వరూపుండనైతి నహో! గురూపదేశం బింతచేసె నభ్యాసశూన్యులైనవారికి గురునియందు మనుష్యబుద్ధి జనించుఁగాని గురుండు సాక్షాత్పరబ్రహ్మం బని యానందించు నన్నరేంద్రునకు శివుం డిట్లను. నీవు విదేహ కైవల్యంబు నొందుము. నీకళేబరంబు కపోతేశ్వర నామక లింగంబై యాకల్పంబు వసించుగాక యని యంతర్ధానంబుఁజెందె నంతట. 96

అతడుఁ బ్రారబ్ధ నాశనం బగుటవలన
బ్రహ్మమయ్యెను సంకల్పపటలి బాసి
తచ్ఛరీరంబు లింగమై ధరణినిలిచె
నది మహాద్భుతమని యెంచి యచటిమునులు. 97

ఆ లింగమూర్తికి నభిషేక మొనరించి
రోంకార మంత్రంబు నుచ్చరించి

యా మంత్రతోయంబు లాలింగ మూర్ధస్థ
బిలమధ్య గతములై పృథివిలోని
కరిగి యచ్చటఁ బుట్టె వరనదీతిలకంబు
సలలి తోంకారాఖ్య గలిగి యదియు
నా త్రికూటాద్రికి నపరభాగంబునఁ
బ్రవహించె నిర్మలవారి యగుచు
నట్టి యోంకార నదియందు నహరహంబు
స్నానములు సేయు నా గుహాస్థల నివాస
సిద్ధ సంఘంబు నిజయోగ సిద్ధికొఱకు
తన్మహత్వంబు వర్ణింపఁ దరమె జగతి? 98

ఇట్టి విధంబున జగతినిఁ
బుట్టెనె మున్నెన్నఁడైన బొసగఁగ నదు లే
పట్టున నిట్టి మహత్వము
గట్టిగ లేదనుచు విబుధగణము నుతించెన్. 99

అట్టి యోంకారనదియందు నధిక భక్తి
మునిఁగి తజ్జలోదీర్ణమౌ పూర్ణకలశ
మెత్తికొనిపోయి గిరిని కోటీశలింగ
మూర్తి కభిషేక మొనరింప ముక్తిగలుగు. 100

నగము త్రికూటంబట, నా
పగ దా నోంకారనామ భాసితయట, సొం
పగు వనులు బిల్వవనులట
యగు లింగము దక్షిణాస్యుఁడట చిత్రమగున్. 101

గిరులును నదులును వనములు
నరుదుగ లింగములు గల మహాస్థలు లెన్నో

ధర గలవుగాని యీదృశ
గిరి సరి దారామ లింగ కీలితగతులే ? 102

మఱియుఁ గలియుగంబున మహాస్థలంబులందు దేవతలు తిరోహిత నిజ మహిమానుభావులై ధర్మకర్త్రిధీన నిజోత్సవాది కృత్యులగుదు రక్కా లంబున జనంబు లనధికారులయి శిశ్నోదర పరాయణులయి వృథాద్వైత వచన రచనా ప్రవీణులై మహాస్థలస్థిత దేవతామూర్తులయందు శిలాబుద్ధి గలిగి నిరీశ్వరవాదంబు సేయుదు రట్లవుట సర్వోపదేశ దేశికుండగు దక్షిణామూర్తి కోటీశ్వరుండై త్రికూటాద్రియందు నిలిచి ప్రత్యక్ష ప్రమాణంబులు సూపి నిజోత్సవాదికృత్యంబులకుఁ దాన ధర్మకర్తయై నిర్విఘ్నంబుగాఁ జెల్లింపుచుండు నిట్టి దివ్యస్థలం బెందును లేదని చెప్పి శివుండు వెండియు నమ్మహాదేవి కిట్లనియె. 103

గురుతరేశ్వరమూర్తియౌ కుధరమందు
హరి హర విధాతృరూప కూటాగ్రములను
మూఁడు లింగంబులై యుండి మూఁడులోక
ములను రక్షించు దక్షిణామూర్తి యెపుడు. 104

మఱియు నగ్గిరీంద్రంబునందుండు దివ్యకూట దివ్యలింగత్రయంబు కలియుగంబునఁ దిరోహిత నిజమహిమంబై కేవల శిలారూపంబునఁ గనఁబడియు నిష్టసిద్ధు లొసంగు నా దివ్యకూటత్రయ లింగత్రయప్రభావం బెట్టి దనిన. 105

త్రికోటీశ్వర మహిమ

ఆ రుద్రాత్మక మధ్యశృంగ మహిమం బత్యద్భుతం బెన్న దు
ర్వారప్రేమ విధీంద్ర ముఖ్య దివిషద్వారంబు కోటీశు దీ
క్షారూఢిన్ మది నిల్పి కొల్చుచుఁ దదంచద్ద్రోణికోపాంత సు
శ్రీరమ్యాయత బిల్వకాననములం గ్రీడించు నశ్రాంతమున్. 106

వెండియు నఖండ పాండు డిండీరఖం డాఖండలోద్దండ వేదండ కుంద లీంద్ర చంద్ర చంద్రఖండ తార హార హీర పారావార నీహారాచ్ఛచ్ఛవి భాసురంబై కైలాస శిఖరాకారంబగు నా రుద్రశిఖరంబున రుద్రుం డుమా స్కంద నంది గణనాథ చండి భృంగి మహాకాల ప్రముఖ ప్రమథగణనాథ యూథంబులు కొలువ నిత్యసన్నిహితుండయి వసియించు నెంతయు. 107

గురు రత్న భాసుర గోపురంబులతోడ
పరితప్త హేమ కుంభములతోడ
ప్రస్ఫుట స్ఫటికాశ్మ పటుభిత్తికలతోడ
విమల కర్బుర కవాటములతోడ
గోమేధికోపల కుట్టిమంబులతోడ
శశికాంత సోపాన సరణితోడ
వర పద్మరాగ శుంభత్ స్తంభములతోడ
హరినీలరుచిర గేహాళలతోడ
నమరి యమరీ కదంబ గానావలంబ
ప్రాంగణ స్థల సంగత ప్రమథరాజి
రాజితంబైన దివ్య హర్మ్యాగ్రసీమ
నవ్య నవరత్న సింహాసనంబునందు. 108

శర దుజ్జృంభిత చంద్రకోటి రుచితోఁ జంద్రార్ధజూటంబుతో
నురగేంద్రోజ్జ్వల హారవల్లరులతో నుద్యత్కపర్దంబుతో
హరి నీలాంచిత నీలకంధరముతో నానందరూపంబుతో
గిరిజాకాంతను గూడియుండు నురుభంగిన్ రుద్రుఁ డశ్రాంతముః.109

స్కంద భైరవ గణనాథ శాస్తృ వీర
భద్రులాదిగ శతకోటి రుద్రు లఖిల
దిశల గొలువంగ హర్యజాదిక సుపర్వ
సమితితోగూడి రుద్రుఁ డాసభ వసించు. 110

అందు మూఁడుదినంబు లతిభక్తితో నిల్చి
ప్రాచీన కోటీశ భవ్యలింగ
మునకు నర్ఘ్యము పాద్యమును మధుపర్కము
స్నానంబు వస్త్రంబు జన్నిదంబు
భస్మ గంధాక్షతల్ బహు పుష్పమాలికల్
మారేడుదళములు భూరి ధూప
దీప నైవేద్యముల్ దివ్య తాంబూలంబు
నీరాజనంబును నెఱిఁ బ్రదక్షి
ణము లనంగను షోడశ క్రమవిధాన
పూజ లొనరించి తన్మంత్రమును సహస్ర
జపము గావించి ధ్యానంబు సలిపిరేని
భోగ మోక్షంబు లిహపరంబులను గలుగు. 111

ఆ శిఖరరాజమందున
పాశచ్ఛేది శివమూర్తి పమపడి నిలువన్
క్లేశంబుల నెడఁబాసి ది
గీశావళి మేలు నొందె కేవల మగజా! 112

అందు నేను సదాశివఖ్యాతిఁ దనరి
లీలఁ బ్రాచీన కోటీశ లింగమగుచు
నుండి యుండుట నమఁ గొల్చుచుందు రెపుడు
రుద్రు లాత్మగణాళితో రూఢి మెరసి. 113

విష్ణు శిఖరము

అమ్మహారుద్ర వాసమైనట్టి శిఖర
మునకు వలపల శ్రీ విష్ణుమూర్తి శిఖర
ముండు దానికిఁ గ్రిందుగా నుండు నొక్క
దొన సురాపగాంబు సమాన తోయ యగుచు. 114

జలజాక్షు పాదమూలము
వలనం గనుపట్టు గంగవలెఁ దగ నేత
జ్జలజాక్షు శిఖర మూలము
వలనం గనుపట్టె దొనయు వైభవ మెసఁగన్. 115

ఆ దొన పశ్చిమంబున మహాద్భుతమై శశికాంత కాంతి సం
పాదక దివ్యతేజమయి పాపవినాశన లింగ మొప్పు, న
చ్చోఁ దనరారు సిద్ధతతి సొంపగు నా దొనలోన దోఁగి య
త్యాదర భక్తి నాశివున కర్చనసేయు నభీష్టసిద్ధికై. 116

కాలాభ్ర భ్రమరాభ్ర విభ్రమ మహాకాలోరుకంఠప్రభా
నీలాశ్మ ప్రతిభా తమాలలతికా నీలాబ్జ కాలాంజన
శ్రీ లాలిత్య విలాస విష్ణుశిఖర శ్రేష్ఠాంతర ప్రస్ఫుట
ప్రాలేయాంశుదృష ద్వినిర్మిత మహాప్రాసాద మధ్యంబునన్. 117

సంతప్త హేమ నిర్మిత
చింతామణి ఖచిత దివ్యసింహాసన వి
శ్రాంతుం డగుచును లక్ష్మీ
కాంతుండు జగంబుఁ బ్రోచుఁ గరుణానిధియై. 118

నీల నీరద నీల నీలాబ్జ వర్ణుండు
కటి తట సౌవర్ణ పటయుతుండు
శంఖ చక్ర గదాసి సాధన సహితుండు
కౌస్తుభాభరణ సత్కాంతియుతుఁడు
బహు రత్న నూపుర బాహాచతుష్కుండు
మకర కుండల గండ మండితుండు
శ్రీవత్స సింధు జాశ్రిత దివ్యవక్షుండు
భుజగరాట్పర్యంక భూషణుండు

సకల లోకై కనాథుండు శార్ఙ్గ ధన్వి
గరుడ జయ విజయ సునంద పరమ భాగ
వత వతంసంబు లెంతయు బలసి చుట్టు
గొలువఁ గొలువుండు విష్ణుఁడ క్కూటమునను. 119

అచ్చోట నతిభక్తి నైదుదినంబులు
నిల్చి త ద్ద్రోణికానీరములను
స్నానంబు నేసి భస్మ త్రిపుండ్రాంకముల్
ధరియించి రుద్రాక్షధారి యగుచు
మునిసేవ్య పాపనాశన లింగమూర్తిని
బిల్వదళంబులఁ బ్రీతితోడ
నర్చించి దృఙ్మనః ప్రాణంబు లొకచోటఁ
గలయ సమాధి సంకలితుఁడగుచు
తపమునల్పిన నష్టవిధంబులైన
సిద్ధులును గల్గు దగఁ గాయసిద్ధి దనరు
నితర సిద్ధులు సిద్ధించు నిచ్ఛలేక,
యుండెనేనియు మోక్షంబునొందు వేగ. 120

అందు నేను మహైశ్వర్య కందమగుచు
పాపనాశన లింగమై పరగుచుండ
నన్ను సేవింపుచుండు నా నలిననాభు
డధికభక్తిఁ ద్రికాల పూజాభిరతుల. 121

బ్రహ్మశిఖరము

రుద్రశిఖరంబు వలపల భద్రదంబు
బ్రహ్మశిఖరంబు భాసిల్లుఁ బ్రస్ఫుటముగ
నెలమి నందుండు నూత్నకోటీశలింగ
మచటి మహిమంబు వర్ణింప నలవియగునె. 122

తరుణారుణారుణ ఘుసృణ
కిరణాకృతి సాంధ్యకాలకీలిచ్ఛాయా
స్ఫురణాఢ్య బ్రహ్మశిఖరా
వరణాంతర సౌధమధ్య వరపీఠమునన్. 123

మంజుహాటక కంజ కింజల్కవర్ణుండు
పద్మరాగ కిరీట భాసితుండు
గండ మండల రత్నకుండల లలితుండు
కేయూర మణిహార కీలితుండు
కల్పద్రుమాలికాకలిత వక్షోభాగుఁ
డుపవీత శోభితుఁ డున్నతాంసుఁ
డాజానుదీర్ఘ బాహా సముల్లాసుండు
వాణీవిలాసైక వదనకమలుఁ
డజుఁడు గొలువుండు వేదశాస్త్రాగమాది
విద్యలెల్లను దను జాల వినుతిసేయ
గరుడ గంధర్వ యక్ష కిన్నరులు సురలు
సిద్ధసాధ్య సమూహముల్ చేరి కొలువ. 124

అచ్చోట నొకపక్ష మతిభక్తితో నిల్చి
దొవలలో స్నానంబు దనరఁ జేసి
భూతిరుద్రాక్ష విభూషణుండయి దివ్య
పంచాక్షరీమంత్ర పఠన మొప్ప
హృదయంబులోన కోటీశు నీశ్వరు నిల్పి
మానసపూజ నీమంబుతోడఁ
జేసి బాహ్యార్చన సిత పుష్ప నవ బిల్వ
దళములఁ గావించి లలిత నిష్ఠ

సేవఁ జేసిన మానసేప్సిత సమస్త
సిద్ధి లొనగూడు మోక్షసంసిద్ధి యగును
తద్గృహస్థల సంరూఢ తాపసాళి
దర్శనము గల్గ దుర్మోహతమము వాయు. 125

అందు నేనును రుద్ర విఖ్యాతిఁ దనరి
నూత్న కోటీశ లింగ వినోదలీల
నొప్పుచుండుట నా లింగ మెప్పు డధిక
భక్తిఁ బూజింపుచుండు న ప్పద్మజుండు. 126

ఇట్లు రుద్ర విష్ణు విధాతృ శిఖరత్రయంబున రుద్ర విష్ణు విధాతలు స్వపరివార సమేతంబుగాఁ గొలువుండి సదాశివేశ్వర రుద్రరూప లింగమూర్తినై యున్న నన్ను నిరంతరంబు భజియింపుచుందు రీ శిఖరత్రయ లింగత్రయ ప్రభావంబు కలియుగంబునఁ దిరోహితంబై యుండు నీ శిఖరత్రయంబున మనుష్య నిర్మిత శిలారూప ప్రాచీన కోటీశ పాపవినాశన నూత్న కోటీశ లింగంబుల భక్తి యుక్తి నారాధించిన మానవులు భుక్తిముక్తు లయత్నంబునఁ గాంతు రీశ్వరప్రసాద సంపన్నుల కెప్పుడును ద ద్దివ్యకూటత్రయ లింగత్రయ దర్శనంబగు ప్రాప్త ప్రసాదేతరులకు మంత్ర తంత్ర జప తపో యోగాది సాధనంబులఁ ద ద్దర్శనం బగమ్యంబగు ననిచెప్పి శివుండు వెండియు నిట్లనియె. 127

## శివుని నృత్యవర్ణన

అమ్మహా శైల శిఖరత్రయంబునందు
శ్రీ సదాశివేశ్వర రుద్ర భాసురాభి
ధాన లింగాకృతిని నిల్చి త త్ప్రదోష
కాలనృత్తంబు గావించుఁ గాలగళుఁడు. 128



నూత్న కోటీశ్వరస్వామి దేవాలయము

విరియబోసిన జటావిసరంబు కెంజాయ
సాంధ్యరాగ ప్రభాసరణిగాఁగ
నీల నీలాంబుజ నీలకంధర కాంతి
లలితాంధకార సంకలనగాఁగ
నాట్యవేగ విలోల నాకాపగావళీ
శీకరంబులు నుడుశ్రేణిగాగ
నతిసంభ్రమోద్భూత వితతాట్టహాసంబు
కమనీయ చంద్రికాకాంతిగాఁగ

తన ప్రదోష తాండవకేళి తగఁ బ్రదోష
కాల సామ్యతఁ బూన లోకాళిఁబ్రోవ
నృత్తమొనరించు సంధ్యల చిత్తజారి
య మ్మహాశైల కూటత్రయంబునందు. 129

వాణీశ్వరుఁడు తాళవాదనం బొనరింప
వాగ్దేవి వల్లకి పాటఁ బాడ
విబుధాధినాథుండు వేణువు పూరింప
గానంబు గావింప గమలసద్మ
మర్దలధ్వానంబు మధువైరి పొసఁగింప
వీక్షింపఁ బరశక్తి సాక్షియగుచు
ప్రమథాళి దేవతాపంక్తియు జుట్టును
నటనంబుఁ జూచి యానందమొంద

పరమశివుఁడు త్రికూటాఖ్య పర్వతాగ్ర
శిఖరములయందు నాట్యంబు నేయుచుండు
నదియు బ్రమథైకవేద్యమౌ నవని జనుల
కక్షి గమ్యంబు గాకుండు నద్రితనయ ! 130

అని చెప్పిన విని యుమాదేవి దేవా ! కోటీశ్వరుండు విష్ణు బ్రహ్మ శిఖరంబుల పాప వినాశన నూతన కోటీశ్వర లింగరూపంబుల నుండుట కేమి కతం బనిన శివుం డిట్లను— మున్ను దక్షాధ్వరంబున కరిగిన మునీంద్రులు కొందఱు సనకాదులంగూడి త్రికూటాద్రి కేతెంచి కోటీశ్వర ప్రసాదంబున విగతదోషు లగుట విని నిలింపులు దక్షాధ్వరంబునందు హవిర్భాగంబులు గొనిన స్వకీయ దురితంబు నపనయింప నా త్రికూటాద్రి కరిగి యందు విష్ణుశిఖరాగ్రంబునందుండు మహావిష్ణు దర్శించి పూజించి యిట్లనిరి. 131

దేవదేవ ! సరోజాక్ష ! దీనసులభ !
భక్తమందార ! యిందిరాప్రాణనాథ !
దక్షమఖమున మును హవిర్భక్షణంబు
సేయ మముఁ జెందు దురితంబు పాయుటెట్లు ? 132

పాపవినాశన స్థలమహిమ

అని నుతుల్గావించు నమరుల వీక్షించి
పద్మాక్షుఁ డిట్లనుఁ బ్రాజ్ఞులార !
పంచాక్షరీమంత్ర పఠనమ్ముఁ జేయుచు
ఘన విరజోదీక్ష గలిగి మీరు
కోటీశు హృత్పద్మ కోశంబునను నిల్పి
తపము సేయంగఁ బ్రత్యక్షమగుచు
త్ర్యక్షుండు మీదోష మక్షయంబైనను
క్షమియించి రక్షించుఁ గరుణతోడ
ననుచు నుపదేశ మొసఁగిన నమరసంఘ
మమితభక్తిని విష్ణుకూటాగ్రమందు
తపముగావింప నంత దదగ్రసీమ
నెలమిఁ బ్రత్యక్షమయ్యెఁ గోటీశ్వరుండు. 133

ముగ్ధ మన్మథకాంతి మోహినీతనుకాంతి
మోహినీతనుకాంతి మోహనముగ
పద్మకేసరజటా పద్మరాగచ్ఛాయ
పద్మరాగచ్ఛాయఁ బాయఁజేయ
నీలాళి నీలాబ్జ నీలకంధరశోభ
నీలకంధరశోభఁ దూలఁ దోల
కాళిమ గజచర్మ కల్పితాంబర దీప్తి
కల్పితాంబర దీప్తిఁగడకుఁ జిమ్మ
నిట్టి సన్మూర్తిఁ దాల్చి కోటీశ్వరుండు
వృషభవాహాధిరూఢుఁడై వేల్పుగమికి
ముందటను నిల్చి నిర్మలానందమొంద
కోర్కు లేమైన నిచ్చెదఁ గోరుఁ డనిన. 134

అంత నద్దేవతాబృందంబున కధీశ్వరుండగు పురందరుం డిట్లనియె. 135

ఇంద్రుఁడు శివుని స్తుతించుట

*మాలిని*

జలధివర నిషంగా శైలకన్యానుషంగా
కలితవరకురంగా గర్వితానంగభంగా
సలలిత వరగంగా చారు వార్యుత్తమాంగా
బలవదసురభంగా భవ్య కోటీశలింగా! 136

*సుగంధి*

జూటకోటి చంద్రఖండ శూలపాణి శంకరా
పాటలాబ్జకేసర ప్రభానిభోల్లసజ్జటా
ఘోటకీకృతోక్షరాజ ఘోరదైత్యమర్దనా
కోటిలింగ సత్త్రికూటకూటగేహ చిన్మయా! 137

స్రగ్విణి

పల్లవ ప్రోల్లసద్బంధు జీవ స్ఫుర
ద్భల్లికోల్లాసకోదభ్రరోచిశ్ఛటా
వల్లికాపోత దేవాపగా శుభ్రరు
జ్మల్లికా మాలికా మౌళి కోటీశ్వరా ! 138

శ్రీ

శ్రీ
కో
టీ
శా ! 139

నారి

కోటీశు - జూటేందు
కూటస్థుం - బాటింతు. 140

కన్యా

ఈ కోటీశు - లోకేశు సు
శ్లోకస్తుత్యు - వీఁకం గొల్తు. 141

పంక్తి

నేనను గోటీ - శానుని భక్తి
మానక వేడ్కన్ - బూని భజింతున్. 142

శశివదన

మనమున గోటీ - శుని నఘ దూరున్
మునిజన సేవ్యున్ - మునుకొని కొల్తున్. 143

హంసమాల

నిరతం బేను కోటీ - శ్వరు దేవాదిదేవున్
పరమానందమూర్తి - స్థిర భక్తి న్నుతింతున్. 144

విద్యున్మాల

కోటీశానా దేవాధీశా
జూటప్రాంత స్థేందూత్తంసా
పాటీరాచ్ఛాంభోజాకారా
సూటి న్నిన్నే నే సేవింతున్. 145

భుజంగశిశురుతము

సురవర నుత చరిత్రా
కరి దనుజ మదహారీ
పురదితిజహర కోటీ
శ్వర భవ భయ విదూరా! 146

పణవము

కోటీశా నుతగుణవిశ్వేశా
కూటాగ్రాంచిత గురుసద్గేహా
జూటాగ్రాశ్రిత సుమ చంద్రార్ధా
సూటింగొల్చెద శుభ చారిత్రా! 147

దోదకము

పూని సుభక్తినిఁ బూర్ణుని కోటీ
శానునిఁ గొల్చెద సర్వసుపర్వా
నూన పదాధిక నూత్నవిభూతి
జ్ఞాన సుఖప్రదు సద్గురుమూర్తిన్. 148

ఇంద్రవంశము

దేవేశుఁ గోటీశ్వరు దీనవల్లభున్
భావానుకూలస్థితిభావితాకృతిన్
భావోద్భవధ్వంసన ఫాలలోచనున్
భావించి సేవించెద భక్తపోషణున్. 149

మత్తమయూరము

శ్రీ కోటీశా శ్రీనగసీమావనిగేహా
లోకాలోకాధిష్ఠిత లోకావనమూర్తీ
పాకార్యబ్జాతోద్భవ పద్మాపతిసేవ్యా
నీ కల్యాణాకారము నిత్యంబును గొల్తున్. 150

వనమయూరము

శ్రీకర కృపాంబునిధి జిష్ణునుత పుణ్య
శ్లోక జన చిత్తగత శుంభదహిరాజా
నీకకృతభూషణ మునీశనుత కోటీ
శా కలిత మేరుధరచాప హరిబాణా! 151

అలసగతి

వరరజిత శైల సునివాసములయందున్
గిరిసుతనుగూడి వరకేళి కల లీలా
సురతసుఖమానక విశుద్ధమతిఁ గోటీ
శ్వరుడవయి నిల్చితి వజాండములఁ బ్రోవన్. 152

పంచచామరము

త్రికూట కూట గేహ దేవదేవ భక్తపాలనా
సుకోవిదాంతరంగవాస శూలపాణి శంకరా
ప్రకోపనాంతరంగదూర పాపనాశ పాశహా
సుకాంతి కాంత కోటిలింగ సూరిచిత్తబాంధవా! 153

మందాక్రాంత

కోటీశానున్ కుధరనిలయున్ ఘోరసంసారదూరున్
జూటస్థేందున్ సురమునినుతున్ శుభ్రగంగోత్తమాంగున్
ఘోటీఘాతశ్రుతిచయవిదున్ కోటిసూర్య ప్రకాశున్
కోటి బ్రహ్మాండ పతిని వినుం గొల్తుఁ జిత్తంబులోనన్. 154

మత్తకోకిల

ఎల్లమంధను కోటిలింగ మహేశ్వరేశ్వరుఁ డుండఁగా
కొల్లగాఁగను భుక్తిముక్తులు కోరినట్టులు గల్గఁగా
బ్రల్లదంబున నొందు వేల్పుల భక్తిఁ గొల్తురు మూఢు లి
ట్లెల్లవార లెఱుంగలేరొకొ యేమి చెప్పుదుఁ జిత్రమో। 155

మత్తేభవిక్రీడితము

పరమోదార నిజప్రభావ గరిమన్ బ్రహ్మాండ భాండంబులన్
బరగన్ సృష్టియొనర్పఁ బ్రోవఁ జెరుపన్ బ్రహ్మాచ్యుతేశాన భా
స్వర రూపంబుల నద్రికూటగిరి శుంభత్కూటసంవాసివై
గురుకారుణ్యముతోడ నుంటివిగదా కోటీశ విశ్వేశ్వరా। 156

చంపకమాల

నిరతము యోగిరాడ్హృదయ నీరజసీమల తారకాద్రిపై
సురుతరలీల నిల్చిన మహోన్నతునిన్ గననేరనట్టి యి
న్నరులకు నీ త్రికూటగిరినాథుఁడవై కనుపట్టు నిన్ను నో
పరశివ కోటిలింగ గురుభక్తి భజించెద నెల్లకాలమున్. 157

మహాస్రగ్ధర

జననాంతాపేతు నీశున్ శరభవజనకున్ చంద్రరేఖావతంసున్
ఘన మౌనిధ్యానగమ్యున్ గరధృతపరశుం గామగర్వాపహారున్
వనజాక్షాబ్జాసనార్చా వ్యవహిత సుపదాబ్జాత మౌళిప్రదేశున్
పరమున్ గోటీశు ధీశున్ భవభయహరణున్ భర్గు దుర్గేశుఁగొల్తున్.

పద్మనాభము

శ్రీమన్మహాదేవ గౌరీమనోనాథ, శ్రీకంఠ భక్తావళీభావితాంగా
కామాతిగర్వాంధకారార్క సర్వేశ ఖట్వాంగపాణీ వృషాధీశవాహా
సోమాబ్జమిత్రానలాక్ష గణాధీశ శూలాయుధా నైకలోకాధినాథా
క్షేమప్రదాకార కోటీశ సర్వజ్ఞ శేషాహిభూషావిశేషా మహేశా. 159

తస్వి॥
శ్రీకర కోటీశ మునిజనముతోఁ జెల్వగు నీగిరి నిలిచి సుభక్తా
నీకము కారుణ్యమునను మనుప న్నేర్చిన నీ సరిసరి పరు లేరీ
లోక సమూహంబులు గనుగొన నీలోపల నుండగ నెఱిశివరాత్రిన్
లోకములెల్లన్ భవదురుగిరి నాలోకననేయఁగఁ జను టరు దీశా! 160

భాస్కర విలసితము
చేరిన సనకసనందన మౌనిశ్రేష్ఠుల కమృతము దెల్పినవానిన్
వారక మును నరు నిమ్మహి సద్భావస్థితి పరశివుఁగల్పిన వానిన్
మీరిన శివతిథినాఁ డిలమీఁదన్ మేలగు విభవము గల్గినవానిన్
సూరిజనములను బ్రోవఁగ గోటీశుండయిన శివుని గొల్చెద భక్తిన్. 161

మంగళమహాశ్రీ
ఉత్తముల చిత్తముల నుండి రజతాద్రిపయినుండియు త్రికూటగిరిమీఁదన్
సత్తములు కీర్తనలు సల్పఁగను సన్మునులు సన్నుతులభిన్నమతిఁజేయన్
సత్తుగ వసించి నరసంఘముల కిష్టఫలసంపద లొసంగఁగల కోటీ
శోత్తము సుపర్వవరు నోలిఁ గొలువంగను మహోన్నతవిముక్తి
సుఖమెందున్. 162

ఇట్లఖిలచ్ఛందోమయుండగు నద్దేవు వివిధచ్ఛదస్థిత వృత్తంబుల నభినుతించి దేవేంద్రుండిట్లను దేవా! నాకును నీ దేవసమాజంబునకును దక్షమఖ హవిర్భక్షణంబునఁ గలిగిన పాపంబు వినాశంబునొందించి నీవు పాప వినాశన లింగంబవై యిచ్చట నిరంతరం బుండవలయు ననిన నా కోటీశ్వరుండు వారల కిట్లనియె. 163

పాతకులకెల్ల నెక్కుడు పాతకుండు
ధర శివద్రోహి యటువంటి దక్షునింట
యజ్ఞభాగంబు గుడిచినయట్టి దోష
మడఁగునే యెంత చేసిన నమరులార! 164

శివనిందాదోషము ధర
భవముల నొందింప దధికపాతక మగుటన్
రవితనయు లోకమందున
నివసించును కల్పకోటి నిరయములోనన్. 165

అయినను మీరలు సతిభక్తి నీ విష్ణు
శిఖరాగ్రవాసుని శ్రీ సహాయు
పరమేశు సద్భక్త పరిపాలనాక్షీణ
కరుణాకటాక్ష వీక్షణునిఁ జక్రి
పరమాత్ము నవ్యయు గరిమ సేవించితి
ర వ్విష్ణునకు నాకు నరయ భేద
మించుకంతయు గల్గ దే నొక్కఁడనె బ్రహ్మ
విష్ణురుద్రాకృతి వెలయుచుందు
నట్టి విష్ణునగాధీశు నద్రిమీఁద
నెసఁగ నుపదేశమగుచుఁ గోటీశు నన్ను
మనసులో నిల్పి యతినిష్ఠ ఘనతపంబు
జేసితిరిగాన నఘముక్తి చెందు రిపుడు. 166

అనిపల్కి శివుఁడు శూలం
బున పంకజనేత్రు శిఖరమూలముఁ బొడువన్
జనియించె నిర్మలోదక
ఘనమగు దొన యొకటి పాపఖండన యగుచున్. 167

అంత వారలఁ జూచి కాలాంతకుండు
పాపనాశని యనుపేరఁ బరగు నిదియు
నిచట మునిఁగిన మీ పాపమెల్ల బొలియు
నిందుఁ బొలియని పాపంబు లెందు లేవు. 168

బ్రహ్మహత్యాది పాపముల్ పాయు నిచట
నెట్టి ప్రతిబంధకంబైన గిట్టు నిచట
జీవహింసాది దోషముల్ పోవు నిచట
నిచటి మహిమంబు వర్ణింప నెవరితరము? 169

ఎంతో వింతయి యున్న యీకొలనిలో నేపారు భక్తిన్ సుఖ
స్వాంతంబొప్పఁగఁ దీర్థమాడి యిచటన్ సంతానకోటీశ్వరున్
చింతానాశకుఁ బూజనేసి కొలువన్ శీఘ్రంబుగాఁ గల్గెడిన్
సంతానం బిల వంధ్యకైన వినుఁడీ సందేహము ల్వాయఁగన్. 170

అనుచుఁ గోటీశు డా దొన కపర భాగ
మందు పాపవినాశన ఖ్యాత లింగ
మగుచు జెలువొంద నది గాంచి యమరవరులు
వినుతిఁ గావించి రానందవివశు లగుచు. 171

అంత నా నిలింపు లమ్మహాదేవ త్రిశూలాగ్రధారా జనితయును, పంచమహా పాత కోపపాతకా ద్యనేకపాపభయభేదకయును బరమపావనియు నగు నా ద్రోణికాసమీపంబున కరుదెంచి తదీయ నిర్మలోదకంబుల మంత్ర పూర్వకంబుగా స్నానంబుఁజేసి సిత భసితోద్ధూళిత శరీరులై భద్ర రుద్రాక్ష మాలికాభరణులై పంచాక్షరీజపంబుఁ జేసి తద్ద్రోణికాతీరంబున మహా పూతంబైన పాపనాశన లింగంబున కా ద్రోణికోదకంబుల నభిషేకంబుఁ జేసి విష్ణుశిఖరప్రాంత తులసికాకాంతా రానీత దళంబుల బిల్వదళంబుల నష్టోత్తర శతనామ పూర్వకంబుగాఁ బూజించిరి తన్నామ వివరణం బెట్టి దనిన 172

అష్టోత్తర శతనామావళి

శ్రీమత్త్రికూట భూమీధ్ర విష్ణుశృంగ నికేతనః
పాపఘ్నః పార్వతీనాథః ఫాలనేత్రః పరాత్పరః. 173

కీనాశ గర్వనిర్వాణః కరుణామృత సాగరః
కందర్పమదవిధ్వంసః కమలాక్షీపూజితః. 174

దక్షాధ్వర హవిర్భోజి దేవాఘౌఘ వినాశనః
దానవ ధ్వంసకో దేవో దరహాస ముఖాంబుజః. 175

దేవదేవో మహాదేవః కాలకంఠో దిగంబరః
చంద్రార్ధశేఖరః శంభుః శూలపాణి ర్మహేశ్వరః. 176

గంగాధరో గణాధీశో నందికేశ్వరవాహనః
నారదాదిమునిస్తుత్యో నాగాభరణభూషితః. 177

ఈశ్వరః శివ ఈశానో బ్రహ్మార్చిత పదాంబుజః
కైలాసశిఖరావాసః పరః పాపనికృంతనః. 178

పాకారి పూజితః పాశధరో భక్తవరప్రదః
అద్భుతాగ్రః పశుపతి ర్దక్షయజ్ఞవినాశనః. 179

ధూర్జటి ర్వామదేవశ్చ స్రష్టా సర్వసుఖప్రదః
ప్రభు స్తత్పురుషో బ్రహ్మ సద్యోజాతః కపాలభృత్. 180

అఘోరో వహ్నినేత్రశ్చ విశాలాక్షో వరప్రదః
కృత్తివాసాః క్రతుచ్ఛేత్తా భర్గో భీమః పినాకభృత్. 181

మేరుచాపో విరూపాక్షో భిక్షుకో మూలకారణః
శిపివిష్టో మృడ శ్శూలీ ఆధారశ్చ సదాశివః. 182

సర్వేశ్వరః స్వరాట్చైవ సర్వాత్మా సర్వసాధకః
సేతుః సర్వవిధి ర్వ్యోమః శాస్త్రయోనిః శుభావహః. 183

అనంగః పురుషః పూర్ణః పురాణః పరమేశ్వరః
సత్యానందో నిర్వికారో నిర్గుణశ్చ నిరంజనః. 184

ఆకాశ ఆస్తికో జ్యోతిః చిదాభాస స్స్వయంప్రభః
మృత్యుంజయో మృగధరః శంకర స్త్రిగుణాత్మకః. 185

శివంకర శ్చిదానందో నిత్యానందో నిరామయః
ప్రజాపతిః పరంధామ భువనేశ స్సభాపతిః. 186

సులభః స్థూలసూక్ష్మాత్మా సర్వరక్షణ దీక్షితః
స్మృతత్రికూట వరదః సర్వలక్షణ లక్షితః. 186

తత్రత్యద్రోణికానీరస్నానమాత్రాఘకృంతనః
భక్తదారిద్ర్యవిపిన దవీభూతాగ్నిలోచనః. 188

తచ్ఛైల శిఖరాగ్రస్థ యోగిబృంద నిషేవితః
ఎల్లమందాద్రి సంస్థాన ప్రభుః పాపవినాశనః. 189

ఇట్లు పూజించి యమరు లయ్యీశ్వర లింగంబునకు ధూపదీపాపూర్వఫల నివేదన మొనరించి మిగుల వినుతిఁజేసి పాపములఁబాసి స్వర్గలోకపదము గని రంత తత్కూటాధిపతి విష్ణుం డమ్మహాలింగం బీశ్వరలింగం బగుట తదీయ పంచవింశతి లీలోపన్యాస పూర్వకంబుగా నిట్లని స్తుతియించె. 190

సోమకళాంచిత సుందరలింగం - శైలసుతామయుత శర్మదలింగం
గోపతివాహన శోభితలింగం - ధీమహి పాపవినాశనలింగం. 191

నాట్యవిలాస సుతోషితలింగం - భూరివివాహమహోత్సవలింగం
ఆదిమభిక్షువిధాయతలింగం - ధీమహి పాపవినాశనలింగం. 192

మన్మథ దర్పవిభంజనలింగం - కాలమదోద్ధతినాశనలింగం
రాక్షసపట్టణ భేదనలింగం - ధీమహి పాపవినాశనలింగం. 193

వీరజలంధర మర్దనలింగం - బ్రహ్మశిరోహర పావనలింగం
దక్షమఖక్షయ దక్షిణలింగం - ధీమహి పాపవినాశనలింగం. 194

పాపవినాశ విచక్షణలింగం - అర్ధశరీర శివాశ్రితలింగం
రమ్య కిరాత వపుర్ధరలింగం - ధీమహి పాపవినాశన లింగం. 195

అస్థి విభూషణ భూషితలింగం - చండిసుపూజిత శివకరలింగం
రౌద్ర విషాద న రాజితలింగం - ధీమహి పాపవినాశనలింగం. 196

కేశవదత్త సుదర్శనలింగం - స్కందశివాగమ ప్రస్తుతలింగం
ఏకపదస్థ మహేశ్వరలింగం - ధీమహి పాపవినాశనలింగం. 197

సర్వ శుభావహ చిన్మయలింగం - రమ్యవటస్థల రాజితలింగం
విష్ణు విరించి సమర్చితలింగం - ధీమహి పాపవినాశనలింగం. 198

*చిత్రపదవృత్తము :*

పాప మోచనం ఫాలలోచనం - శమన నిగ్రహం శాంతవిగ్రహం
భక్తపోషణం భవవిశోషణం - భుక్తిముక్తిదం త్వా మహం భజే. 199

నమో నమస్తే జగదేకనాథ - నమో నమస్తే గిరిజాపతే ప్రభో
నమోనమః పాపవినాశనే - నమోనమస్తే వృషభేంద్రవాహన. 200

అని యిట్లమ్మహావిష్ణుం డా లింగమూర్తిని వినుతించి నేఁడాదిగా నిచ్చటి కేతెంచువారలు ముందుగా పాపవినాశన జలంబులం దోగి యీ లింగ మూర్తినిఁ బూజించి సకల పాపవిముక్తులై పిదపఁ గోటీశ్వరు నీక్షించిన సకలాభీష్టసిద్ధి యగునని సకలలోకంబుల కాజ్ఞాపించి య మ్మహాశిఖర మధ్యస్థుండై యుండె నంతట. 201

ఆ కూటస్థ మహాబిలాంతరములం దాసక్తి సిద్ధవ్రజం
బేకాలంబు వసించి భక్తిరతి న య్యీశాన లింగంబు న
స్తోక ప్రక్రియ బూజసేతు రది యెంతో వింతయో మానవా
నీకాగోచరమైన యా మహిమ వర్ణింపంగరా దేరికిన్. 202

దక్షిణామూర్తి రజితభూధరము విడిచి
యా త్రికూటాద్రి రుద్ర కూటాద్రి సీమ
లలిత కోటీశలింగమై నిలిచె విష్ణు
శృంగమందు పాపవినాశ లింగమయ్యె. 203

ఆ లింగము జ్యోతిర్మయ
మా లింగము చిత్ప్రకాశ మఖిలాధారం
బా లింగమూర్తిఁ గొలిచిన
దూలును సంసారమాయ దురితం బడగున్. 204

ఆ లింగంబు భజింపఁ గల్గు నఖిలేష్టార్థంబు లీలోకమం
దా లింగంబు భజింపఁ గల్గు నతి ఘోరాఘచ్ఛటాభేదనం
బా లింగంబు భజింపఁ గల్గు నపవర్గానందమందంబుగా
నా లింగంబు భజింప కుండు నరు లాహా! యెంత పాపాత్ములో! 205

మహితకార్తిక శ్రావణ మాఘమాస
ములను పాపనాశనియందు మునింగి దానను
పూని లింగార్చనము సేయు మానవులకు
గరిమతో భోగమోక్షముల్ గల్గు టరుదె! 206

అందుఁ గార్తిక మాసమం దధికభక్తి
నచట నిల్చి లింగార్చనం బమరఁ జేయు
నతని కీశుండు నచ్చోట నధివసించు
సిద్ధమండలి ప్రత్యక్షసిద్ధి నొసఁగు. 207

శ్రావణమాసంబు సరస రుద్రాభిఖ్య
శిఖరాగ్రమందునఁ జేరి నిలిచి
కార్తికమాసంబు కమలాక్ష శిఖరాగ్ర
నిర్మల స్థలమున నియతి నిలిచి

మాఘమాసంబున మహిత విరించ్యాఖ్య
శిఖరాగ్రమందున జెలఁగి నిలిచి
ప్రాచీన కోటీశు పాపవినాశన
నూత్నకోటీశ్వరానూనలింగ
మూర్తులను బూజగావించి ముక్తి కార
ణంబయిన మహాలింగార్చనంబు చేసి
భూసురుల కన్న మిచ్చిన పుణ్యఫలము
శేష భాషాపతులకైనఁ జెప్పఁ దరమె! 208

మఱియు న మ్మహాగిరి యాత్రికులగు వారలు విష్ణుశిఖరంబు నెక్కి పాప నాశనీ ద్రోణికా జలస్నానంబు జేసి పాపవినాశన లింగంబు బూజించి విగతపాపులై నూత్న కోటీశ్వర సోపాన మధ్యస్థ వల్లీవాంగనా దర్శనంబు జేసి బ్రహ్మశిఖరస్థ నూత్న కోటీశ్వర లింగంబును తత్పరివార లింగంబుల సేవించి యోంకార నదీజలంబులఁ దీర్థవిధు లొనరించిన నిది పూర్ణయాత్ర యగు నిందుఁ బ్రథమ సేవ్యంబగు పాపనాశన లింగంబును నచటి విష్ణుం డును సురగణంబును సేవింపుచుండు నిక నూత్నకోటీశ్వర లింగావిర్భావం బెట్టిదనిన. 209

అంతఁ గొంతకాలంబున కబ్జభవుఁడు
"రుద్ర హరికూటముల లింగరూప మొంది
శివుఁడు నిలిచెను మామక శిఖరమందు
దనర లింగంబు నిల్పెను దపము జేసి." 210

అనుచుఁ జింతించి బిల్వవనాంతరమున
బద్ధ పద్మాసనస్థుఁడై భవ్యలీల
హంసమార్గానువర్తియై యమలభక్తి
తపముజేసి కోటీశు జిత్తమున నిల్పి. 211

శబ్దాది వైఖరీజాలంబు నింద్రియ
మధ్యమస్థితియందు మట్టు పఱచి
యింద్రియ మధ్యమ నేపార మానస
పశ్యంతి లోపల పరగ నిలిపి
మానసపశ్యంతి మానక హంసయౌ
నా పరాశక్తియం దణఁగఁజేసి
యా పరాశక్తిని నమల చిదానంద
రూపంబుగాఁ జేసి రూఢిమెరయ
నట్టి రూపంబు దానయై యఖిలవస్తు
చయములోపల వెల్గుచు సర్వభూత
తతి విలోకించి కావించెఁ దపము మిగుల
నలినగర్భుండు నిర్మలానందుఁ డగుచు. 21

ఇట్లు గొంతకాలంబు జిరసమాధినిష్ఠుండై యుండునంత నా చిదాకాశ మధ్యంబునందుఁ బరాచలనంబై పశ్యంతీపదంబొందు సమయంబున. 213

పొడచూపెఁ శతకోటిభాస్కరకరస్ఫూర్జత్ప్రభాశాలియై
యుడురా డర్ధ కిరీటుఁడై సురనదీప్రోద్యజ్జటాజూటుఁడై
కడిమిం బన్నగభూషణుండయి శుభాకారుండునై దిక్కులం
దెడలేకఁ బ్రమథాళిఁ గొల్వఁగను గోటీశుండు బ్రత్యక్షమై. 214

అట్లు ప్రత్యక్షమైనట్టి యభవుఁజూచి
మధ్యమావైఖరులఁ గూడి మహిమదనరి
పద్మగర్భుండు సంతోష భరితుఁడగుచు
నుతుల గావించె నానంద మతిశయిల్ల. 215

దేవా యీ చిదాకాశ రూపంబగు పరమ శివ సముద్రంబున ఘృత కాఠిన్య మూర్తివగు నీవును, విష్ణుండును, నేనును త్రిగుణాత్మికయగు ప్రకృతియు

నీప్రమథ సురనికాయంబును స్థావర జంగమాత్మకంబగు నీ విశ్వంబంతయు శ్రీకరజాలంబని భవదనుగ్రహంబున నిట్లు చిరసమాధి నిష్ఠుండనై కంటిఁ గాని మదన్యుం డెవ్వం డిట్లు తెలియనేర్చు నేనును భవత్ప్రసాదంబునన కంటిని. భవత్ప్రసాదంబును గురూపదేశంబును కర్మ సామ్యంబును గల వారలు జన్మంబునందే యిట్లు పరమానుభవంబు నెఱింగి ముక్తులగుదురని యెఱుంగక కదా వివిధమత ప్రవిష్టులై చెడువాదంబులు సేయుచు బరస్పర వంచకులై ప్రవర్తింపుచుందురు. వారలైనను గామక్రోధ రహితులై స్వమతాచార నిష్ఠులై స్వేష్ట దేవతాభక్తి గలిగి యితర దేవతా మత దూషణంబు లేక ప్రవర్తించిరేని జన్మాంతరంబున దత్తద్దేవతానుగ్రహంబున గురూపదేశంబుఁ బొంది యిట్టి పరమానుభవంబునం జేసి ముక్తిఁగాంతు రేనును గృతార్థుండనైతి ననుగ్రహింపవే యని విధాత మఱియు నిట్లనియె.

హరిహరాభిఖ్య దివ్య కూటాగ్రములను
లింగమై యుండినట్టుల లింగమగుచు
నాదు శిఖరంబునందున నాథ! నీవు
నిలువఁగోరితి నీపూజ నేను జేతు. 217

అను వనజ గర్భు పలుకులు
విని కోటీశుండు కరుణ విధి కిట్లనియెన్
విను నూతన కోటీశ్వరుఁ
డనఁగా లింగ స్వరూపమై విలసిలుదున్. 218

అని చెప్పి కోటీశ్వరుం డచ్చోట నూతన కోటీశ్వరుఁడై విరాజిల్లినది మొదలుగా విధాత యీ లింగంబు నర్చింపుచుండు నిట్లు కూటత్రయంబు నందు కోటీశ్వర పాపనాశన నూత్న కోటీశ్వర దివ్య లింగంబులు రుద్ర విష్ణువిధాతలు సేవింపుచుందు రీ లింగంబులు మానవుల కగోచరంబులగుట నీ స్థలంబుల శిలారచిత లింగంబులఁ బ్రతిష్ఠించి జనంబులు భక్తియుక్తిం బూజించి భుక్తిముక్తు లనాయాసంబుగాఁ గాంతురని శివుం డుమాదేవికిఁ

జెప్పె నట్లు చిదంబర నటన తంత్రోక్త ప్రకారంబుగా నాంధ్రభాషాకృతి వతంసంబు రచించితి నిది వినిన వ్రాసిన బఠించినవారికి సకలేష్టసిద్ధులు కోటీశ్వరానుగ్రహంబునఁ గలుగు మఱియును. 219

ఆశ్వాసాంతము

శ్రీశైలేంద్ర విహార హార లతికా శ్రీరూఢ భోగీశ గీ
శాశాధ్యక్ష ముఖామరాధిప కిరీటాగ్రస్థ సత్పద్మ ప
ద్మేశారాధితపాద పాదనతమౌనీశాన పాపావళీ
పాశధ్వంసక నామ నామరహిత ప్రాశస్త్య దివ్యాకృతీ. 220

కరుణారస వరుణాలయ
శరణాగత భక్తరాజి సమ్యగ్భరణా
అరుణాంశు కోటి కోటి
స్ఫురణాద్భుత దివ్యకాంతి శోభితచరణా ! 221

స్రగ్విణి :

శ్రీ గణాధీశ్వరా సిద్ధ సంసేవితా
భోగిభూషా మహాభోగ సంధాయకా
రాగ దూరామణీ రాగ రాజజ్జటా
సాగమామ్నాయ విద్యామయా శంకరా. 222

ఇది కొప్పరాజనంతామాత్య పౌత్ర లింగనామాత్య పుత్ర సుజన విధేయ నరసింహ నామధేయ ప్రణీతంబయిన చిదంబర నటన తంత్రోక్త శ్రీమత్త్రికూటాచల మాహాత్మ్యంబునందు ద్వితీయాశ్వాసము.



# శ్రీమత్త్రికూటాచల మాహాత్మ్యము

## తృతీయాశ్వాసము



శ్రీకంఠ భక్తవత్సల
లోకాధిప వినుత సర్వలోకాధీశా
రాకేందుకోటి భాస్వర
ప్రాకట గంగోత్తమాంగ పర్వతలింగా ! 1

అవధరింపుము దేవ చిదంబరాఖ్య
నటన తంత్రంబులోన విస్ఫుటము గాఁగ
చెప్పఁబడిన త్రికూటాఖ్య శిఖర మహిమ
మాంధ్ర కృతిఁ జేసితిని నీకు నర్పణముగ. 2

ఇంక బ్రహ్మశిఖర మహత్వంబును తన్మధ్యస్థ నూతన కోటీశలింగ సమీపస్థ లింగంబులం గలియుగాది నచ్చోట ముక్తులగు సాలంక భక్తపుంగవాభీర కన్యావతంసంబుల కథావిధానం బవధానంబున నేర్పరించి విన్నవించెద నదెట్లనిన. 3

అచ్చటి బిల్వకాననము లచ్చటి నిర్మల ద్రోణికాచయం
బచ్చటి నిర్ఝర ప్రతతు లచ్చటి గైరికధాతు భాసనం
బచ్చటి దివ్య కందరము లచ్చటి సిద్ధ మునీంద్ర మండలం
బిచ్చఁదలంపఁ జెప్పఁ దరమే పరమేష్ఠికినైన నెంతయుఁ. 4

అచటి కోటీశ్వరాలయం బద్భుతంబు
శ్రాంత హరి రథ్య ఖుర సమాక్రాంత శాత
కుంభ కుంభావళీ ప్రోత్థ గురుతరాగ్ర
గోపురాధఃకృతస్ఫార గోపురంబు. 5

ఆ కోటీశ్వర గేహ దక్షిణ విశాలై...నీతస్థలి
శ్రీ కల్యాణ మనోజ్ఞ వాసగతుఁడై సిద్ధిప్రదుండౌచు సు
శ్లోకుండౌ గణనాథుఁ డద్భుతగతిన్ శోభిల్లు కోటీశ్వరుం
డాకల్పాంతముగొల్చు నెమ్మదిని మోదంబంది సద్భక్తిచేన్. 6

ఆ లోకేశ నివాస పశ్చిమదిశా వ్యాసక్త సమ్యగ్ఘృష
జ్జ్వాలా కల్పిత దివ్యగేహమున వాచాతీత మాహాత్మ్య సు
శ్రీ లాలిత్యవిలాస భాస మగుచుం జెన్నొంది కన్పించు గా
సాలంకేశ్వర లింగమూర్తి యమరున్ సద్భక్త సంసేవ్యమై. 7

కోటీశావసథాంచితోత్తరదిశా కుడ్యైక పీఠంబునన్
సాటిన్ మించిన సత్ప్రభావ గరిమన్ సంతాన కోటీశుఁ డా
సూటిన్నిల్చి సమస్తభక్తతతికిన్ సొంపొందు సంతోష మె
ప్పాటం గల్గగజేయుఁ దన్మహిమ దెల్పన్ శక్యమే యేరికిన్. 8

ఆ కోటీశ్వరు వామభాగమున నత్యాశ్చర్యకృద్ద్రోణికా
నీకాధస్థిత బిల్వమూలమున వాణీనాథ సంసేవ్యమై
రాకాచంద్ర మయూఖ దీధితిని మార్కండేయ లింగంబు సు
శ్లోకంబై భవమృత్యు సంహరణమై శోభిల్లు నెంతేనియున్. 9

ఆ దేవేశ్వరు తూర్పువాఁకిట మహార్హస్ఫార నీలాశ్మ శో
భా దివ్యాయత మంటపంబునను శుంభద్దృష్టిపాతంబు నా
హ్లాదం బొప్పగ లింగమూర్తిపయి లీలందీర్చు నందీశుఁ డా
మోద స్ఫూర్తి వసించు యోగితతి తన్మూర్తి న్మది న్నిల్పగన్. 10

ఆ దేవోత్తము ప్రాగ్దిశా స్థలమునం దా రామలింగేశ్వరుం
డాదిబ్రహ్మమయుండు మౌనిజనతాధ్యక్షుండు మోక్షప్రదుం
డాదిత్యేందు కృశానులోచనుఁడు నిత్యానంద సంధాయియై
ప్రోది న్నిల్చి సమస్తలోకముల సమ్మోదమ్ముతోఁ బ్రోచెడిన్. 11

అట్టి యా రామలింగేశ్వరాలయంబు
దక్షిణంబున సోపాన తలమునందు
వర గుణోపేత యాభీరవంశజాత
ప్రీతి వసియించి శ్రితజనాభీష్ట మొసఁగు. 12

శివుని జూడగ నేగు భవులకు నెదురుగ
గరిమ నిల్చిన ముక్తికాంత యనఁగ
దక్షిణామూర్తియై భవుఁడు ముందర రాగ
వెనుక వచ్చిన గిరితనయ యనఁగ
నఖిలాద్రి శోభా జయాఢ్యమౌ తద్గిరి
లాలితాద్భుత జయలక్ష్మి యనఁగ
త న్నగప్రాంత కాంతార మధ్యమున ను
న్నతి వసించు వనదేవత యనంగ
ప్రకటకోటీశ సోపాన పటలినడుమ
చారు దృఢ దారు నిర్మిత సద్మమందు
నిరత సంతోషచిత్తయై నిలిచియుండు
పృథుల శివభక్తి మాన్య యాభీరకన్య. 13

ఆ కోటీశ్వరు దక్షిణాశను త్రిమూర్త్యాకారమై యుల్లస
ల్లోకాలోక పరీత విశ్వధరణీ లోకస్తుతానేక సు
శ్లోక శ్రీకర భక్తలోక హృదయాస్తోకేష్ట దానక్రియా
శ్రీకంబై తనరారుచుండు నెపుడున్ లింగత్రయం బున్నతిన్. 14

ఆ లింగత్రయ మొకటయి
యోలి మహాలింగమయ్యెనోయన నోంకా
రా లలితాఖ్యను కోటీ
శాలయము వెనుకను లింగ మలరుచు నుండున్. 15

అమ్మహాస్థల సంరక్షణార్థముగను
దుర్గ భైరవు లిద్ద రస్తోక మహిమ
నిల్చియుండిరి యద్దేవు నిలయమునకు
ప్రాగ్దిశాస్థలి వేదిక పడమరందు. 16

ఆ కోటీశ్వరు గర్భగృ
హా కలిత ద్వారపాలకాగ్రణు లుద్య
ల్లోకానీకము బ్రోచుచు
నాకల్పస్థాయిగాగ నలరుదు రచటన్. 17

మఱియు నా త్రికూటాద్రి శిఖరి గుహాంత
రాంతరంబుల బిల్వ వనాంతరముల
లింగమూర్తు లనేకముల్ లెక్కవెట్టఁ
దరమె శేషాహికైన వాస్తవముగాఁగ. 18

ఇది బ్రహ్మశిఖర తదగ్రస్థిత నూతన కోటీశ్వరాది దివ్యలింగ ప్రశంసనం
బింక సాలంకుండను భక్తపుంగవుండు నాభీరకన్యావతసంబును నీ
త్రికూటేశ్వరుండగు కోటీశ్వరు నారాధించి ముక్తిగాంచిన కథావిధానం
బెఱింగించెద— 19

కలితాకాశ నదీ తరంగ చయ రంగ త్తుంగ డోలాచల
త్కలహంస ప్రకర ప్రకేళి కలనా కౌతూహలాలోకనో
జ్జ్వల సౌధాంత వస త్పయోజ వదనావారంబు శ్రీ యెల్లమం
ధల సత్పట్టణ మిందిరాసుదతి నిత్యావాస గేహాకృతిన్. 20

అమిత వరణంబు చక్రవాళాద్రి గాగ
నమల పరిఘాంబు వావరణాంబువుగను
రమ్య సౌధాళి భూధర రాజిగాఁగఁ
దనరి యా పురి బ్రహ్మాండ మనఁగ వెలయు. 21

పుర సౌధావృతమైన యంబరమునం బో సందు లేమిన్ సుధా
కరుఁ డా సోరణగండ్ల దూరి చనఁగా కాంతల్ కరాగ్రంబులన్
సరవింబట్టి నిజాస్య బింబములతో సాటౌనొ కాదో యటం
చరయన్ మోములఁ జేర్చఁగా దిలకమై వ్యాపించు కస్తూరి పం
క రసంబంట కళంకమం చనియె లోకం బా కళాశాలికిన్. 22

చంద్రశాలల రతిఁ దేలు సతులు కురుల
విరులు జారిన పేటికల్ ధరకుఁద్రోయ
నవియు నా శింశుమారంబు నందె జేరి
తిరుగ తారక లనిరి యీ ధరణిజనులు. 23

పరిఘాంచజ్జలకేళిలోల పరిరాడ్భామావశల్ వేడ త
త్పరిఘాంబు ప్రతిబింబితామితవనీ ప్రాంచత్సుమశ్రేణి వి
స్ఫురణంగాయతడంబుబింబితములై శోభిల్లు ప్రాసాద గో
పుర సాలాగ్రము లెక్క చూతు రటు సమ్మోహంబుచే నెంతయున్. 24

ఆతత సౌధకీలిత మహామణులం బ్రతిబింబితార్క సం
ఘాతముఁగాంచి తద్గ్రహణ కాలములన్ గ్రసియింపవచ్చు నా
కేతుసమూహ మోయనఁగ కేతనపంక్తి గృహాంగణంబులన్
ఖ్యాతి వహించి మించెను పటాంచల వాత విధూత మేఘమై. 25

నలువ శివుండు శేషుఁడును నాలుగు నైదును వేయు నోళ్ళచే
బలికిరి వేద మాగమము భాష్యము, న ప్పురిలోని బ్రాహ్మణుల్
వలుకుదు రేకవక్త్రికములన్ నిగమాగమ భాష్యజాలముల్
చలమున వారితోడను ప్రసంగము వేయఁదరంబె యేరికిన్. 26

ఆ పురి రాజహంసులు మహాంబర వీథిని రాజహంసులం
దీపిత కీర్తి విక్రమ సుదీధితిచేత తిరస్కరింప సం
తాపము నొంది వార లటు దైవ నగేంద్రము బాసియేగి యా
కోపముచే తమోగ్రహణ కుంఠిత విగ్రహులైరి చూడఁగన్. 27

బేరమెఱుగక తాను గుబేరుఁడయ్యె
ధనదుఁడనుచును లాభంబు దప్పకుండ
బేరములఁజేసి తాము కుబేరులైరి
తత్పురీస్థిత వణిజులు ధనము కలిమి. 28

బలుఁడు హలంబుబూని నిరపాయముగా యమునాతటంబునన్
చలమున దున్ని సస్యఫల సంగతిఁ గాంచెనెయంచు నెంచుచున్
హల మటు బూని వేడ్క నిఖిలావని దున్ని సమస్త సస్యముల్
ఫలితముగాఁగ జేతురు శుభస్థితిఁ దత్పురి శూద్రు లెంతయున్. 28

తారలా యివి గావు మారుని వలచేతి
తలిరాకు నెలబాకు తళుకులేమొ
తళుకులా యివి గావు దర్పకు నెమ్మేని
మెఱుగారు సొమ్ముల మెఱవులేమొ
మెఱపులా యివి గావు మీనాంకునెలతోడి
ప్రతిలేని జిగిజాగి లతికలేమొ
లతికలా యివి గావు రతిరాజునకునిచ్చు
కలిత మంగళదీప కలికలేమొ
యనుచు సభికులు నుతియింప నఖిలదేశ
సభిక సభలందు నాట్యము ల్సలుపనేర్చి
ధనములార్జించి కామతంత్రముల మించి
వారపతు లుందు రప్పురవరమునందు. 29

మఱియు నిట్లు ప్రచండోద్దండ వేదండ ప్రకాండ కాండోద్భట రథ తురంగ చతురంగ సేనాసమేతంబై యఖండ లక్ష్మీకటాక్ష వీక్షాడంబర విడంబితం బగు న న్నగరీవతంసంబునందు భక్తకులశ్రేష్ఠుండును కోరె వంశ సుధాంభోధిరాకాశశాంకుండును సాలంకాఖ్యుండగు నొక్క భక్తపుంగవుం డనుజ చతుష్టయ సహితుండయి విరాజిల్లు తత్ప్రభావం బెట్టిదనిన. 30

ఫాలంబునను సితభస్మ త్రిపుండ్రంబు
కరముల రుద్రాక్ష కంకణములు
గండపాళిని తామ్రకుండల ద్వితయంబు
శిరమున రుద్రాక్ష వరకిరీట
మురమున భుజముల నురు భస్మరేఖలు
గళమున రుద్రాక్ష కంఠమాల
ముఖమున పంచార్ణ మూలమంత్రంబును
సందికట్టునఁ దరుణేందు ధరుడుఁ
గలిగి పుంభావభక్తి నా గరళకంఠు
భక్తజనముల శ్రీ పాదపద్మములకు
పూజగావించి మోదించు భూరియశుఁడు
కోరెవంశసుధాంబోధి కుముదహితుఁడు. 31

అమ్మహాత్ముండు మహిత నిష్ఠానురక్తి
నేయు శివపూజ మహిమంబుఁ జెప్పఁదరమె
షట్స్థలంబుల షడ్లింగ సదనములను
వర్ష దర్పణ లీల లేర్పడ రచింతు. 32

సాలంకయ్య కథ

భక్తస్థలంబున భక్తుఁడై విలసిల్లె
మాహేశ్వరస్థలి మహిత నిష్ఠ
డై ప్రసాదస్థలి నవధానియై ప్రాణ
లింగాఖ్య సుస్థలి లీన లాను
భవుఁడౌచును శరస్థల వివర్థితానందు
డై యైక్య సుస్థలి నైక్యుఁడగుచు
గురు లింగజంగమాకుంఠితైక్యస్థితి
నెఱిఁగి తద్రూపంబు లిష్టగతిని

ప్రాణ భావాఖ్య లింగ సంబంధములుగ
జేసి నిత్యంబు శివపూజ నేయుచుండు
వీరశైవుండు షడ్వర్గ విజయశాలి
ప్రకట రుచిహేళి సాలంక భక్తమౌళి. 33

శ్రుతుల పురాణాద్యాగమ
వితతుల శివుఁ డధికుఁ డనుచు వేమఱు వినుటన్
శ్రుతిమత మని శివభక్తిని
సతతము నంగీకరించి సలుపుచునుండున్. 34

కఠిన కాయికవృత్తి యుత్కటముగాఁగ
జేసి యార్జించు ద్రవ్యంబుచేత జంగ
మాళిఁ బూజించు టే ముఖ్యమని తలంచి
కట్టెలమ్మెటి నెఱకాయకంబు పూని. 35

తమ్ములతోడగూడి విహితమ్ముగ న న్నగరాజమెక్కి నె
త్తమ్ముననుండు న వ్వనవితానమునందున నొప్పు పెద్ద భూ
జమ్ముల శాఖలెక్కి పయిసాగిన కట్టెలు కొట్టితెచ్చి తా
నమ్మిన తత్క్రయంబుననె నాతఁడొనర్చును జంగమార్చనల్. 36

కోటికిఁబడగెత్తు వన కి
రాటకుల వ్వీట గలుగ రాయస్థితికై
పాటించి వారి నడుగరు
జూటేందుకళావతంసు జూచిన కతనన్. 37

ఆ పురంబున గట్టెల నమ్మకొఱకు
నా త్రికూటాద్రికూటంబులందుగల్గు
శుష్కతరువుల ఖండించి సొలసి యంత
కోటిలింగేశు దర్శించుఁ గోర్కెదీర. 38

మఱియు నన్నగేంద్రంబునం దహంహంబునుం దిరుగుచుండి యతం డయ్యై యడవుల విహరించు సిద్ధ సమాజంబుల జాడలు వీక్షించి తన మనంబున నిట్లని వితర్కించె. 39

ఈ ద్రోణికలచెంత నిందాక నొక సిద్ధుఁ
డతి నిష్ఠ జలకంబు లాడబోలు
నీ బిల్వతరుసీమ నిందాక నొక సిద్ధుఁ
డీశ్వరార్చారూఢి నెసఁగబోలు
నీ తరుచ్ఛాయల నిందాక నొక సిద్ధుఁ
డాసక్తి విశ్రాంతి నందబోలు
నీ గుహాంతరవీథి నిందాక నొక సిద్ధుఁ
డురుసమాధిస్థితి నుండబోలు
తలఁప నీ స్థలంబందున తత్తదుచిత
కలిత చిహ్నంబు లేర్పడ గానిపించె
సిద్ధులెప్పుడు న గ్గిరి సేవసేయ
నరులు సేవించుటే వింత నాకుఁజూడ. 40

ఈ నగరాజమందున మునీంద్రు లనేకులు నిల్చియుండుటన్
మానుగ నిన్నగంబు మునిమంద యటంచు వచింతు రిచ్చటన్
బూని తపంబు జేసిన నపూర్వ సుఖంబులు భోగభాగ్యముల్
మానిత మోక్ష సంపద లుమాపతి యిచ్చును మానవాళికిన్. 41

అని విచారించి యతండు. 42

లీల నగరాజు ధారణలింగమైన
కోటిలింగంబు బూజించుకొనుట శైవ
ధర్మ లోపంబు గాదని దలఁచి యమిత
పూజ గావించెఁ గోటీశుఁ భూరిభక్తి. 43

అంత శరత్కాలంబు ని
తాంతాచ్ఛాంభో విహార తత ధవళ గరు
త్క్రాంతాంబుజాత పటలీ
కాంతం బరుదెంచె శీతకారణమగుచున్. 44

ఉష్ణాంశు కిరణ జాలం
బుష్ణత్వముమానె వహ్నియుడిగెను తీవ్రం
బుష్ణంబులైన వస్తువు
లుష్ణత్వముమాని శైత్య మొందెను వేగన్. 45

శివుఁడు ఫాలమునందుఁ జేర్చె నగ్నిజ్వాల
వెన్నుండు కార్చిచ్చు వేగమింగె
పాధోనిధానంబు బాడబానలమానె
కమలారి సూర్యసంగతి వహించె
నంభోదములు వైద్యుతానలస్థితులయ్యె
వజ్రి వజ్రంబు కేవలముబూనె
తరువు లంతర్వహ్ని నిరవొందగా దాల్చె
శిలలు లోవహ్ని ని జేర్చుకొనియె
జనము లింటింట కుంపటు లెనయ నిల్పి
రడవులందున నెగడులు గడలుకొల్పి
రపుడు వనచరు లా శీత మఖిలలోక
బాధలొనరింప నెంతయు భయమునొంది. 46

అట్టి శీతకాలంబునఁ బ్రొద్దుపొడుపునఁ జల్లని నీటందోగి యమ్మహాత్ముండు సితభసిత లిప్తదేహుండై భద్ర రుద్రాక్ష మాలాలంకృతగ్రీవుండై పంచాక్షరీ జపంబు చేయుచుఁ గోటీశ్వర మహాలింగంబునకు షోడశోపచార పూజలు గావించి కోటీశ్వరాష్టోత్తర శతనామంబుల బిల్వపత్రార్చనంబు జేసి మల్లికా మాలికా దామంబు లా లింగమూర్తి కంఠతటంబుట్టి యీ లింగంబే మల్లికార్జున

లింగంబయ్యెననుచు భావించి హృత్పద్మంబున ధ్యానంబు నేయుచుండె
మఱియు. 47

దక్షిణాయనమందు నుద్ధతి వహించి
మంచు తన రుచి మిగుల మాయించెననుచు
మంచుకొండకు నేగి యా మంచు నణప
నర్కుఁ డంతట నుత్తరాయణము నొందె. 48

శిరమునఁదాల్చె గంగ శశిశేఖరు డా హరి వార్ధిఁజొచ్చె వా
గ్వరుఁడు సరోజ పీఠిక నివాసము నేసెను వార్ధి యిందునిం
బొరసె సుధాంధు ల య్యమృతముం గొనిరంతయు మండువేసవిం
దురధిగమార్కతాప మతి దుస్సహమైనను భీతచిత్తులై. 49

ప్రపను పాంధుల సతు లిచ్చు వారిఁ ద్రాగి
యిది ధరామృత మతి తృప్తినిచ్చె మాకు
నింక నధరామృతము వీరియెడను గలుగు
నది లభించిన నమృతత్వ మబ్బు నంద్రు. 50

అట్టి వేసవి ఘోర వనాంతరముల
నెండగాలికి నోర్చి కోటీశు పూజ
నేయుటకు బిల్వదళము లమేయ పుష్ప
వితతి దెచ్చును సాలంకవిభుఁడు భక్తి. 51

అలయక పుండరీక వకుళావళి తా నొక దండఁజేసి ని
ర్మలమగు లింగమూర్తి కటు మౌళిని జుట్టుచు నెంచి చూడఁగా
నలువ కపాలమాలిక ఘనంబుగ మూర్ధముఁజుట్టికొన్న యా
మలహరు దివ్యవిగ్రహ సమత్వము గాంచినలీలఁ దోఁచెడిన్. 52

ఇట్లు ఘర్మకాలంబున నిర్మల చేతస్కుండై దుర్మలిన వినాశనియగు శంభు పూజ సత్కార్మ నిరతుండై చేయుచుండె నంత. 53

కర్షకజన సంతతికిని
హర్షం బొదవంగ ప్రకటితాద్భుత లీలా
కర్షణమై సుకరంబగు
వర్షఋతువు వచ్చెఁ బథికవర్గము బెగడన్. 54

కఠిన రవిరశ్మితప్త లోకంబునకును
తాప మణఁగింప నాఘనతతులుపూని
కఠిన జనతాభితప్త లోకంబునకును
తాప మణఁగింపవే ఘనతతులు జగతి. 55

అట్లు కాదంబినీ ప్రకాండం బకాండ విలయ జలధిపోలిక నదీనదంబు లేకంబు సేయుచు బ్రవర్షించు కాలంబున గిరిఝరిప్రాంత కాంత కాంతారంబుల సరిత్సరోవర తీరంబులం దిరుగుచు సాలంకుండు నిర్విశంకుండై కదంబ వాటికా కుసుమ కదంబంబుల దండలుగట్టి కోటీశ్వర శిరోభాగంబునం జుట్టి పాటల రుచిరుచిర జటాజూట కోటరంబగు సదాశివమూర్తి నలంకరింపంజేసి పూజింపుచుండు సమయంబున. 56

ఉత్సాహవృత్తము :

వారిదంబు లభ్రమం దవారితంబులై మరు
త్ప్రేరితంబులై యుగాంత భీమనీరదచ్ఛటా
స్ఫారితంబులై మసారసార నీలిమ ప్రభా
పూరితంబులై ధరాగ్రభూమి జేరె నుద్ధతిన్. 57

స్రగ్ధర :

శుంభద్గంభీరగర్జాస్ఫురణయు చపలా శోభయున్ దిక్తటంబుల్
కుంభింపన్ సంభృతాంభః కులికములగుచున్ గుంభినీవ్యాప్త లీలా

స్తంభాంభోవాహపంక్తుల్ చదల బొదలుచున్ సైరికామోద వృత్తిన్
గుంభద్రోణంబుగాఁగన్ గురిసెను విమలాకుంత ధారాసమృద్ధిన్. 58

అట్లు సంవర్త సంవర్తకాది మేఘ
సమితి యొకసారి వర్షింప సాగినట్లు
భూరి ధారాధరంబులు ఘోరవృష్టి
గురియ భీతిల్లి లోక మాకులత బూనె. 59

అట్టి జడివానయందు దానసుజ సహిత
ముగను దిరుగుచుఁ జలికి బిట్టుగ చలించి
కఠిన పాషాణ వృత గుహాంగణము జేరి
యభవు కోటీశు నీశు నిట్లని నుతించె. 60

జయజయ కోటీశ్వర శివ
జయజయ కోటీశ యీశ జయ సర్వేశా,
జయజయ కోటిసురార్చిత
జయజయ కోటీశలింగ స్మరమదభంగా !! 61

ఆపదల నిన్నుఁ దలఁపుచు
నీ పదలక్ష్యంబు నెవఁడు నియతి భజించున్
శ్రీపదలబ్ధి దనర్పగ
పాపదలశితునిఁ జేసి సలుపుదు వతనిన్. 62

ఓ కోటీశ్వర, యో కృపాజలనిధీ, యో శైలకన్యాపతీ,
యో కోటీశ్వర, యో జగత్ప్రియగతీ, యో భక్తరక్షారతీ,
యో కోటీశ్వర, యో దయామయమతీ, యో కోటిచంద్రద్యుతీ
యో కోటీశ్వర, పాహిపాహి యని దా నుచ్చైస్స్వరం బొప్పఁగన్. 63

పంచ స్తవములు జదువుచు
పంచేంద్రియ విషయదూరుఁ బంచాస్య శివుఁ
పంచాశుగహరు హరునిఁ
బంచ బ్రహ్మస్వరూపుఁ బ్రస్తుతిఁ జేయుఁ. 64

విశ్వవందిత, విశ్వాత్మ, విశ్వనాథ
విశ్వపాలక, విశ్వాఢ్య, విశ్వవినుత
దేవకోటీశ కోటీశదివ్యలింగ
యి మ్మహోపద్రవము బాపి యిపుడె బ్రోవు. 65

అని చింతింపఁగ భక్తపుంగవున కాయాసంబు బుట్టించె నీ
ఘన వర్షోద్ధతియంచు నెంచి మదిలోఁ గారుణ్య మేపారఁ జ
య్యన వారించెఁ దటిల్లతాభయదగర్జారావ సంపాతయు
గ్ఘన సంఘాతము చంద్రశేఖరుఁడు భక్తానంద సంధాయియై. 66

ఘనతరోద్ధాన మడఁగిన గానిపించు
పరమహంస స్వరూప విస్ఫురణ భంగి
ఘన తరోద్ధాన మడఁగిన గానిపించె
బరమహంస స్వరూప విస్ఫురణ మంత. 67

అప్పుడు గుహాంతరాళంబు వెల్వడి దశదిశావలోకనంబు నేసి, యమ్మహో త్పాతంబు కోటీశ్వరానుగ్రహంబునం బాసెగదా యని దేవు జూడం జనునెడ నడుమ నిర్ఝరనిర్ఘాత ప్రభిన్న కుట్టిమ స్థలంబున నతి స్థూలంబగు నొక్క నిధానకలశం బీక్షించి యది శివాజ్ఞాగతంబని యెఱింగి తమ్ములుం దానును దాని నతిప్రయత్నంబున నిజగుహాంతరంబునకుం జేర్చి దానివలన దినదిన ప్రవర్ధమాన మహైశ్వర్యవిభవుండై యఖండ మహిమానుభావంబున జంగ మార్చనలు నేయుచు శివజ్ఞాన సంపన్నులగు మహాత్ములవలన శివపురాణ శ్రవణంబు సేయుచు నిత్యంబును గోటీశ్వరారాధనం బొనర్చుచు, కాలంబు

సుఖానుకూలంబుగాఁ గడుపుచుండి యొకవేళ జంగమార్చనంబును నొక వేళ శివపూజయు, నొకవేళ శివమంత్రజపంబును నొకవేళ శివధ్యాన సమాధి నిష్ఠయు నొకవేళ కోటీశ్వర లింగార్చనంబునుం గావింపుచుఁ బరమానంద కందళిత స్వాంతుండై యొక్కనాఁడు— 68

తన యిలు వెలువడి యొక్కఁడె
ముని సేవితుఁ గోటిలింగమును బూజింపన్
జనుచుండి నడుమఁ గాంచెను
వనమొక్కటి పత్రపుష్పఫలపూర్ణంబున్. 69

ఆ వనరాజమందు భువనావను శంకరుఁ బూజ సేయఁగాఁ
బావన వృక్షశాఖల శుభప్రసవావళిఁ గోయుచున్న యా
ధీవనజాతగర్భులగు దివ్యమునీంద్రులఁ జూచి వారి స
త్పావన పద్యుగంబునకు భక్తిరతిన్ నతిఁజేసి ముందటన్. 70

పోవ పోవఁగ నంత నపూర్వమహిమ
గలుగు సహకార వనరాజి గానుపించె
మదన సహకార మిది మధుమాసమునను
చోద్యమగు దీని మహిమంబుఁ జూతమనుచు. 71

చని చని ముందట. 72

అంత గమలాకరంబులై యలరునట్టి
చారు కమలాకరంబుల సరణి నరిగి
బిల్వ కాంతారమొక్కటి ప్రేమఁగాంచి
తద్విలాసంబు వీక్షించి తనివిసనక. 73

లయగ్రాహి :
అందుగల చిత్రముల యందముల జూచి తరుబృందముల నీడలను పొందుగ మనోజ్ఞా । నందరసమగ్నులయి యిందుధర పూజన మమందముగఁ జేయు

చును డెందములు సౌఖ్య ! స్పందగతి లింగములయందు నలియింపుచు
పురందరముఖామరుల కందని మహత్త్వం ! బందగల భక్తులను కొంచటిని
జూచి మది సందడిలు భక్తి ముద మంది యతఁ డంతట. 74

ఇచ్చటను శంకరార్చన
విచ్చల విడిఁజేయ మదికి వేడుకపుట్టెన్
సచ్చరితు లిచట నీశ్వరు
నచ్చుగఁ బూజింప మోక్షమందుట యరుదే ! 75

అనుచుఁ జింతించి సాలంకుఁ డాత్మలోన
సారసాకర కాసార సారతీర
భూరి శాఖాతిశయ బిల్వమూలమందు
మౌననియతి పద్మాసనాసీనుఁడగుచు. 76

ఉద్ధూళన త్రిపుండ్రము
లిద్ధ గతిన్ దాల్చి యతఁడు నీశ్వర సేవా
బద్ధాత్ముఁ డగుచు నెంతయు
సిద్ధాసనమందు నిల్చి శివుఁ జింతించెన్. 77

కరతలంబుననున్న కలితేష్టలింగంబు,
దశవిధాలోకన దశను జూచి
చూపువెంబడి లింగరూపంబులోఁ జేర్చి,
లోసాక్షియగు తెల్విలో నమర్చి
ప్రాణలింగమునందుఁ బ్రామాణ్యగతిఁ గూర్చి,
భావలింగైక్యత పదిలపరచి
యందులోఁ దానైక్యమంది చిదాకాశ
మూర్తియై యానందభూతిఁ గాంచి

కొంత సేపు సమాధిచే గుణము లణఁచి
మరలఁ దెలివొంది కోటీశు మానసమున
పూజ గావింపఁదలఁచి యా పురవిరోధి
సుగుణరూపంబుఁ జింతించి స్వాత్మయందు. 78

శరదిందుకోటిసుందరమూర్తి గలవాని
పటుజటామకుట విభ్రమమువాని
నీలకాదంబరీ నీలకంఠమువాని
భుజగేంద్రహార విస్ఫురణవాని
వరదాభయమృగాగ్నికరచతుష్కమువాని
వ్యాఘ్రాజినాంబర ప్రభలవాని
వేదమంజీరాఢ్య పాదపద్మమువాని
వేదాంతవేద్యుని వేదమయుని
ఆ పరాశక్తిసహితుని యా పరాత్మ
నా మహామహు కోటీశు నాత్మనిలిపి
పూజగావించె నుపచారముల నొనర్చి
భక్తిశీలుండు సాలంక భక్తవరుఁడు. 79

అంత గనువిచ్చి చూచిన యా క్షణంబ
యిష్టఫలదాయియైన కోటీశ్వరుండు
జంగమాకృతి దాల్చి విశాల బిల్వ
మూలవేదిక వసియించె ముదము గదుర. 80

అంత నిర్వర్తితేశ్వరధానుండగు సాలంకుం డెదుటఁ గనఁబడు నాజంగమ మూర్తి సాక్షాత్కోటీశ్వరుఁగాఁదలంచి యభివాదనంబొనర్చి, తనయింటికిం దోడితెచ్చి, నిత్యంబు జంగమార్చన వ్రతంబున కేర్పఱచుకొని యమ్మహా పురుషున కర్పించిన పయశ్శేషంబాహారంబుగా నఖండ నిష్ఠాపరుండై యుండునంతఁ గొంతకాలంబున కతం డంతర్హితుండైన జింతాక్రాంతుండై

యగ్గిరిప్రాంత వనాంతరంబులు వెదకి, యెందుం బొడగానక నిరశన
వ్రతుండై యుండు నా సమయంబున— 81

ఆనందవల్లి కథ

పుండరీకభవాండ కరండ నిహిత
మండితామూల్య రత్నప్రకాండ మనఁగ
నిండు సంపద జనులకు నుండఁదగిన
కొండకావూరు తద్గిరిదండ నుండు. 82

ఆ రమణీయ పట్టణమునందున నింద్రసమాన కీర్తి వి
స్తారుఁడు, మేరుధీరుడు, సుధాబ్ధిగభీరుఁడు, వీత దుష్క్రియా
చారుఁ డుదారుఁ డాత్త సువిచారుఁడు శాశ్వతభాగ్యయుఙ్మహా
భీరుఁడు దా సునందుఁడని పేరువహించి ధరిత్రి మించెడిన్. 83

ఏ వంశమందు బెరిగెనొ
శ్రీ వల్లభుఁడైన శౌరి శ్రీకరుఁడును మా
న్నే వంశమందుఁ బుట్టెనొ
యా వంశమునను సునందుఁ డచట జనించెన్. 84

కుందరి యన నొకసతి నతి
సుందరి నుద్వాహమయ్యె, శుభగుణుఁ డతఁ డా
నందకధరుఁడు పయోనిధి
నందన నుద్వాహమైన నయముదలిర్పన్. 85

ఆ సతీమణి గలిసి నిత్యానురక్తి
నందనను గాంచె నాత డానందవల్లి
యను లతాంగిని, నదియు దినాభివృద్ధిఁ
బడసె వాసంత మల్లికావల్లిబోలె. 86

నంద నందనుఁడయ్యె నా నాథుఁ డల సు
నంద నందన నౌదు నే ననుచు లక్ష్మి
యా సునందున కాత్మజయై జనించె
ననఁగ నానందవల్లి తా నతిశయిల్లె. 87

హరుఁడు కోటీశుఁడై త్రికుటాద్రియందు
నిలువఁ-దద్భక్తి తత్ప్రాంత కలిత నగరి
గరిమ నానందవల్లినా నెఱి జనించె
నట్లు గాకున్న బుధజనాహ్లాదమగునె. 88

మఱియు నబ్బాల శిశుత్వంబునందు నిచటి కోటీశనిలయ త్రికూట కూటంబులం జూచు వైఖరి మెల్లనం గనువిచ్చి చూడఁ దొడంగె. శివభక్తిరహితులై చెడు జనంబుల శిక్షించిన నవ్వు చందంబున నవ్వసాగె. శివనామంబు ల వలుకు లీల మెల్లనం బలుకఁ బూనె. కోటీశ్వరదర్శనంబున కరుగు రీతిఁ దడబడుచు నడుగిడఁగఁ దొడఁగెఁ నంత కౌమారసమయం బగుటయు నాభీరమతల్లి యానందవల్లి తల్లిదండ్రులు వేయు హారవల్లరులును ఫుల్లకల్హార మల్లికా మాలికలనుం దిగనాడి భద్రరుద్రాక్షమాలికలు గ్రీవాలంకారంబుగా ధరింపుచు మేనంబూయు కర్పూర కస్తూరికాపటీర గంధ చర్చా చర్చ నుత్సాదనంబుచేసి భసితాంగరాగం బంగంబునం దనురాగంబునం బూయుచు బోటు లాటలంబాడు జిలిబిలి పాటల నటులోటఁబుచ్చి మాటి మాటికిఁ గోటీశుమీఁది గాథల మాటలు నోటికి హూటిపఱచుచు నింద్రియంబులఁ దత్తద్విషయంబు లనుభవించునెడఁ గోటీశ్వరార్పణంబు నేసి గ్రసింపుచు నిట్లఖండ భక్తి భావనావశంబుననుండు నవసరంబున వధూమతల్లియగు నానందవల్లికిఁ దల్లి యిట్లనియె. 89

అమ్మ మనయింట సకల భాగ్యంబులుంట
నవియు భోగింప కీ లీల నవయదగునె
నవలతాతన్వి యీ తపోనటనలెల్ల
తపసులకుగానిఁ చిన్నారి తరుణి కగునె ? 90

అనిన నెయ్యంపుఁదల్లికి గారాబు కూతు రిట్లనియె. 91

అమ్మ యిం దుండు భోగ భాగ్యంబులెల్లఁ
జెడును గూడంగ రావెందుఁ జెడదు శంభు
భక్తి కూడంగ వచ్చును ముక్తి నొసఁగు
దీని విడనాడ వచ్చునే మానవులకు ? 92

శివభక్తి కలుగు మీఁదట
నవిరళ సద్భోగభాగ్య మబ్బినమేలౌ
ధవుఁడున్న మీఁద నింతికి
నవభూషణ స్రగ్విలేపనంబులువోలెన్. 93

లోని నిక్షేపమెఱుఁగక దానిమీఁద
నిలిచి సంసారమొనరించు నిస్వునట్లు
హృదయగతుఁడైన యీశ్వరు నెఱుఁగలేక
బాహ్యమున నీశు వెదకును పామరుండు. 94

జనని ! మనము కోటీశ్వర స్థలములోన
నుండి యద్దేవు గొల్వకయుండఁ దగునె ?
తుచ్ఛసంసార విషయ సందోహములను
మరగి యురగేంద్ర భూషణు మఱవఁదగునె ? 95

కామముఖారులం గెలిచి గాఢవిరక్తిని శంభుభక్తుఁడై
కామవిదారిఁ గొల్చినను గల్గును మోక్షసుఖంబు లిప్పుడే
కాముకుఁడై దురింద్రియ వికారములంబడి శంభుఁ గొల్చినం
గామసుఖంబులం దనిసి కాంచును దాఁ గ్రమముక్తి నెంతయున్. 96

గరిమతో భోగమోక్షముల్ గలుగఁజేయు
నిహపరంబుల శివభక్తి యేమి చెప్ప

నట్టి భక్తిని వర్జించి యల్పమతులు
విషయ విభ్రాంతిఁ జెడుదురు వెఱ్ఱులగుచు. 97

ఇట్లు కావున, మనము కోటీశునందు
మనము గదియించి విషయవాసనలు ద్రుంచి
పూజఁగావింతు మనిన నా పువ్వుబోఁడి
తల్లిదండ్రులు భక్తి చిత్తమున దాల్చి. 98

పరమానంద మగ్నులై కోటీశ్వర ధ్యానలీన చిత్తులై యుండిరంత నా సునందుండు. 99

తనయావివేకపాకము
తనయాప్తుల కెల్లఁ దెలిపి తత్త్వస్థితిచే
త నయానురాగ వృత్తిని
తన యాత్మఁ దలంచె శివునిఁ దద్దయుభక్తిన్. 100

బాలిక యిది శివభక్తి
శ్రీ లలితయ యగుట దీని శివభక్తునకున్
లీల వివాహము సేయుట
మేలంచుఁ దలంచె నతఁ డమేయ మనీషన్. 101

అంత నానందవల్లికి దిదృక్షు జనానందవల్లి ఫలప్రాయంబగు యౌవన ప్రాయంబు దోపఁ ద్రిజగన్మోహిని యగు మోహినీకాంతయుం బోలె నక్కాంత నితాంతకాంతికాంతయై విరాజిల్లుచుండె నంత. 102

కమల కచ్ఛప కాహల కరభ పులిన
పుష్కరావర్త వీచికా భూభృ దబ్జ
బిస శశాంక పయోవాహ విజయకరము
లలితపాదాది వేణికాంతాంగకములు. 103

మగువ సౌందర్య వారాశి మథనజనిత
లక్ష్మియో యన సౌభాగ్య లక్షణముల
కెల్ల నిల్లయి యౌవనం బేపుమీఱ
స్మరవిరోధిని మోహింపఁ జాలియుండె. 104

అట్టి వయః కాలంబున
గట్టిగఁ గోటీశు నభవు గామించఁగ నే
పట్టున నన్యులపైఁ దగఁ
బుట్టునె కామంబు భక్తి పూర్ణాత్మలకున్. 105

కోటీశున్ మదిఁ బూజసేయు, నభవుం గోటీశుఁ జింతించు, దాఁ
గోటీశున్ వెలి జూడనేగు, నుడువుం గోటీశు నామావళిన్,
గోటీశార్చన సేయుచుండును మనఃకోటిం దివారాత్రముల్
గోటీశుండె సమస్త విశ్వమని సంకోచంబు మానున్ మదిన్. 106

ఆ తలోదరి హృదయాంబుజాతపీఠి
గోటిలింగంబు నిల్పి యకుంఠ భక్తి
బూజఁ గావించు సంకల్ప పుష్పములను
ప్రకట జీవోపహార మప్పనము సేసి. 107

ఇభరాడ్గామిని బాహ్యదేశమున గోటీశార్చనల్ సేయఁగా
శుభ సద్వస్తు వితానముల్ గొనుచు నాక్షోణీధ్ర కూటాగ్ర భూ
విభవోపేత శివాలయంబునను, సంవిల్లింగముం జూడఁగా
నభయం బొప్పగ నేఁగుచుండును వయస్యానీక సంయుక్తయై. 108

భస్మత్రిపుండ్రాంక ఫాలభాగముతోడ
విమల రుద్రాక్షహారములతోడ
కోటీశ భావనాకుంఠితమతితోడ
పంచాక్షరీ జపప్రౌఢితోడ

కరగత రుద్రాక్ష కంకణంబులతోడ
శివభక్తి లాంఛన స్థితులతోడ
నానంద హృష్టరోమాంచితాంగము తోడ
మహిత యోగారూఢ మహిమతోడ
దనరి యా యింతి కోటీశు దర్శనంబు
సేయఁగా నేఁగు నచ్చటి సిద్ధసమితి
భక్తి యీ లీల మూర్తియై వచ్చెననఁగ
భూమి నానందవల్లి, కాంతామతల్లి !! 109

ప్రత్యహం బట్టు లయ్యింతి పర్వతేంద్ర
మెక్కి యచ్చట కోటీశు నిష్టలింగ
మూర్తిఁగాఁజేసి పూజించుఁ బూని ప్రాణ
భావలింగంబులం దైక్య పదవినొంద. 110

సేయు నుత్తరశైవ సంసిద్ధి లేక
యుండియును, దాను సద్భక్తియుండు కతన
షట్స్థలాధ్వావధానంబు చంద్రవదన
చిత్తమున చంద్రధారణచేసి నియతి. 111

పూజించున్ శివుఁ బుష్పదామములచేఁ బాబోఁడి కోటీశ్వరున్
రాజచ్చంద్ర కళావతంస సమమై రంజిల్ల మౌళిస్థలిన్
తేజస్ఫూర్జిత ధూపదీపముల నెంతే నిచ్చు మాధుర్య వి
భ్రాజ ద్దివ్యఫలోపహార మొసఁగున్ భక్త్యన్వితస్వాంతయై. 112

అతివ : మధుమధుర ఫలోపహార మొసఁగి
విసము మెసఁగిన చేదు నిం పెసఁగ మాన్పె
నిరత మృష్టాన్న నైవేద్య నియతివలన
నాది భిక్షుత్వ ముడిగించె నభవునకును. 113

ఇట్లు నిరంతరం బట్బాల బాలేందు మకుటు నారాధింపుచుండి యంత నొక్క నాఁడు మహాశివరాత్రియం దోంకార నదీజలంబుల స్నానంబుజేసి, సితభసితో ద్ధూళన త్రిపుండ్ర రుద్రాక్షమాలికాలంకృతదేహయై శివనామామృతాంచిత రసనయై శివధ్యానలీనచిత్తయగుచు, నొక్కతియ య క్కుధరేంద్రంబెక్కి యక్కడ రుద్ర శిఖరాగ్రస్థ కోటీశ్వర మహాలింగంబు షోడశోపచార పూజా విధానంబుచే నారాధనంబుజేసి, తత్ప్రాంతకాంతబిల్వవనాంతర మధ్యంబు నం దొక్క శ్రీతరుమూలంబున పద్మాసనాసీనయై, జితేంద్రియ మరున్మనో వికారియై, కోటీశ్వరలింగంబు హృదయరంగంబున నిల్పి యంత మానస పూజావిధానం బధిష్ఠించి మఱియు— 114

వటమూలరత్న విస్ఫుట వేదికామధ్య
హాటకోల్లసిత సింహాసనమున
శతకోటి కందర్ప సౌందర్యమహిమతో,
కలితశరన్మేఘ కాంతితోడ
సితభాను భానుశుచినయనములతోడ
దరహాసశోభి వక్త్రంబుతోడ
వరదాభయ మృగాగ్నికర చతుష్కంబుతో
మౌనముద్రాచ్ఛన్న మహిమతోడ
దనరి భక్తార్తిహారియౌ మునిశరణ్యు
మదనహరు నీలకంఠు నుమాసహాయు
హృదయగతుఁజేసి, తన్మూర్తిఁ జెదరకుండ
నిలిపి పూజించె నాధీర లలన భక్తి. 115

జలజలోచన రాజోపచారములను
పూజఁ గావించి తల్లీన బుద్ధియగుచు
తన్ను జగములు మఱచి నేత్రములు మూసి
చొక్కి యంతట కనువిచ్చి చూచునపుడు. 116

ఆ లలన భక్తియుక్తికిఁ
జాలంగా సంతసించి జంగమరూప
శ్రీలలితుఁడు కోటీశుఁడు
బాలామణి కెదుట నిలచె బ్రస్ఫుటలీలన్. 117

ఆమూర్తిఁగాంచి దగ్గరి
భామిని సాలంక భక్తవరునకు వని ము
న్నీమూర్తిగాదె కన్పడె
నా మూర్తినిఁ గొలుతునే ననంతము ననుచున్. 118

ఆ మహాత్ముఁడు క్షీరోపహార మొకటి
దక్క నన్యంబు గొనఁడని తానెఱింగి
యుంట, గోక్షీరములు దెచ్చి యువిద భక్తి
నర్పణము సేయు నిత్యకృత్యంబుగాఁగ. 119

మున్నుసాలంక సద్భక్త పుంగవుండు
క్షీర మాతని కొసఁగి తచ్ఛేష మాత్మఁ
దృప్తిగాఁజేసి శేషమప్రాప్తమైన
వాసరంబుల నుపవాసవ్రతము జేసె. 120

నేమను గోక్షీరము లీ
మౌనీంద్రున కొసఁగి శేషమాహారముగా
బూనెద తచ్ఛేషంబును
లేనియెడం దనువు విడుతు లీల దలిర్పన్. 121

అని యి ట్లాభీరాంగన
ఘనమగు తద్వ్రతము బూనఁ గదలక యతఁడున్
దన యిచ్చజనక నిచ్చెను
వనజాక్షికిఁ బ్రాణహాని వచ్చునటంచున్. 122

ఇట్లు నిల్చిన నయ్యింతియుఁ బ్రతిదినంబును విష్ణుశిఖర ప్రాంత కాంత బిల్వకాంతారాంతరస్థిత పాపవినాశన లింగాగార ప్రాగ్భాగస్థ ద్రోణికాంత ర్జలంబులందోఁగి తదంబుపూర పూరిత పూర్ణకలశంబు శిరోభాగంబున ధరియించి రుద్రశృంగసంగత ప్రాచీన కోటీశ్వరలింగాలయ సమీప బిల్వ భూజాతస్థితుండగు నమ్మహాపురుషమూర్తికి ఉదత్కలశోదకంబుల నభి షేకంబుఁజేసి తత్రస్థ బిల్వ వనదళంబులం బూజించి, ధూపదీపంబులిచ్చి, క్షీరోపహారంబొసగి, తచ్ఛేషంబు తాను బానంబొనర్చుచు, నిరశనవ్రతంబుఁ బూని, కొంతకాలంబిట్లు గడుప, సాలంకాభిఖ్య భక్తవరుం డది విని యమ్మహాత్ముండు తనకు దర్శన మిచ్చిన జంగమమూర్తి యగునని భావించి, య గ్గిరి కరిగి, యచట న న్నగారోహణంబు జేయఁబూను నవ్వల్లవీ పల్లవాధరంగని, నిజోదంతం బెఱింగించి, యీ పర్వతాగ్రంబున నీచేతఁ బూజఁబడయుచుండు నమ్మహాత్మునకు సమయంబెఱింగి, నన్నెఱిం గింపు మంతఁదాక నిచటికి వచ్చుచుఁ బోవుచుండెద ననిన నయ్యింతియు నట్ల చేసెదనని యమ్మౌనియు మౌనముద్రాధరుండగుట సమయంబుగామి నెఱింగింపదయ్యె. నంతఁ గొంతకాలంబరిగిన గ్రీష్మసమయంబున నయ్యు విద విష్ణుశిఖరప్రాంతస్థ ద్రోణికాజలపూరిత కలశంబు శిరంబున నిడికొని, యమ్ముని సమీపంబున కరుగునెడ నుష్ణబాను భాను తప్తగాత్రయై యలసి, యెట్టకేల కచ్చటి కరిగి యక్కలశం బచ్చోట నిలిపి బిల్వ పత్రార్థం బరుగునంత నొక్క వాయసం బరుదెంచి యక్కలశంబు దొని కినం గినిసి నేఁడాది ని న్నగేంద్రంబునకు వాయసంబు రాకుండెడు మని శపించి బహు శ్రమాకలితయై యున్న యన్నాతికి దయాక్రాంతస్వాంతుండై యతం డిట్లనియె. 123

బాల నిజగృహంబున సుఖోపాయముగను
నిలిచి విషయాభిలాషమై నిఖిల సుఖము
లనుభవించెడి నిండు యౌవనమునందు
వనమునందున నాయాపపడగనేల ? 124

అన విని జవ్వని యమ్మని
గనుఁగొని తా నిట్లు లనియెఁ గాయము ప్రాయం
బును విషయములును, గాలం
బును సత్యంబగునె వట్టి మోహము లేలా ? 126

వయసు వేళల ననశన వ్రత తపోగ్ర
వన నివాసాది కృత్యము ల్వదలి కామ్య
సుఖములే కోరి, భోగింపఁ జూచెనేని
ముదిమి వచ్చిన నింతైనఁ గదల వశమె ? 127

కామ మెక్కువౌను, కడియు నోటికి బోదు
ధనమునందుఁ బ్రేమ దగులు మిగుల
చిక్కువడుచు నుండు జింతల వంతల
ముదిమి మోక్షసౌఖ్యమునకు తెరవె ? 128

అనిన విని యయ్యింతికి వైరాగ్యంబు గలుగుట నమ్మునీంద్రుండు దెలిసి, జ్ఞానోపదేశంబు జేసియైన నీ వ్రతాయాసంబు మాన్పెదగాక యని తలంచి యిట్లనియె. 129

నీకు వైరాగ్య ముండుట నీలవేణి
జ్ఞాన ముపదేశ మొనరింపఁ బూనినాఁడ
భూరి వైరాగ్యమే జ్ఞాన కారణంబు
జ్ఞాన మెక్కడ వైరాగ్య హీనునకును ? 130

మఱియు బాహాభ్యంతరమ్ముల దశదిశావకాశంబుల నంతట పరిపూర్ణంబై చిదాకాశంబగు బ్రహ్మం బొక్కటియె విరాజిల్లు, నందుఁ ద్రిగుణాత్మకయైన మాయాశక్తి తదభిన్నమై జనించిన నది యుపాధిగాగల చైతన్యం బీశ్వరుండై బ్రహ్మవిష్ణు రుద్రరూపంబుల జగత్సర్గస్థితిలయంబు లొనర్చుచుండు, నమ్మాయాశక్తి యవ్యక్త మహదహంకార పంచమహాభూతంబులయ్యె,

నీ భూతంబులు సూక్ష్మస్థూలాంశలవలన సూక్ష్మస్థూలదేహంబులును, సకల జగజ్జాలంబునయ్యె నయ్యచలంబగు చిదాకాశంబునందె సంకల్పశక్తి యుదయించె నదియ యవిద్యయనంబడు. తదధిష్ఠానచైతన్యంబె జీవుండనఁబడి స్వరూప విస్మృతివలన ననేక కోటిజన్మంబులెత్తుచుండి సుకృత పరిపాకంబున మనుష్యుండై గురుముఖంబున స్వరూపస్మృతి ముక్తుండగు; నా ముక్తి ద్వివిధయగు నందు చిదాకాశంబున మనోలయంబు చేయుటయు, సర్వంబును బ్రహ్మంబుగా సర్వావస్థలయందును విస్మృతిలేక చూచుటయు, నందు రెండవముక్తి యుత్తమ మగు; నందు మొదటి ముక్తికి సంకల్ప క్షయంబును, రెండవ ముక్తికి వాసనాత్యాగంబును జేయవలయు, మనోలయాభ్యాసంబునంగాని వాసనాత్యాగముక్తి సంభవింపదు. వాసనాత్యాగంబునం ధర్మవ్యాధ తులాధారంబున వసిష్ఠాదులు పుత్త్రదారాది సహితులై జీవన్ముక్తులైరి. కలియుగంబున సకలవర్ణాశ్రమంబులవారును శిశ్నోదరపరాయణులును కామక్రోధలోభమోహమదమత్సరావృత్తులునునై బహువిధ వేదాంత గ్రంథశ్రవణంబునను మహా వ్యాఖ్యార్థోపదేశంబులసేయు నయ్యధికారి గురువ్రాతంబులవలనను, తత్త్వజ్ఞానంబు తమకు దృఢంబైనట్లు భ్రమించి వాసనాత్యాగ యోగలక్షణం బెఱుంగకయె వసిష్ఠాదులంబోలి జీవన్ముక్తులమని పలుకుదు రది యసంగతంబు. వారలు వాసనాత్యాగశీలురును, నెడనెడ మనోలయావధానులును భూత భవిష్యద్వర్తమాన జ్ఞానులును వర్ణాశ్రమాచార విధికర్మరతులును నిత్యకర్మత్యాగులునై శాపానుగ్రహ సామర్థ్యంబులు గలిగి యుందురు. వీరలు వాసనాగ్రస్తులై వర్ణాశ్రమ విధికర్మంబుల దొరంగి నిషిద్ధకర్మంబు లాచరింపుచు నిమిషమాత్రంబైన మనోలయంబు నేయ నేరక జ్ఞానులమని వృథాహంకారంబులం దిరుగుట వాసనాత్యాగ ముక్తిం గనలేరు. కలిగెనేని నిమిషమాత్రంబైన చిత్తవిక్షేపంబులం బాసి మనోలయానందంబేల యనుభవించ రట్లగుట కలియుగంబున మనోలయవాసనాత్యాగంబులు సంభవింపవు. మోక్షేచ్ఛగలవాఁడు మోచకుండగు నీశ్వరు నుపాసించినఁ దదనుగ్రహంబున గామియైనఁ గామిత సుఖంబులబొంది

ుదప ముక్తుండగు, నకామియైన సద్యోముక్తుండగు; నయ్యీశ్వరుండును
బ్రహ్మవిష్ణు రుద్రాత్మకుండై పంచవింశతి లీలాభేదంబుల రామకృష్ణాద్యవ
ార భేదంబుల నానావిధంబులఁ గ్రీడించు నందు దక్షిణామూర్తి లీలా
స్వరూపం బుపాసించిన శ్రీశ్రమంబుగా సర్వేష్టసిద్ధులం బడసి సద్యోముక్తి
ాంచు నదెట్లనిన— 131

మున్ను దక్షాధ్వరమున దక్షుఁడీశ్వరు
నిందింపగ విని యనింద్య యగుచు
దాక్షాయణీదేవి తనువు విసర్జించి
శీతాద్రిరాజ సంజాత యగుచు
వైరాగ్యమున మనోవైభవం బెడలింపఁ
బురవైరి దక్షిణామూర్తి యగుచు
వటమూలవేదిక వసియించి తను దానె
గను సమాధిని మహామునులు గొల్వ
బ్రహ్మమై యుండె నద్దేవు భజనచేత
నఖిల సిద్ధులు వాసనాత్యాగయోగ
ఘనసమాధి మనోలయక్రమము లిష్ట
సంపదున్నతి గల్గు నీజన్మమందె. 132

ఆ దేవోత్తము డా సన
కాదుల క ధ్యాత్మవిద్య యలవడఁ బరపం
గా దయను ద్రికూటాద్రిని
బ్రోడిం గోటీశుఁడనఁగఁ బొలుపొందెఁగదా! 133

అట్టి కోటీశ్వరుఁడనేన యంబుజాక్షి!
నీదు సద్భక్తికినిమెచ్చి నేఁడు జంగ
మాకృతి ధరించి సత్కృప నీకు బోధ
సేయ వచ్చితి మత్పూజఁ జేసి తీవు. 134

మఱియు మోచకుండగు న న్నుపాసించుటవలన బంధమోచనం బగు విజ్ఞానంబు నీ కుపదేశించితి నిట్లు వాసనాత్యాగ యోగంబున సర్వంబును బ్రహ్మంబుగాఁ జూచుచు నీవు ని య్యుపవాసవ్రతంబు చాలించి వాసనాత్యాగచిత్తంబున నిజ నివాసంబున జీవన్ముక్తస్థితి నుండుమని యుపదేశించిన నమ్మహామహున కయ్యతివ గురుపూజా విధానంబు యథావిధిఁ గావించి యనేక వందనంబులు జేసి యిట్లనియె. 135

మీ రుపదేశించిన యీ
సారతరాద్వైతబోధ సరణిని ముక్తి
శ్రీరాజ్య పదము గంటిని
ధీరోత్తమ ! నీ ఋణంబుఁ దీర్పఁగ వశమే ! 136

అని తనదు వ్రతము దప్పక
వనజానన నేయుచుండ వలదనియును న
మ్ముని దలఁచెను మది మాయా
జనితోపాయంబు వ్రతము చాలింపంగన్. 137

గర్భ చిహ్నంబుఁ గల్పింతుఁ గాంత కిపుడె
యదియు నవమాస పూరితంబైన పిదప
నైన మానకయుండునే యతివ వ్రతము
చోద్యమగు దీనిధైర్యంబు జూతమనుచు. 138

అమ్మహాత్ముండు దన యోగప్రభావంబున నయ్యింతికి గర్భంబుఁ గల్పించిన నదియు నవమాసపూరితంబై బహుళాయాస కరంబైన నది మహాద్భుతంబగు దైవ యోగంబనితలంచియు వ్రతంబుఁ జాలింపక చేయు నా తలోదరి ధైర్యంబునకు దయాళుండై య య్యతీంద్రుఁ డిట్లనియె. 139

నీవు బ్రహ్మంబవై యున్న నిజము గనియు
గర్భభరమున నాయాస కలితవయ్యు

వ్రతము మానకయుంట యద్భుతము గాదె
యేమి కారణ మెఱిగింపు మిందువదన ! 140

అనినంత నా తలోదరి యిట్లనియె. 141

గురుని మహోపదేశమున గూడిన మోక్షముగాంచి యంత న
గ్గురు విడనాడఁ జెల్లునటె? కోవిదవందిత యట్ల నేను నిం
దరయ వ్రతానుభావమున నాథ్య భవత్కృప కర్హనౌచు ని
ర్భరత వ్రతంబు మానుట శుభంబగునే తలపోసి చూడగన్ ? 142

అన ముని పల్కు, నో యతివ ! యారయ నీ వచనంబు నుత్యమై
నను భవదీయ కష్టము మనంబున నేను సహింపలేక యి
ట్లనుటయె కాని సద్వ్రతము లక్కట ! యెందును మానవచ్చునే ?
వనజదళాక్షి ! నీ నిజనివాసము జేరుము నేన వచ్చెదన్. 143

నేనువచ్చిన నీ వింట నిలిచి వ్రతముఁ
గడుపఁగా వచ్చు నాయాసకలన నీకు
లేకయుండెడు నట్లౌట లేమ నీదు
భవనమున కేగు నీవెంట వత్తు నేను. 144

మరలి చూడక యరుగు మేమరక నీవు
నెచట మరలెద వచ్చోట నేను నిల్తు
ననిన మునివాక్యమాలించి యంబుజాస్య
ముందుగా నేఁగె మునియు పిఱుందనరిగి. 145

ఇట్లు ప్రాచీన కోటీశ్వరస్థానంబునందుండి య య్యాభీరాంగన ముందర నేఁగుచుండ వెనుక నమ్మహాత్ముండు మంథాన కుధర మథన కంధికబంధ శంభూత మహోద్భటార్భటిం జనుచుండఁ దదారావాకర్ణన విదీర్ణ కర్ణ పుట యగుచు భీతిల్లి సోపానమార్గమధ్యంబున నిలువంబడి మఱలి చూచె నంతట. 146

మఱలి చూచుట యెఱిగి య మ్మౌనివరుఁడు
తరుణి కిట్లనె నియమంబుఁ దప్పి తీవు
నేను భూమికి దిగిరాను మాని తాజ
శిఖర మధ్యస్థబిలమున జేరినిలుతు. 147

అనుచు ముని పల్క నయ్యింతి యచటనిల్చి
ప్రసవకాలంబు దోఁచినఁ బడసె సుతుని
యది నిరీక్షించి మౌని య య్యద్రి బిలము
జేరి యందు సమాధి నేఁ జేతు ననియె. 148

ఆ మాట విని యింతి, యతనితో నిట్లను
దద్బ్రహ్మకూట మధ్యస్థ బిలము
లోన సమాధిని బూని నీవుండిన
వ్రతభంగమైన జీవనము గోరి
యిహలోకమందు నే నేల నిల్చెద నేఁడు
బ్రహ్మైక్యసంసిద్ధిఁ బడయుదాన
నిదె చూడు మనుచు దా నేకాగ్రచిత్తయై
కోటీశు హృత్పద్మకోశమందు
నిలిపి శరదభ్రరుచిరయు, నీలకంఠ
చంద్రమకుటయు, పటుజటాసాంద్రకాంతి
మహిత ఫణిరాజ భూషయు, మాననీయ
యైన తన్మూర్తిఁ బూజల నందఁజేసి. 149

మున్ను సనకాదులకు మౌనముద్రచేత
పరమవిజ్ఞాన మొసఁగిన భవ్యమూర్తి
యిదిగదా యంచు మదినెంచి యిందువదన
ధ్యానమొనరించి కనువిచ్చు నంతలోన. 150

తన కుదయించి ముందటఁ గనుపట్టు శిఖ వదృశ్యంబగుటయు, తనదు కన్యాత్వంబుఁ జెడకుండుటయు, దనకు దేహాయాసంబు లేకుండుటయు, జూచి యంతయు మామకధైర్య పరీక్షార్థం బమ్మహాత్ముండు చేసిన మాయా ప్రభావంబనియు నీ జంగమమూర్తి సాక్షాత్కోటీశ్వరుండెయనియు నెఱింగి, తనకుఁ బ్రారబ్ధ కర్మక్షయంబగుటకు సంతసించి విదేహముక్తి నొంద దలంచి తన మనంబున నిట్లని వితర్కించె. 151

దేహమందున బ్రహ్మాండ గేహమందు
బ్రహ్మమంతటఁ బూర్ణమై బరగుచుంట
సద్గురుండగు నిమ్మహాసంయమీంద్రు
కరుణచేఁగాక యెందు సంగతిని గలదె ! 152

అని విచారించి 153

అంతటఁ దత్ప్రసాదమున నాత్మసమాధినిఁ జెంది చిత్త వి
శ్రాంతి వహించి, యా సతి విరాజితచిద్గగనస్వరూపయై
యంతయుఁ దానె యౌచును శివైక్యతఁ జెందిన మౌనిచంద్రుఁడున్
స్వాంతమునందు సంతసిలి శైలగుహాంగణభూమి నిల్చినన్. 154

అంతట 155

నిత్య మా భీరకాంత దా నియతి వచ్చు
కాల మేగిన రాకున్న గడువిచార
మంది సాలంకుఁ డజ శిఖరాగ్రమెక్కి
యందు గుహపొంతనున్న య య్యతినిఁ గాంచి. ... 156

సాష్టాంగ మెఱఁగిన సంయమి యిట్లను
సాలంక ! మున్నొక్క సమయమందు
నీకు దర్శనమిచ్చి నే నంత నంతర్హి
తుండనై రుద్రాఖ్యఁ దొడరు శిఖర

మందు వల్లవకాంత కగపడ న య్యింతి
వ్రతముజేసినను తద్వ్రతసమాప్తి
వేయఁగాఁ దద్గృహసీమకు నక్కాంత
తోఁగూడ నఱుగ నీత్రోవయందు
పరశివైక్యంబుఁ బ్రాపించెఁ బడఁతి యిప్పు
డేను నీ గుహాంతరమున నిల్వగోరి
నాఁడ గుహమీఁద గుడిగట్టి నయమెలర్ప
నందులో నూత్నకోటీశు నమర నిల్పు. 157

నిల్పి నీవును నిత్యంబు నియతిఁ దనర
బూజఁగావించి శివరాత్రిపూట భక్తిఁ
బ్రభలఁ గట్టించి వీరాంగ వాదనంబు
నెలఁగ నుత్సవమెంతయుఁ జేయవలయు. 158

కాంత సోపాన మధ్యమార్గంబునందు
ఘనసమాధిని శివునందుఁ గలిసె నిచట
నీవు గుడిఁగట్టి యందులో నిలుపు తత్స్వ
రూప మొక్క ప్రతిమ జేసి రూఢిదనర. 159

మను సోపానపథంబున
జను దెంచెడి వారలెల్ల సద్భక్తిని నా
వనజాక్షిఁజూచి యంతట
ఘనమతిఁ గోటీశుఁ జూడఁగల్గు శుభంబుల్. 160

* * *

ఇట్లు కోటీశ్వర పూజా విధానంబుఁ జేయుచు నంత త్రిలోకోత్సవావసరఁ
బగు శివరాత్రి వాసరం బరుదెంచిన నాసాలంకుం డుషః కాలంబున నోంకాః
నదీ జలంబుల స్నానం బొనర్చి భస్మోద్ధూళన త్రిపుండ్రంబులు ధరియింః

*గమనిక : ఇచ్చటనుండి అసలుప్రతిలో నొక కాగితము పోయినది.

రుద్రాక్ష మాలాలంకృత కంఠుండై కోటీశ్వరోపకంఠంబునం దపుంత భక్తి భావంబున నిల్చి కోటీశ్వరాష్టాక్షరీ మహామంత్ర జపంబు సేయుచు నా మంత్రరూపంబైన కోటీశ్వరాష్టోత్తరశతనామంబులం బూజించె నదెట్లనిన. 161

## అష్టోత్తర శతనామములు

ఓంకార వార్ధి శీతాంశు రోంకార బిసపంకజః
ఓంకార పంజర శుక శ్చోంకారాచల కేసరీ. 162

ఓంకార మంత్ర సంవేద్య శ్చోంకారాలయ సంస్థితః
ఓంకార పద్మినీ హంస శ్చోంకార వరకుంజరః. 163

నగరాజ సుతాజానిః నగరాజ ధనుర్ధరః
నవభూతి విలిప్తాంగో నాగాభరణ భూషితః. 164

నాదామృత రసాస్వాదో నాదబ్రహ్మ స్వరూపకః
నాదాతీతో నాదపరో నాద మూల నివాసకః. 165

నాగాజిన ధరో నాదినాదీ నాద్యైక గోచరః
నతార్తితిమిరార్కాభః నానాభక్త జనావనః. 166

నారదాది మునిధ్యేయో నయవేదీ నరప్రియః
నామరూప పరిత్యక్తో నారాయణసుపూజితః. 167

మోహాంధకార తరణిః మోహకాంతార పావకః
మోహాబ్ధికుంభ సంభూతో మోహానల మహాంబుదః. 168

ముగ్ధేందు భూషణో ముగ్ధో ముగ్ధావామాంగ సుందరః
మూలమాయాసమాసక్తో మూర్తిమత్కల్ప పాదపః. 169

కోటీశః కోమలాకారః కోటిసూర్యసమప్రభః
కోటిబ్రహ్మాండ సంచారః కల్పితాఖిల విష్టపః. 170

కుధరేశ్వర మధ్యస్థః కుండలీశ్వర కుండలః
కపాలభృత్కృత్తివాసాః కాలకాలః కకుప్పతిః. 171

కపర్దీ కామధు క్కామీ కామదః కామనాశనః
కామేశీ వల్లభః కాంతః కాంతేందూపలభాకృతిః. 172

కేవలః కేశవారాధ్యః కేశాంతర సురాపగః
కీనాశగర్వనిర్హారీ కృపాళుః కృపణార్చితః. 173

కైతవాసుర సంహర్తా కలికల్మష నాశనః
కాలకంఠ కళామూర్తిః కల్పాంత నటనోత్సుకః. 174

కల్యాణదాయీ కళ్యాణః కళ్యాణాచల కార్ముకః
కాలరూపః కాలనేతా కాలాతీతః కలస్వనః. 175

టీకాకారో జ్ఞానరాశిః టంకాయుధ సముజ్జ్వలః
టంకార జ్యా సమాసక్తో మహాజగవశోభితః. 176

టంకతుల్య జటా యుక్తో టిప్పణీకృత సచ్ఛ్రుతిః
శశ్వద్భాను సహస్రాభః శుంభత్పావకలోచనః. 177

శతానంద సమారాధ్యః శక్రాదిసుర సేవితః
శివ శ్శాంతః శశధరః శర్వ శ్శక్తః శ్రితావనః. 178

శూలపాణి శ్శుభావాసః శుచిద శ్శుద్ధవిగ్రహః
శంకర శ్శోభన శ్శుద్ధః శమితార్తి శ్శివప్రదః. 179

రాజతాచల శృంగస్థో రతిరాడ్దర్ప సంహరః
రామార్చిత పదద్వంద్వో రక్షితాఖిలచేతనః. 180

రజనీచర సంహారీ రసారథ విరాజితః
యక్షేశ మిత్రో యోగీశో యమి హృత్పద్మ భాస్కరః. 181

యమాదియోగ సంజాత విజ్ఞాన సులభాకృతిః
యల్లమంద మహాద్రీంద్రశృంగ రంగ న్నికేతనః. 182

అని యిట్లు నామంబు లతిభక్తిఁ బఠియించి
పుల్లాంబురుణ్ముఖ్య పుష్పములను
బిల్వదళంబులఁ బ్రియమొప్పఁ బూజించి
ధూపదీపాళి నద్భుత రసాఢ్య
నైవేద్య నీరాజన నతిసుమాంజలి
ముఖ్యోపచారముల్ ముదము గదుర
నర్పించి యీశున కభిముఖంబుగ నిల్చి
నిశ్చలచిత్తుఁడై నిర్జితేంద్రి
యుండయి యనంత సచ్చిదఖండ నిరుప
మాన మానిత స్ఫురణ నెమ్మనమునందుఁ
దలఁప శక్యంబు గాకుంటఁ దత్పరాత్మ
సగుణ రూపంబు నిట్లని స్తవ మొనర్చె. 183

జయకోటీశ్వర, భోగమోక్ష ఫలదా, సాహస్రభాస్వద్ఘృణీ,
జయకోటీశ్వర, మౌనిహృజ్జలజవాసా, దైవత గ్రామణీ,
జయకోటీశ్వర, దైత్యసామజ ఘటా సంక్షోభ కుంభత్సృణీ,
జయ కోటీశ్వర, భోగి భూషణ, శివా చంద్రార్ధ సంశోభితా! 184

అని వినుతింపుచు నచ్చటి
జనముల నీక్షించిపలికె సాలంకాఖ్యుం
డనఘాత్ములార! మీరలు
వినుఁడీ కోటీశు మహిమ విమల మనీషన్. 185

భక్తచిత్త తాపకరుల, పాపమతుల
గర్వ మద దురహంకార గతు లడంచి
భృత్యులుగఁ జేసి భక్తులఁ బ్రీతిఁ బ్రోచు
నట్టి దైవంబు కోటీశుఁ డవనియందు. 186

శీఘ్రకాలంబునందు నశేష వాంఛ
లొసఁగి దుర్జనకృత బాధ లొందకుండఁ
జేసి ప్రత్యక్షముగఁ జూపు శివుఁడు భక్త
పోషి కోటీశుఁ డిష్టముల్ పొసఁగ నిచ్చు. 187

కోటీశార్చన సత్ఫలంబు సుమనః కోటీశతం బొందదే ?
కోటీశానునిఁ గొల్చినన్ ధనలస త్కోటీశుఁడై యుండఁడే ?
కోటీశస్తుతిఁ జాతురంగికచమూ కోటీశతల్ గల్గవే ?
కోటీశుండె చరాచరాత్మక జగత్కోటీశుఁ డెంతేనియున్. 188

సంతరింపరాని సంసార విభ్రమ
భయమడంచి దుష్టపదము బాపి
బ్రోచు కోటిలింగమూర్తిని గొల్తురు
భక్తు లాత్మయోగ భజనులగుచు. 189

సర్వోపద్రవ తాపరోగ భయ కృజ్జాడ్యంబులం బాపుచున్
సర్వారిష్ట దరిద్ర శాత్రవ వినాశం బొప్పగాఁ జేయుచున్
సర్వానందము లిచ్చు మృత్యుహరుఁడౌ సర్వజ్ఞుఁ గోటీశ్వరున్
గీర్వాణాసుర సిద్ధసాధ్య మనుజుల్ కీర్తించు టాశ్చర్యమే ? 190

అమ్మహాదేవుఁ గోటీశు నజ్ఞులైన
తజ్ఞులైనను సర్వశాస్త్రజ్ఞులైన
మూర్ఖులైనను భక్తిచేఁ బూని తలఁప
సకల సిద్ధులు గల్గును సత్యముగను. 191

కరుణావారిధియై, జగత్త్రితయ రక్షాశాలియై సేవకా
మరభూజంబయి, చిన్మయంబయి, మహామాయాంధకార ప్రభా
హరణార్కద్యుతియై, స్వభక్త జనతాయాసక్షయాపాదియై
పరమాత్ముండగు కోటిలింగము మదిన్ భావింపఁగాఁ జెల్లదే ? 192

ధరణి మనుష్యానందము
తరియైనన్ దివిని దేవతానందంబున్
గురుఁడై బ్రహ్మానందము
పరగన్ గోటీశుఁ డిచ్చు భక్తుల కెపుడున్. 193

వరకోటీశ్వర సత్కృపోన్నతి సుదృగ్భావంబు గల్గినన్ మనో
హర కాంతాసుత పుత్త్రికాధన మృదువ్యాహార బాహ్యార్థ వి
స్తర శాస్త్రాగమ వేదతర్క కవితాస్వారస్య విద్యావళీ
గరిమల్ దీర్ఘతరాయువుల్గలుగు సాకల్యంబుగా నెంతయున్. 194

మూర్తిత్రయ శిఖరంబై
కీర్తింపఁగఁ దగినయట్టి గిరివరు మీఁదన్
మూర్తిత్రయ మయుఁడై శివు
డార్తిచ్ఛిత్కోటి లింగమై విలసిల్లున్. 195

ఇల మూర్తిత్రయ మూలమై దనరు కోటీశాను సేవింపఁగా
నల మూర్తిత్రితయంబు వశ్యమగు నెట్లన్నన్ ధరిత్రిన్ విని
శ్చల భూజస్ఫుట మూలమున్ బెరుకఁ దచ్ఛాఖావళుల్ వెంబడిన్
చలనంబొందుచు వచ్చురీతిని మహా సౌభాగ్యమూలంబుగన్. 196

ఇట్టి కోటీశుఁ గొల్వక యితర దైవ
వితతి సేవించుటెల్లను వెఱ్ఱితనము
నికట భాగీరథీనదీనీర ముడిగి
మరుమరీచిక సేవించు మనుజునట్ల. 197

తరువు పుష్పఫలమ్మిచ్చు తఱి యెఱింగి
యమర భూజంబు ఫలమిచ్చు నడిగి నపుడె
యమరు విత్తులు ఫలము దేహాంతరమున
నిన్నివిధముల నిచ్చుఁ గోటీశ్వరుండు. 198

మూఁడు కూటంబులను జాల మొనసియున్న
య న్నగేంద్రంబు పంచదశాక్షరి యన
కలిత సౌభాగ్య మోక్షము ల్గలుగఁజేయుఁ
ద న్నుపాసనఁ జేసెడి ధన్యులకును. 199

స్థలలింగ తీర్థకోటుల
కలఘుతర మహాధికార మబ్బుటవలనన్
గలిగెను గోటీశాభిధ
మిలలో నా లింగమూర్తి కేమనవచ్చున్ ? 200

*మాలిని :*

దిగధిపనుతకీర్తిన్, దివ్య కోటీశమూర్తిన్
విగళిత సమవర్తిన్, భీతభక్త ప్రపూర్తిన్
మృగధరు నతిభక్తిన్, మించి పూజించిరేనిన్
ఖగ గమనసమానాఖండభాగ్యంబు గల్గున్. 201

కోటీశుఁ గొలుచు సజ్జన
కోటికి నందంగరాని కోర్కులుగలవే ?
యేటికి నుపసంసేవన
లేటికి కృష్యాదిబాధ లీ మనుజులకున్ ? 202

*తరళ :*

గరళ కంధరు, భక్తవత్సలు, కామితార్థదు, శంకరున్,
పురనిషూదను, చంద్రశేఖరు, భూతనాయకు, శాశ్వతున్,
గురుతరాకృతి, దక్షిణాస్యుని, గోటిలింగముఁ గొల్చినన్
దొరకు నిప్పుడె భుక్తి ముక్తికి దుష్టశత్రువినాశమౌ. 203

*చిత్రపదము :*

గురువరేణ్యునిన్ గోటిలింగమున్
పరశివాకృతిన్ భక్తివేద్యునిన్

దురితదూరునిన్ దుష్టసంహారుఁ
గరిమగొల్చినఁ గల్గు సౌఖ్యముల్. 204

చిత్తక్షోభము మాన్పు, సౌఖ్యరసముం జిందించు, దుర్మార్గ దు
ర్వృత్తుల్ జేయు విరోధముల్ గెడపుచుఁ భృత్యత్వ మెవ్వారికిఁ
గృత్యంబై చనఁజేయు స్వస్థలమునఁ, గీలించు సంపద్దళల్
నిత్యంబుఁ నిజభక్తసంతతికి నోలిఁ గోటిలింగం బిలన్. 205

కోరినను గోరకుండిన
గోరంగారాని యట్టి కోరికలైనఁ
గూరిమి భక్తుల కిచ్చును
వారక కోటీశుఁ డట్టివారలు గలరే? 206

కల్పతరువుల సురమణి కామ ధేను
వులను దివినుంచి ధాత యీ యుర్వియందు
నుంచెఁ గాబోలు కోటీశు నుచిత సరణి
నిట్లు గాకున్న నొసఁగునే యిష్టములను? 207

దక్షిణామూర్తి దైవంబు దయదలిర్ప
నిలఁ ద్రికుటాద్రియందుఁ గోటీశుఁడయ్యె
ముక్తియన నెంత యా దేవు భక్తతతికి
ముక్తసంగులు గొల్తు ర మ్మవిశరణ్యు. 208

పంచచామరము:

చరాచర ప్రశస్త లోకసాక్షియైన యీశ్వరున్
పరాపర స్వరూపు సర్వభక్త లోకపాలకున్
పురారి నీశు కోటిలింగమూర్తి శంభుఁ గొల్చినన్
నిరాకరించవచ్చు ఘోర నిష్ఠురోగ్ర సంసృతిన్. 209

భుజంగప్రయాతము :

భుజారూఢ భోగీంద్రభూషావిశేషన్
నిజానందుఁ గోటీశు, నిత్యంబు గొల్వన్
గజస్యందనాందోళికాయాన జాలం
బజస్రంబు గల్గున్ మహామాయ గెల్చున్. 210

ఒక మహాస్థలి కీశుఁడై యొప్పుచున్న
దైవమును గొల్చి ముక్తికిఁ బోవవచ్చు
నిమ్మహాస్థలిఁ గోటీశు నెనఁగఁ గొల్చి
యేవి కాంచంగవచ్చునో యెఱుగరాదు. 211

స్రగ్ధర :

కోటీశుల్ గోపవాహుల్ గులిశ ధరనుతుల్ ఘోరపాప ప్రణాశుల్
జూట స్థాబ్జారిఖండుల్ సుమహిత ఫణిరా ట్చుభ్రహారాభిరాముల్
పాటీరాంభోజ తారాపతి సుశర శరద్వారిదోదారకాంతిల్
సూటిల్ సేవించిరేనిల్ స్ఫురతరవిభవస్ఫూర్తియుల్ గీర్తులొందున్.212

దొనల నీరంబు లభిషేకమునకు గలుగ
దనర భూజింప బిల్వ పత్రములు గలుగ
వని ఫలంబులు నైవేద్యమునకు గలుగ
ఏల యర్చింప రీ దేవు హీనమతులు ? 213

అనుచు నందఱు వినఁ బల్కి య మ్మహాత్ము
డాత్మ చిత్తంబుఁ గోటీశునందు నుంచి
యన్య మెఱుఁగక యానంద మతిశయిల్ల
చలన మెంతయు లేక నిశ్చలత నిలిచి. 214

అంతఁ గొంత కాలంబునకు లబ్ధస్మృతియై సాలంకుం డ మ్మహాశివరాత్రి జాగరణోపవాస శివలింగ దర్శన బిల్వపత్రార్చనంబులు యథావిధిం

గావించి మఱియు నాహోవక కోటీశ్వర లింగంబునందు హృదయార
విందంబుఁ జేర్చి, దృష్టి నిల్పి, యానందబాష్పబిందుసందోహంబు
నయనారవిందంబులఁ గందళింపఁ గంచుకిత రోమాంచాంచిత శరీరుండగుచు
గద్గద కంఠుండై యిట్లని స్తుతించె. 215

విశ్వమంతయు నీవయై వేఱు లేక
నిలిచి యుండుటఁ గంటి నీ నిశ్చయంబు
దొలఁగకుండఁగఁ జేయవే తొలఁగెనేని
నిట్టి తెలివికి ఫలము లే దెంచిచూడ. 216

నీ మహిమాస్పద భక్తిని
నీ మహి కొఱతేమి లేక యే నుండుటచే
పామరులగు దుర్జనులను
వేమఱు యాచింపఁబోవు వెత మానెగదా! 217

పలుకుల్ నీనుతియందు, మానసము నీ పాదాబ్జమం, దీక్షణం
బులు నీ రూపమునందు, హస్తములు నీపూజావిధానంబునం,
దల కర్ణంబులు నీకథాశ్రవణమం దర్పించి దీపింప ని
శ్చల వృత్తిం దయఁజేసి ప్రోవఁగదవే సర్వజ్ఞ కోటీశ్వరా! 218

అని యా లింగముఁ గౌగిలించుకొని, తా నానంద బాష్పాళిచే
దనరంగా నభిషేకమిచ్చి, తన హృత్కంజంబునన్ శుద్ధ వా
సనయన్ ధూపము దెల్పి, దీపముగ నిచ్చన్ గూర్చి యాత్మార్పణం
బొనరించెన్ శివభక్తిపూర్ణుఁడయి, వాచోం్యకారవర్గంబుచేన్. 219

ఇట్లు గావించి సాలంకుఁడేమిచెప్ప
దనివిచాలక యా లింగదర్శనంబు
చేసిచేసి మహానందసిద్ధిఁగాంచి
యెలమి నద్దేవుఁ గనుఁగొని యిట్లనియె. 220

దేవా ! కొందఱు లింగం బపరిచ్ఛిన్నంబై యంతటం బరిపూర్ణంబై యుండ పరిచ్ఛిన్నంబయి జడంబయిన శిలారచిత లింగంబులఁ బూజింపనేల యని యందు రది యసంగతం బా లింగం బదృశ్యంబగుట దేవతలు కైలాసమం దుండు దివ్యమంగళవిగ్రహంబును మానవులు మహాస్థలంబులందుండు శిలా లింగంబులఁ బూజింపుఁడని వేదంబులు బలుకుచుండు నదియునుగాక, యదృశ్యంబై సర్వగతంబయిన వాయు వతిశీతోష్ణప్రదంబై జనంబులకు, బాధయొనర్చియు నయ్యె యెడల పరిచ్ఛిన్నంబులై జడంబులైన వ్యజనా దులయందు జనించి సుఖంబొసంగిన రీతి నపరిచ్ఛిన్నుండును నదృశ్యుం డైన యీశ్వరుండును సృష్టి స్థితి లయ కృత్యంబులఁ బ్రాణులకు బాధ యొనర్చియు నయ్యె యెడల బరిచ్ఛిన్నంబులై జడంబులయిన లింగంబులం దావిర్భవించి భక్తులకు నిష్టార్థసిద్ధియును ముక్తియును గావించునన నేన దృష్టాంతంబగుదునని యందఱు వినఁ బల్కి మఱియు నిట్లనియె. 221

కోటీశానుని బాసి యుండగఁలనా ఘోరంపు సంసార దు
ష్కూటంబందున జిక్కి సొక్కుచు మనఃక్షోభార్తిపాలౌ నన
త్కోటిం గూర్పక నందు భక్తతతితో గూడంగ నీ యద్రిరా
ట్కూటాగ్రంబునఁ జేర్పవయ్య నిను నే గొల్తుఁగా దివారాత్రముల్. 222

కోటీశ్వర ! కోటీశ్వర !
కోటీశ్వర ! యనుచు భక్తికొలఁది నుతింపఁగా
గోటీశ్వర ! వారల ధన
కోటీశులఁ జేయఁగల వకుంఠిత లీలఁగా. 223

అనుచు నుతియించు సాలంకు నాత్మవేది
గాంచు కోరిక మదిలోన గడలుకొనఁగ
సిద్ధసంతతి చనుదెంచి శీఘ్రముగను
బలికె నాతనితో మృదుభాషణముల. 224

సాలంక ! నీవంటి సద్భక్తు నెచ్చట,
వినమును జూడము వేయునేల ?
కలియుగం బిదియౌటఁ గనుపడ కే మిట్లు
గుహలలో దాగి త్రికూట నాథు
కోటీశుఁ బూజించి కోర్కెతో నణిమాది
సిద్ధిసంతానంబుఁ జెందినాము
కూటత్రయంబున గుహలును బిలములు
బహుళంబు లుండు నీ పర్వతమున
నందుఁ గల చిత్రములఁ జెప్ప నలవి యగునె
యమర తరువులు సురభు లయ్యమృతనదులు
గలవు తత్ప్రాంతములయందు నిలిచి సిద్ధ
పటలి కోటీశుఁ గూర్చి తపంబు సేయు. 225

ఇమ్మహాస్థలి మహిమంబు లేల చెప్ప
నెంత జెప్పిన మూఢాత్మ లెఱుఁగలేరు
చెప్పకుండినఁ బ్రాజ్ఞులు తప్పకుండ
గాంచెదరుగాన మౌనంబె గాంతుమింక. 226

అని చెప్పి సాలంకా ! నీవును నిర్విశంకుండవై యిమ్మహాశివరాత్రి నుప వాస జాగరంబులు నేసి కోటీశ్వరలింగంబునకు బిల్వపత్రార్చనంబుజేసి తదాజ్ఞాప్రకారంబుగాఁ బ్రభలుకట్టించి సేవింపుమని యానతిచ్చి, యంత ర్ధానంబుజేసిన నతండు నా దిక్కున కభిముఖుండై నమస్కరించి నంతట.

బహు ధనవంతు లౌట నిజభాగ్యసమృద్ధికొలంది భక్తిచే
బహుళ విచిత్రవై ఖరి ప్రభానికురుంబము గట్టి చుట్టునన్
బహువిధ వాద్యముల్ మొరయ భక్తవరుం డతఁ డేఁగుదెంచుఁ దా
నహహ వచింప శక్యమె మహాద్భుతమైన తదుత్సవస్థితిన్! 228

ఇట్లు శివరాత్రివాసరంబున సాలంకుం డగ్గిరీంద్రంబున కరగుటగాంచి సకల ధరాజనంబులు యథాశక్తి ప్రభానిచయంబుతోఁ జనుదేఱ నమ్మహోత్సవం బత్యంతవిచిత్రంబయ్యె నొక్కదినమంద సమాప్తంబగుటకు మనంబున విచారంబు నొంది సాలంకుం డచట కల్యాణోత్సవంబుజేసిన నిరంతరోత్స వంబు జరుగునని తలంచి యక్కోటీశ్వరాలయంబునకుఁ బశ్చిమభాగంబున నొక్క శిలాభవనంబు నిర్మించి యందు నుమాదేవిం బ్రతిష్ఠింపఁ దలంచు సమయంబున నాకాశవాణి యతని కిట్లనియె. 229

మును సతీసతి హిమవంతమునకుఁ బుత్రి
యై జనించిన వైరాగ్య మధిగమించి
దక్షిణామూర్తిరూపంబుదాల్చి శివుఁడు
మునులతోడ నీ కుధరేంద్రమునకు వచ్చె. 230

వచ్చిననాటనుండి హిమవన్నగపుత్త్రి బ్రతిష్ఠ జేయలే
దిచ్చట నెవ్వఁడైన నిపు డీవు ప్రతిష్ఠయొనర్పఁ బూనుటల్
పిచ్చితనంబు గాదె మదిలేదె వివేకము నీకటన్న నా
సచ్చరితుండు దా వినియు సాహసధర్మము మాన కెంతయున్. 231

తరుణేందుధరుని సేవకు
కొఱతయగునుగాదె యిచట కుధరేంద్ర సుతన్
వరభక్తి నిలుపకుండిన
మఱియును ధరలోన బయలమాటలు నిజమే? 232

అని చింతింపుచు నా నగేంద్రసుత దివ్యాగార మధ్యస్థలీ
ఘనపీఠస్థితజేయఁ దత్ప్రతిమ వేగ మాయమైపోయినన్
మనమం దెంతయు జింతనొందుచును దన్మధ్యస్థ పీఠమ్మునం
దున గూర్చుండి సమాధినిష్ఠకు మదిన్నాల్కొల్పి ధర్మాత్ముఁడై. 233



సాలంకేశ్వర స్వామి

లింగమునందుఁ బ్రాణములు లీనమొనర్చి మనోలయంబుచే
నంగవికారము ల్దెలియ కాత్మశివైక్యనిరూఢి నిర్గుణా
సంగ సుఖప్రభావమయ సత్యచిదాత్మకు డౌచు నెంతయుఁ
లింగము దానయౌచు రహినిల్చె శిలాగృహపీఠికాస్థలిఁ. 234

సాలంకేశ్వర లింగం
బాలోన నిలింపసేవ్యమయ్యెను ధరలో
నా లింగమూర్తిఁ గొల్చిన
గాలుని భయ మడఁగు ముక్తికల్గును వేగఁ. 235

ఆతని తమ్ములు మువ్వురు
చేతోజాతారి భక్తిశీలురు సుజన
వ్రాతాభినుతులు సద్గుణు
లా తీరుగ లింగమూర్తులైరి ధరిత్రిఁ. 236

ఆ లింగంబులు మూఁడు బ్రహ్మహరిరుద్రాఖ్యాతలింగంబు లా
సాలంకేశుని యీశులింగము ప్రభాంచ ద్దివ్యకోటీశ్వరుం
డాలోకింప సదాశివాఖ్యమగు లింగాకారమై యొప్ప నా
శైలోత్తంసము సొంపుమీరు నిల పంచబ్రహ్మలింగాఢ్యమై. 237

ఆ నగేంద్రము మీఁదట నజ్ఞులైన
ప్రాజ్ఞులైన సుధీంద్రియప్రతతి నిలిపి
తపముజేసిన సిద్ధియౌ తద్విపర్య
యంబుగాఁజేయ సిద్ధిలే దరసిచూడ. 238

అట్లు సాలంకు డచట శివైక్యమైన
యంతమీదఁ ద్రికూటాభిధాద్రియందు
మహిత శివరాత్రినాఁడు నమర్త్య మర్త్య
వితతి యుత్సవమొనరించు విభవ మెసఁగ. 239

అందు దేవోత్సవం బెట్టిదనిన. 240

గరుడ గంధర్వ యక్ష కిన్నర సుపర్వ
సిద్ధ సాధ్యదిగీశ్వర శ్రీశ కమల
గర్భ దేవర్షి బ్రహ్మర్షి గణము లుత్స
వంబు గనుగొన వేడుక వత్తు రెలమి. 241

మును దేవేంద్రుఁడు శంభురాజ త్రిజగన్మూర్ధాభిషేక స్థితిన్
గనుటం దా శివరాత్రి కాలమున రంగారన్ ద్రికూటంబునం
దున గోటీశ్వరు బూజఁ జేసినను జెందుం బ్రహ్మపట్టంబునా
కనుచుం దివ్య గజాధిరూఢుడయి డాయన్ వచ్చు నచ్చోటికిన్. 242

భవవిద్వేషి మఖంబునందున హవిర్భాగంబు భక్షింప సం
భవమౌ కల్మష మీత్రికూటమున దీపానేక రూపంబుచే
శివరాత్రి న్నిశి భక్తసంఘముల కక్షీణాంధకారంబు బా
ప వినాశంబగు నంచుఁ బావకుఁడు తేవన్ వచ్చు నచ్చోటికిన్. 243

శివభక్తౌఘము మున్నెఱుంగకయె నే శిక్షింపగాఁ బోయి యా
శివుచే శిక్షితవృత్తినైతి నిక నే శ్రీమత్త్రికూటాద్రిపై
శివరాత్ర్యాగత భక్తులం గనుచుఁ దచ్చిహ్నంబులుం జూచి వా
రి విసర్జించెదనంచు నంతకుఁడు బేర్మిన్ వచ్చు నచ్చోటికిన్. 244

శివు కారుణ్యముచే దిగీశ్వరుఁడనై చెన్నొందితిం గాని యా
శివభక్తిక్రియ లే నెఱుంగను పలాశి ప్రస్ఫురద్వంశసం
భవముం గాంచుట నీ శివోత్సవమునన్ భక్తిక్రియల్ గాంతు నం
చువిలాసంబున వచ్చు నిరృతియు దా సొంపొంద నచ్చోటికిన్. 225

సర్వజలాధినాథునిఁగ శంభుఁడు నన్నొనరించె నింక నీ
సర్వజనంబు లుత్సవము సంగతి నచ్చుటఁ గూడ వారికిన్

బర్వ పిపాసఁ బాపఁగ శుభాంబువు లచ్చటఁ గల్గఁజేసి యా
శర్వునిఁ బ్రీతుఁజేతునని సాగరవల్లభుఁ డేఁగుదెంచెడిన్. 246

దరఁ గోటీశ మహోత్సవాగత సుభక్తశ్రేణి మార్గంబునన్
స్ఫురితోష్ణాంశు మయూఖపుంజములచే శోషింపకుండంగ స
త్వరతం బోయి తదీయ ఘర్మజలముల్ వారింప గోటీశ్వరా
దరణంబందెద నంచు నాపవను డుద్యత్ప్రీతి నేతెంచెడిన్. 247

ఎనయ నిధిప్రదాత జగదీశుని మిత్రుఁడనై తదుత్సవం
బున ఘనవైభవంబులను బూర్తియొనర్పకయుంట యొప్పునే
యని ధనదుండు యక్షనివహంబులు గొల్వ విమానయానుఁడై
ఘనమతియై త్రికూటపతిఁ గన్గొనవచ్చును సంభ్రమంబునన్. 248

పరమేశానుఁడనయ్యు దిక్పతులలో బాసిల్లి యేనుంట సు
స్థిర కోటీశ మహోత్సవంబునకు నీ దిక్పాలకశ్రేణితో
సరిగాఁ బోవలెనంచు నెంచి మది నీశానుండు వేంచేయు భా
స్వరతారాచలకూట సన్నిభ మహోక్షారూఢుఁడై వేడుకన్. 249

హర్యజుల్ సతతంబు హర్యజనామక
శిఖరస్థులయ్యును శివమహోత్స
వాడంబరముఁ జూడ నమరులతోడుత
తమలోకములనుండి తత్త్రికూట
శైలయాత్రకుఁ బోవ స్వాంతంబునను గోర్కె
జనియింప బరివారసహితులగుచు
వైకుంఠ సత్యలోకౌకసుల్ గుమిగూడి
కడువేడ్కతోడ వెంబడిని నడువ
శ్రీమహాలక్ష్మి వాణియుఁ జేరి కొలువ
బ్రబల ఖగరాజ సితగరు ద్వాహనముల

నెక్కి దేవర్షితతు లిరుప్రక్కలందు
స్తవముసేయంగ వత్తు రుత్సవముఁ గనఁగ. 250

దివ్య విమాన యానులయి దేవగణంబులు మింటనుండి రా
భవ్య తరాప్సరోంగనలు పాటలు బాడుచు ముందు ముందుగా
నవ్యమరాళయానలయి నాట్యముసేయుచు వచ్చుచుండ స
ద్దివ్యసమృద్ధి నగ్గిరివరంబు జెలంగె మహాద్భుతంబుగన్. 251

ఇట్లు సర్వసుపర్వనికాయం బరుదెంచి యమ్మహామహీధరాధిత్య కాంత కాంత బిల్వకాంతారమధ్యంబునం బ్రవేశించి మహాశివరాత్రిం దత్తద్ద్రోణి కాజలంబుల స్నానంబుసేసి భస్మోద్ధూళిత త్రిపుండ్రాంకిత గాత్రులును భద్ర రుద్రాక్షమాలికా భరణులును, పంచాక్షరీ జపపరాయణులునై త్రికోటీశ్వర లింగంబునకు మహాన్యాసపూర్వకంబుగా నభిషేకంబుచేసి షోడశోపచారంబులం బూజింపుచుందు రిది దివ్యోత్సవంబు మనుష్యుల కగోచరం బింక మనుష్యోత్సవం బెట్టిదనిన. 252

మాఘ శుక్ల ప్రతిపదాది మాఘబహుళ
వరచతుర్దశి పర్యంత మురుగజాశ్వ
మహిష కాసర గోవృషోన్మద వరాహ
కుక్కుట శునక మార్జాల కోటిఁ దెచ్చి. 253

మొక్కుబడి దీర ద్రిప్పుదు రక్కుధరము
నకుఁ బ్రదక్షిణంబుగను జనంబు భక్తి
నభవ కోటీశ కోటీశ హరహరా మ
హేశ యను నినాదము నభం బెల్లనిండ. 254

ప్రతి దినంబును శుద్ధ పాడ్యమి మొదలుగా
మాఘ మాసంబున మనుజు లా త్రి

కూట కూటంబుల గురునితంబంబుల
వర బిల్వ కాంతార వాటికలను
దొనల తీరంబున ఘన తటాక ప్రాంత
ముల తింత్రిణీ వృక్ష మూలములను
కాసారముల చెంత గండోపల శ్రేణి
నీడల వల్లికా నిలయములను
వీరమాహేశ్వరాళికి విప్రతతికి
భక్తి సంతర్పణము జేసి పార్థి వార్య
శూద్ర సంకీర్ణకులుల కక్షుద్ర గతిని
నన్న మిడుదురు కోటీశ్వరార్పణముగ. 255

అమ్మహాస్థలి మాఘ మాసమ్మునందు
స్నానములు జేసి భూసుర సమితి కన్న
దాన మొనరింప నశ్వమేధంబు లొక్క-
కోటి చేసిన ఫలమబ్బు కుధరతనయ ! 256

అంత శివరాత్రి చేరువయైన దిశల
నుండియేతెంచు తండోపతండముగను
వరప్రభాతతి తన్మహావైభవంబు
శేషభాషాపతులకైన జెప్పఁదరమె. 257

నిడుదలౌ వేణువుల్ నిలువుగా నవరించి
పై చిత్రపటములు బాగ గట్టి
శిఖరాగ్ర కలశముల్ చెలువుగాఁ బొసఁగించి
ముకుర నికరము నిమ్ముగ నమర్చి
పుష్పమాలికల నింపుగ నంతటం జుట్టి
ఘంటాశతము లిరుగడల గట్టి

నందివాహనము లానందమొంద ఘటించి
యామీఁద లింగంబు నమర నిల్పి
ప్రభలు రచియించి శకటముల్ వాహకులును
మోసికొనిరాగ వీరాంగములు చెలంగ
ప్రజలు సనుదెంతు రానందభరితు లగుచు
నెల్లమందేశుఁ గోటీశు నీశుఁ జూడ. 258

ఊరూరం బ్రభ లేగుదెంచు నెడలన్ యోగ్యంబుగా ముందటన్
వీరాంగంబు శివంబులాడు జనముల్ వేశ్యాంగనా నాట్యముల్
భేరీ మర్దళ కాహళ ధ్వను లఖర్వీభూతమై నిండ వి
స్తార ప్రక్రియ సేవసేయుదురు రాజద్వైభులం దెంతయున్. 259

ఏవీటం గనుఁగొన్న నచ్చటనె కోటీశుండు ప్రత్యక్ష స
ద్భావం బందిన యట్లు దోఁచెడిని శుంభల్లీలఁ దత్సేవలం
దావిర్భూత మహోత్సవంబుగన నాహా యిట్టి యాశ్చర్యముల్
లేవెందుం జతురబ్ధి మధ్య యగు నుర్విన్ సర్వదేశంబులన్. 260

మఱియుఁ బ్రాగాద్యష్ట దిగంతరాళంబులనుండి మహాపథంబులంజనుదెంచు సితాసిత పీతారుణ ప్రభాసముదాయంబులగు ప్రభానికాయంబులు నలుగడల మహోత్తుంగ మృదంగ శంఖపటహకాహళ వీణావేణుతాళఘంటా నినాదంబు లొక్కుమ్మగి నాకాశం బనవకాశంబు సేయుచు, నసంఖ్యాకంబగు జనం బరుదేఱ నందు వేదశాస్త్ర పురా గమ తర్కవ్యాకరణ మీమాంసా కావ్యనాటకాలంకారాది విద్యలు శిష్యగణంబులకు బాఠంబుఁ జెప్పుచు దార పుత్త్రబంధు సహితముగా వచ్చు బ్రాహ్మణ కదంబంబును, కదంబకుసుమ గుళుచ్ఛచ్ఛాయాచ్ఛాదిత పృష్ఠభాగంబులై జలధరాంతర్గత జలం బాకర్షించి నిజభూత్కారంబుల దెసలు నిండం బ్రవహింపంజేయు చందంబున శుండా దండంబులు మీఁదికెత్తికొనిచను మహోద్దండ వేదండ తండంబులును, వేదండతండంబుల ననుసరించి పథంబునఁ దపన తాపంబునఁ గందు జనం

బులకు నిజఖుర పుటోద్ధూత ధరణీపరాగంబున తిగ్మాంశు బింబంబు నాక్ర మించి విశ్రాంతిజేయు నభంగ తురంగంబులును, తురంగముల గముల పిఱుందన నతి గమనవేగంబున దేవయానంబుల యానంబుల నూనంబు గావింప నవి విగతమానంబులై విమానంబులనం బరఁగి లఘుత్వంబువలనం దూలంబుల లీల మింటందూల విజృంభించు సముత్తుంగ శతాంగంబులును, శతాంగంబుల సంగతి సింగంబుల భంగి సింహనాదంబులు సేయుచు విగత కోశంబులగు కరవాలంబుల తళతళచ్ఛాయల ఛాయాధిపతిచ్ఛాయల మాయిం పంజాలు సముద్భట వీరభటనికరంబులును గల చతురంగ సైన్యంబులతోడం జనుదెంచు రాజశేఖరులును రాజశేఖర మిత్రసమాన సంపదలు గలిగి ప్రచ్ఛాదిత రాంకవాంబరచ్ఛాయ తటిల్లతావితానంబుగా చక్రఘోషంబు లుఱుములుగాఁ గాదంబినుల డంబు విడంబించు శకటపరంపరల వలన నానావిధ వస్తువర్షంబుల వర్షించు పర్జన్యులోయన నరుదెంచు వణిగ్జన సముదయంబును, సముదిత యాదోనిధానంబు ననుకరింపుచు సకల వస్తు సంపూర్ణంబై యఖండ మండలాకారంబుగాఁ జనుదెంచు సైరికతండం బును, నమ్మహాదేవు కోటీశు మోహింపం జేయ నేతెంచు విష్ణుమోహినీ రూపకోటియోయనఁ జెలువొందు వారవిలాసినీ సమూహంబును కలిగి విరించనుఁ డుదంచిత సృష్టికృత్యంబుచేత సృజించిన జనంబు నమ్మహా దేవునకుం జూప నాకర్షించిన రీతి వచ్చు నసంఖ్యాకంబగు జనంబును నా జనంబునకు స్థితికృత్యపరుండైన విష్ణునిచేత పోషణార్థంబు కల్పింపంబడిన నానావిధ పదార్థంబులన విపణివీథిఁ విరాజిల్లు నానావస్తుజాతంబును గలిగి శివరాత్రి యుదయకాలంబునం దన్నగేంద్రం బఖండవైభవోపేతంబై ప్రకాశించు నెంతయు— 261

ఆనగేంద్రంబు సేవింప నరుగుదెంచు
మేరు మందర నీలాద్రి తారశిఖరి
వితతియన దీపితారుణ సిత మరీచి
పట కుటీరంబు లొప్పు తత్ప్రాంతమునను. 262

ఆత్రికూటాద్రి సన్నిధి నద్భుతముగ
వీథికాశత సాహస్ర విపణిలక్ష
లక్షితంబౌచు హయగజరథపదాతి
బూరితంబైన యొక మహాపురము దనరు. 263

ఆపురవీథులందు వణిగగ్రణు లంగణసీమలన్ మహో
ద్దీపిత వస్తుజాలములు దెచ్చి నగంబులరీతి రాశిగా
దాపుటచేత సజ్జనవితానము తృప్తివహించి భూమియం
దేపురమందునైన గలదే యిటులంచుఁ దలంచు నెంతయున్. 264

ఒకవంక నవవిధప్రకట ధాన్యశ్రేణి
యొకచోట ఫలరాసు లొక్కయోర
కర్పూర కస్తూరికా గంధసారంబు
లొకచెంత గుడసితా సుకరమధువు
లొకసీమ నవరత్న నికరపేటిక లొక్క
చో మణిభూషణస్తోమ మొక్క
యెడ చిత్రవస్త్రాళి యేర్పడ నొకచాయ
దారులోహజ సుసాధనచయంబు
గలిగి విశ్వమునందునఁ గలిగినట్టి
వివిధ వస్తుపరంపరల్ వెలయుచుండ
సకల భోగైకనిలయమై సకలసౌఖ్య
భవనమై యొప్పుచుండు నప్పట్టణంబు. 265

అందుండు సర్వజనములు
పొందుగ శివరాత్రినాఁడు భోగస్థితులం
జెందక యాకోటీశ్వరు
నందె మనోరూఢి నిలిపి యచలస్ఫురణన్. 266

సరగద్రోణికలందు స్నానంబులొనరించి
సలిలార్ద్ర వస్త్రసంకలితు లగుచు
భస్మత్రిపుండ్రాంక ఫాలంబు లనువొంద
భసితంబు మేన నేర్పడఁగఁ బూసి
శిరమున కోటీశశిఖరి మారుగ శిలల్
కీలించియును ముక్తకేశు లగుచు
దంపతుల్ గైదండ లింపుగా సవరించి
మ్రొక్కులు దీరగా మ్రుదము గదుర
నభవ కోటీశ కోటీశ హరహరా మ
హేశ యనుచును తనువులం దెరుకమాని
మానితానందసుధను నిమగ్నులగుచు
కొండదిరుగుదు రచ్చటనుండు జనులు. 267

జంగమమూర్తులై శివుఁడు శైలముడిగ్గి తదుత్సవంబు ప్రే
మంగని సంతసించి గరిమంబునఁ బూజలొనర్చు భక్తకో
టింగను వేడ్క నెమ్మది ఘటింపఁగ నెంతయు వచ్చెనోయనన్
జంగమకోటి యచ్చటి కసంఖ్యముగాఁ జనుదెంచు నెంతయున్. 268

జంగమంబులు శివుఁడని చాటు శ్రుతులు
నమ్మి జంగమపూజ లున్నతి నొనర్చు
జంగమప్రాణియౌ భక్తజనము మనము
లీన మొనరించుఁ గోటీశు లింగమంద. 269

వీరమాహేశ్వరాచార సంపన్నులౌ
యారాధ్యు లచ్చట నధికభక్తి
నొగిఁ ద్రికూటాద్రీంద్రు నురమున ధారణ
లింగమౌ కోటీశు లింగమూర్తి

నిష్టలింగమునందు నెసఁగ నాకర్షించి
ప్రాణలింగమునందుఁ బట్టుకొలిపి
భావలింగమునందు బరిణమింపఁగఁ జేసి
యల మహాలింగమం దనువుపఱిచి
స్వాత్మతోగూడ నేకమై సమరసైక్య
తృప్తిచేతను సన్మనోధిప్రవృత్తు
నాత్మఁగలయంగ నంత సర్వాంగలింగు
లగుచు నానంద మొందుదు రద్భుతముగ. 270

అరయ యోగీంద్రు లా త్రికూటాగ్రమందు
నీశు శివు జగత్కోటీశు నెసఁగఁ జూతు
రట్ల యోగీంద్రు లీ త్రికూటాగ్రమందు
జూతు రీశ్వరుఁ గోటీశు శుద్ధమతిని. 271

సర్వమును బ్రహ్మమని చూచు శాంతనిధులు
సర్వమయుఁడైన కోటీశు శంభుఁ జూడ
నరుగు దెంతురు నిస్పృహులయ్యు నింక
నన్యులెవ్వరు నచ్చోటి కరుగకుంద్రు. 272

శివ హర నామోచ్చారణ
మవిరళముగఁజేయు జనుల యారావంబుల్
చెవిసోఁకి ఖగమృగాదులు
శివలోకముఁజేరు నరులు సేరుట యరుదే! 273

సకల వర్ణాశ్రమాచార సహితులయ్యు
విగత వర్ణాశ్రమాచారవిధిఁ జరించు
పరమహంస లనంగ నేర్పఱుపరాక
నచట నందరు నేకమై యలరుచుంద్రు. 274

కనకగిరిచుట్టు తిరుగు నర్కునికి రాక
సాగనందునఁ దత్ర్పభాచయము నుత్స
వంబు జూడఁగ నంపిన వచ్చినట్లు
ప్రభలు నగరాజు చుట్టును బ్రబలి నిలచె. 275

లలిఁ ద్రికూటాద్రిరాజు మేఖలలచుట్టు
వలిత ఘంటారవములు దిక్కులనునిండ
మేఖలాకారముగఁ జాల మెఱయు ప్రభలు
పత్ర్పభాదీప్తి భానుమత్ర్పభల మీఱు. 276

ఆకోటీశ్వరు దర్శనార్థముగ నత్యంతంబుగా వచ్చు నా
లోకాలోక పరీత విశ్వధరణీలోకస్థు లాయాసముల్
లేకుండ న్నగమెక్క నాత్మదిశ నర్థిన్ దిక్పతుల్ నిచ్చెనల్
జోకం బెట్టినరీతి నాల్గుదిశలన్ సోపానముల్ వర్తిలున్. 277

అందు శరదిందు మందార కుంద బృంద
చందనామరవాహినీ సాంద్ర కాంతి
కాంత నవసుధాధౌత నితాంత దీప్తి
బ్రాగ్దిశారూఢ సోపానపటలి యమరు. 278

ఆసోపాన పథంబుజేరి ప్రభ లుద్యద్దివ్య కోటీశ్వరా
వాసం బంటగ నేఁగుచో నపుడు దుర్వారోరు భేరీధ్వనుల్
ఘాసంత్రాసముగాఁగఁ బర్వి గుహలం బూర్ణంబులై నిండివన్
వాసిన్ బుట్టుఁ బ్రతిధ్వనుల్ దశదిశాభాగంబు గప్పన్ వెసన్. 279

మఱియు నా ప్రభానికాయం బరుగునెడ ననేక వీరాంగ వాదనంబులును, పటహ ఢంకా వేణు వీణా మృదంగ శంఖ ఘంటా నినాదంబులును, నిరు గడలం జనుదెంచు జనుల కోలాహలార్భటులును నొక్కుమొగి భూన భోంతరాళంబులు నిండ నన్నగేంద్రంబు నాదమయంబై విరాజిల్లు చుండు;

నా ప్రభానిచయంబునందుఁ గొన్ని తార హార హీర తార తారాచలాఖండ లోద్దండ వేదండ డిండీరఖండ శ్రీఖండాఖ చ్ఛవిబంధురంబులును, కొన్ని రసాలపల్లవ హల్లక తరుణారుణ ఘుసృణ మసృణ భాసురంబులును, కొన్ని తప్తకాంచన ప్రసూనోదంచిత హరిద్రాక్షద్రవద్రద్యుతివితాన వితతంబులును, కొన్ని విచిత్రచ్ఛాయాడంబరాంబర ప్రభాచ్ఛాదన కిమ్మీర వర్ణంబులును, కొన్ని విచిత్ర పుష్పపల్లవాలంకృతంబులును, కొన్ని స్వసంవృత పటవిచిత్రిత నంది భృంగిరిటోమామహేశ్వరలింగ బ్రహ్మ విష్ణ్వాది సర్వసుపర్వవిగ్రహంబులునునై కోటీశ్వరాలయ ప్రదక్షిణంబున కరుగునెడ నెడనెడ భూతి రుద్రాక్షమాలాలంకృతదేహులై ప్రమథగణంబులంబోలు గణంబులు కోటీశ్వరధ్యానలీనమానసులై జనంబులు మ్రొక్కు మ్రొక్కుబడుల లోపంబుల దేహతాపంబులు జనింపఁ దదీశ్వరప్రేరిత వాక్యంబులఁ దదుపద్రవ శాంతిగాఁగ నంతనంత సంగీత వాద్య నృత్యంబులు నెలంగ సోపానమార్గమధ్యాభీరకాంతా గృహంబునకుఁ బ్రదక్షిణంబు గావించుచు దక్షిణలోనంగి కోటీశ్వరాలయ ప్రాంతంబున కేఁగి ప్రదక్షిణ త్రయం బొనరించి తద్దేవున కభిముఖంబుగా నిల్చునెడ గణంబులు నేయుచు నానందపరవశులై భజింప మ్రొక్కులు చెల్లించి మరల నేతెంచు సమయంబున యాచకగణంబులు సోపానతలంబున దేవతాగణంబుల భజింపుచు వచ్చు గణంబుల యెదుట నిలిచి వినుతింపఁ గోటీశ్వరాలయంబునకుఁ బ్రదక్షిణార్థం బరుగుదెంచు ప్రభానిచయంబునకు మార్గంబియ్య నోరసిల్లుచుండు నెడ విశాలస్థలంబుల విశ్రమింపుచు, తత్పర్వతాధస్థిత వనాంతరంబులకుం జేరియుండు నింక జనంబు లెక్కుపెట్లనిన— 279

చేదుకో కోటప్ప చేదుకో కోటప్ప
చేదుకో కోటప్ప చేదుకొనుము
అను వాక్యములు మింటనంటఁగా సోపాన
పటలి నెక్కుటఁ బుట్టు బడలికలను
శీతలచ్ఛాయా విశేష భూషితములౌ
తరుమూలములయందుఁ దనర నిలిచి



ఉత్సవ సమయమున ప్రభలు

పటుచిత్ర చిత్రిత ప్రభల నీక్షించు న
యానందవశమున నడఁగఁజేసి
యంత మీఁదట మార్గమధ్యంబునందుఁ
బటు దృషత్ఖండ మండిత భవనమునను
నిలిచియుండిన యాభీరలలనఁ గాంచి
శిరమువంచి నమస్కృతుల్ చేసి భక్తి. 280

కానుక లొసఁగుచు ముందట
బూని యఖండంబు నిలిపి పూజింపుచు త
ద్ధ్యానంబుఁజేసి యవ్వల
మానితగతి నరుగుచుండ్రు మనుజులు భక్తిన్. 281

అంత సోపానపద్ధతి నధిగమించి
యద్భుతంబైన కోటీశ్వరాలయంబు
గాంచి తదుపాంత కాంతార కాంతసీమ
విశ్రమించి పథశ్రమ వినిమయించి. 282

కోటీశు గుడిచుట్టు గోపురంబు లనంగ
గోపురం బొరపిన కొనలుగలిగి
కొనల గీలించిన గురుతర కలశముల్
గగనస్థ తారకాగణము గాఁగ
గగనస్థ తారకాగణము అగ్రస్థ
మల్లీమతల్లికా మాలికలుగ
మాలికాకారతః మారారి నిలయంబు
చుట్టు నిల్చిన ప్రభఁ జూచిచూచి
యద్భుతాక్రాంతచిత్తులై యహహా! యిట్టి
యుత్సవంబులు గలవె యీ యుర్వియందు

సేతు కాశీ పురాంతర ఖ్యాత భూము
లేఁగి చూచితి మీ చిత్ర మెందు లేదు. 283

అని చింతింపుచు దేవదేవుని మహోర్ధ్వావాస ప్రాగ్ద్వార మం
దున నందీశ్వరుఁ జూచి మ్రొక్కులిడి ముందుంబోవ నూహించి యా
జన సమ్మర్దము జూచి భీతిలుచు నోజన్ గోటిలింగేశ్వరున్
గను టెట్లో యిట నంచు నెంచుచు మదిం గాంక్షల్ విజృంభింపఁగన్.

ఎట్టకేలకు గుడిలోన నెట్టుకొనుచు
బోయి యిచ్చట గుడ ఘృత భూరి శాలి
తండుల సువర్ణ కలధౌత తామ్రఖండ
ములను కానుక లిచ్చి సమ్మోద మొదవ. 285

కోటీశాభిధ లింగమూర్తిని జగత్కోటీశు నీక్షింపుచున్
సూటిం జూపుల వెంటనంటి మదిలోఁ జోద్యంబుగా నిల్చినా
కోటీశాకృతి బైటికేఁగునని సంకోచించి నేత్రంబు ల
ప్పాట న్మూసిరనం బ్రహర్షమున రెప్పల్ మూతు రచ్చో జనుల్. 286

అట్లు సలలితానంద మహానుభూతిఁ
బూత చేతస్కులై తమ మ్రొక్కులెల్ల
దీర్చి మఱలంగ మ్రొక్కుచు దిగి నగేంద్ర
ముత్సవంబులు గావింతు రుర్వియందు. 287

అందు బ్రాహ్మణు లా నగేంద్రాగ్రసీమ
నిలిచి యుపవాసములు జేసి నిద్రమాని
ఘనత మీఱి లింగోద్భవ కాలమందు
పూని గోటీశునకు బిల్వపూజ జేసి. 288

అచ్చోటి యుత్సవమును వి...
యచ్చర సేవ్యంబుఁ జూచి యద్భుత మొదవన్

సచ్చరితు లైనవారికి
నిచ్చట వసియింపగల్గు నెప్పుడు ననుచుఁ. 289

అని మనంబునం దలంతు రెంతయు. 290

పరమానురాగ వశమున
ధరణీసురు లచట బ్రహ్మతత్త్వ విచారం
బురుభక్తిఁ జేయుచుందురు
పరమానందంబుతోడఁ బ్రజ్ఞాన్వితులై. 291

సామగానంబులు సదివెడువారును
వేదాంతశాస్త్రముల్ వినెడువారు
శివపూజ లర్థితోఁ జేసెడువారును
పరగ భాగ్యంబులు వల్కువారు
పంచస్తవంబులు పఠియించువారును
స్మరణంబు భక్తిచే సల్పువారు
శివపురాణంబులు సెప్పెడివారును
శివపద ధ్యానంబు నేయువారు

దృఙ్మనః ప్రాణముల నొక్కదిక్కుఁ జేర్చి
నిర్వికల్ప సమాధిలో నిల్చువార
లగుచు విప్రులు శివరాత్రియందు జాగ
రంబు నేతురు మహితోత్సవంబు దనర. 292

పుష్కర తాడన ధ్వనులు బోరుకొనం దగఁ దన్నగాగ్రయు
క్పుష్కర మధ్య సంభవ సుకోమలశోభిత వాసనా మిళ
త్పుష్కరజాలముల్ గొనుచు ముక్తిపదంబును గూడునట్టి యా
పుష్కరకేశు మూర్ధమున (బూజ నొనర్తురు భక్తియుక్తిచేఁ. 293

గుడిపై నఖండదీపము
పుడమికి గనిపింపఁ జూచి భూమీజనముల్
నడురేయి మింట సూర్యుడు
పొడమె నిదేమొయని భీతిఁ బొందెద రచటన్. 294

గిరిరాజ మూర్ధసంకీలితాద్భుత రుచి
జ్యోతిర్లతాకృతి స్ఫురణ లనఁగ
కుధరేంద్ర సానుసంకుచితాభ్రమండల
లాలిత నవతటిల్లతిక లనఁగ
తద్గిరీశ గిరీశ తత శిరోభాగస్థ
పీతభాస్వర జటావితతి యనఁగ
భూధరాగ్ర విహార భూరిసిద్ధ వ్రాత
విజ్ఞానదీపికా విభవ మనఁగ
పర్వతము మీఁద గుడిచుట్టు ప్రభలచుట్టు
వనులచుట్టు నసంఖ్యముల్ ప్రజలు వెట్టు
నమలరోచిరఖండదీపములు వెలుఁగు
గరిమతోడ లింగోద్భవ కాలముననుc. 295

గిరిక్రింద జరుగు నుత్సవ
మరుదైవర్తింప నమరు లంబరవీథిక్
వర దివ్యయాన గతులై
పరికింతురు సతులఁగూడి భావంబలరన్. 296

జగతిలోఁ గల్గు పుణ్యభూస్థలుల యందు
నేయు నుత్సవకోటులు చెప్పనేల?
ధర్మకర్తల యాధీనతను వహించు
నిచటఁ గోటీశ్వరాధీన మెంచిచూడ. 297

నగరాజమెక్కు ప్రభలును
దిగు ప్రభలును గుడికిఁ జుట్టుఁ దిరిగెడి ప్రభలున్
దిగువ ధరాతలమందున
మిగుల న్వసియించు ప్రభ లమేయము లచటన్. 298

మఱియు దిగువ నిలుచు ప్రభ లనంతంబు లందు నొక్కొక్క ప్రభాసమీపంబున వీరాంగ వాద్య నృత్య విద్యావిలాసంబు లమేయంబుగా బ్రవర్తిల్లుచుండు నెంతయు. 299

శరదభ్ర సన్నిభ సామజ సంఘము
ల్ఘనతరాంతస్థ నక్రములుగాఁగ
నవవిధ వాద్య సన్నాదముల్ తత వాయు
జనిత తరంగ ఘోషములుగాఁగ
పర్వతస్థాపి తాఖర్వ దీపచ్ఛటల్
రాజితాంతర్లీన రత్నములుగ
పవమానవేగ సంప్లవమాన కేతన
పటములు వీచికా పటలములుగ
బరగి యీ యుత్సవముఁ జూడవచ్చినట్టి
యఖిల దేశాగత మహాజనాంబురాశి
తనరి కోటీచంద్ర సందర్శనమున
పొంగిపొరలి నగేంద్రంబు ముంచకున్నె. 300

ఆకసమునుండి భూమికి నరుగుదెంచి
యుత్సవముజూచు తారల యొప్పు దెలిపి
కొండ క్రిందను దీపితాఖండ దీప
వితతిభాసిల్లు నద్భుతోన్నతిఁ దనర్చి. 301

పైనున్న జనము లాపైన నిల్చినయట్టి
ప్రభలకుఁగట్టు దర్పణములందు

క్రిందియుత్సవములఁ బొందుగా నీక్షించి
బహుళోత్సవంబు లీపర్వతమున
బరగుచున్నవటంచు భ్రాంతిచే భావించి
యండె ; నిల్చిరి గిరిక్రింద జనులు
క్రిందటి ప్రభల నింపొందు నద్దములందు
కుధరంబుపైనుండు గుడినిగాంచి
అచటి భక్తులఁ బ్రోవఁ గోటీశ్వరుండు
పరగ గుడితోడఁ గ్రిందికి వచ్చె ననుచు
భ్రాంతి నీక్షించి యచటనే పాయకుందు
రద్భుతముగాదె యాచంద మరసిచూడ. 302

గిరిక్రింద నుండు జనములు
పరగన్ దమరుండుచోట భక్తిస్ఫురణన్
వర లింగమూర్తి నిలుపుచు
గరిమన్ బూజింతు రిష్టకార్యార్థముగన్. 303

తద్గిరిప్రాంత కాంత కాంతారమందు
వీరమాహేశ్వరాచార విధిఁ జరించు
భక్తతతికిఁ గోటీశ్వరార్పణముగాఁగఁ
జెలఁగి మాహేశ్వరార్చనల్ చేయుచుంద్రు. 304

బహురుద్రాక్షజటాధరుల్ సతతమున్ భస్మత్రిపుండ్రాంకితుల్
ముహురుద్ధూళన దీప్తదేహు లతిసమ్మోదాత్ము లుద్యన్మతుల్
బహిరంతస్థిత లింగలీన హృదయప్రాణేంద్రియౌఘుల్ మహా
మహు లేతెంతురు తత్త్రికూటపతిప్రేమన్ బూజగావింపఁగన్. 305

కైలాసంబునవైన దక్షిణదిశా కైలాసమందైన హృ
త్కాలుష్యంబులు బాపు శ్రీనగ హిమక్ష్మాభృత్తులందైన నీ

లీలన్ వేఁగ బ్రసన్నమూర్తియయి గౌరీశానుఁ డిష్టార్థముల్
చాలాయిచ్చుట లేదటంచు జనముల్ చర్చింతు రచ్చోఁ దగన్. 306

ఈ త్రికోటీశు కరుణచే నిష్టసిద్ధు
లొదవు మాకంచు జనుదెంతు రర్థిజనులు
ఈ త్రికోటీశు కరుణచే నిహమునందె
ముక్తియగు నంచు వచ్చు ముముక్షు వితతి. 307

ఇంద్రవ్రజము :

కోటీశ కోటీశ త్రికూట యంచున్
పాటించి కీర్తింతురు భక్తులెల్లన్
కూటస్థుఁడీ లౌకికకోటి కెల్లన్
గోటీశుడే యంచును గోర్కెమీఱన్. 308

వనతరుచ్ఛాయలను నిల్చి వనజపత్ర
శతములను బూజసేతురు సర్వమయుని
కోటిలింగేశు విశ్వేశు కోటికోటి
పద్మజాండాధినాథుని భక్తితోడ. 309

మగధ పాంచాల కోసల మద్ర పాండ్య
చోళ కురు కాశ మత్స్య నేపాళ గౌళ
సాల్వ కుంతల ముఖ్యదేశస్థ జనులు
వత్తురా కోటిలింగోత్సవంబుఁ జూడ. 310

వచ్చి తమ కోరుకోర్కులు
విచ్చలవిడి కోరుకొనుచు వెనుకటి మ్రొక్కుల్
సచ్చరితులగుచు దీర్చుచు
మచ్చిక కోటీశుఁ జూచి మఱలుదురు వెసన్. 311

చింతామణి సురతరుతతు
లెంతేనియు దా జడములయ్యు నిష్టంబొసఁగన్
కంతుద్వేషి చిదాత్మకుఁ
డెంతైనన్ భక్తతతికి నిచ్చుట యరుదే ! 312

బహు పుత్త్రపుత్త్రికా ప్రాభవైశ్వర్యముల్
ధనధాన్య వస్తువిస్తారములును
హయగజ పశువృద్ధి యమిత తేజస్ఫూర్తి
యుభయలోకములందు నభయవృత్తి
నిజకళత్ర సుఖంబు నిఖిల సమృద్ధియు
కన్నులు కాళ్లు నంగముల బలిమి
శత్రుసంహారంబు మిత్రసంబంధంబు
బడయంగఁగోరి యా ప్రజలు మదిన
ఖండ దీపంబు లెంతయుఁ గొండఁ దిరుగు
టయును హేమ రాజత తామ్ర మయములైన
ప్రభలు హేమరజిత పుష్పపటలి యాది
గాఁగ మ్రొక్కులు మ్రొక్కి యుత్కంఠతోడ. 313

మీఁది శివరాత్రికిని వచ్చి మీకు మ్రొక్కు
మ్రొక్కులెల్లను జెల్లింతుము దయఁ బ్రోవు
మభవ ! కోటీశ ! యని దిశాయాతజనము
లుత్సవము సేతు రెంతయు నుచిత లీల. 314

లయగ్రాహి :

కొందఱు తటాకములఁ గొందఱు సువాపికలఁ గొందఱును ద్రోణికలఁ
కొందఱు మరాళా ! నందకర పద్మినులయందునను స్నానములు
పొందుగ నొనర్చి నరబృంద మిరువంకలా ! సందడులు సేయుచు
నమందగతిచేత గిరిక్రిందుగ ప్రదక్షిణము లందముగఁ జేయఁగా ! గ్రందు

కొన వేడుక లమందముగ నిందుధరుచందములు సూచి ముదమొందు
దురు భక్తిన్. 315

కరకంజంబుల నిష్టలింగముల రంగల్లీలతోఁ గూర్చి దు
స్తర సంసారపయోధి నావ యగు భాస్వచ్ఛంభు పూజన్ మహో
దర భావంబున జేతు రెంతయు మనస్తాపంబు చల్లాఱగాఁ
బరమానందత వీరశైవు లచటం బ్రజ్ఞావిశేషంబునన్. 316

భక్త మాహేశాది ప్రథితస్థలంబుల
నారోహణావరోహతఁ దనర్చి
ఇష్టంబు ప్రాణంబు నేకమై దనరార
గురులింగ జంగమగురు కటాక్ష
లసదీక్షలను నాఱు రసములఁ జెలువొందు
నాచార ముఖ్య లింగార్పణముల
సర్వ జగద్వస్తు సంఘాత మర్పించి
పరశివైక్యానంద పదము నొంది
వీరశైవులు శివపూజ వివిధగతులఁ
జేయుదురు త్రికూటాద్రీంద్ర సీమయందు
తన్మహాత్వంబు వర్ణింపఁ దరముగాదు
కమల గర్భునకైన నిక్కంబుగాను. 317

పీఠములమీఁద లింగముల్ వెట్టి భక్తిఁ
బూజసేతురు కోటీశమూర్తు లనుచు
పూర్వశైవులు నవబిల్వ పుష్పసమితి
శంభు సాహస్రనామముల్ చదువువియతి. 318

బ్రాహ్మణాంత్యజకులము లేర్పఱుప రాక
యుండ నక్కొండదండ నఖండ దీప

వితతిఁ గూర్తురు శివరాత్రివేళ, రాత్రి
రాత్రి యని తోఁచ దా దీపరాజిచేత. 319

కోటీశుం బరమున్ గిరీశు నభవున్ ఘోరార్తి సంహారకున్
జూటన్యస్థేందుకలాకలాపు గిరిశుం జూడంగ నేతెంచి య
ప్పాటం గృత్యములన్నియున్ విడిచి హృద్వ్యాపారశూన్యంబుగాఁ
బాటిన్ నిల్తురు యోగు లచ్చటను శుంభల్లింగ లీనాత్ములై. 320

ఒక్కొక్క ప్రభకడ నుత్సవ
మక్కజముగఁ జూడఁ గాల మరిగిన జనమిం
కెక్కడ నీప్రభ లన్నియు
నక్కట! జూడంగగలమె యని చింతిలుచున్. 321

ఒక ప్రభముందట న్నిలిచి యుత్సవముంగనుఁగొంచునుండ వే
ఱొక ప్రభరాఁ దదుత్సవము నొప్పఁగజూచెదునంతలో ప్రభా
నికరము నాల్గుదిక్కులను నిల్చినఁ జూడ నశక్యమౌటచే
నకట సహస్ర లోచనము లబ్బినఁ జూతుమటందు రజ్ఞనుల్. 322

ఇట్టి యుత్సవ మొకదినం బెంచిచూడ
వచ్చు నొక యేటికిని బంచివైచిరేని
దిన దినోత్సవమైయుండు దెలియఁజూడ
వచ్చునని యెంతు రచటికి వచ్చు నరులు. 323

ప్రభకు నొక్కొక్కలింగ మేర్పడగనుండు
నూటి వీక్షించి యీప్రభాకోటి కెల్ల
నీశుఁడగుటను శివుడు కోటీశనామ
మొందెనని యెంతు రచ్చటనుండు జనులు. 324

మఱియు నీ మహోత్సవాడంబరం బీక్షించి యధిష్ఠాన బ్రహ్మ సాన్నిధ్యం
బున సృష్టి కాలంబున బహు విచిత్రంబగు జగంబు ప్రకాశించి విలయ

కాలంబున నధిష్ఠానంబగు బ్రహ్మంబే నిలిచినట్టు లీ నగేంద్ర సన్నిధి శివరాత్రి కాలంబున ననేక విచిత్రోత్సవం బేర్పడి మఱునాఁ డేమియు లేక యున్నగం బొక్కటియ నిల్చు టాశ్చర్యంబని యంచు బ్రహ్మవిన్నికాయంబును, చిత్రకూట స్నానంబున సితాసిత పీతారుణ ప్రభావిభవం బేర్పడుట సహజంబె కావున నీ త్రికూట స్నానంబునందును సితాసిత పీతారుణ ప్రభావం బేర్పడెనని యంచు యోగి నికురంబంబును, దేవతా వాసంబున నానావిధ భోగంబులు గల్గు టుచితంబగుట నీ దేవతావాసంబునందును నానావిధ భోగంబులు గల్గెనని తలంచు కర్మఠ సమూహంబును నిత్య సుమనోమోదమంజు లతారూఢ నిలయంబుల సకల విషయ పదార్థానుభవ సుఖంబులం దృప్తిగాంచిన ట్లచ్చట నిత్య సుమనోమోదమంజు లతారూఢ నిలయంబుల సకల విషయ పదార్థానుభవ సుఖంబులం దృప్తిగాంచి క్రీడించు భక్త నికరంబును గల్గి, యమ్మహోత్సవం బవాఙ్మానస గోచరంబై పరమానందంబు నొందించు నెంతయు. 325

గుడిచుట్టుఁ బూల తోఁటలు
కడువేడుక నిల్పిరేని కైలాసమునన్
దడవు వసింతురు శంకరు
కడఁ బ్రమథులఁ గూడి భోగకలితాకృతులై. 326

గుడిచుట్టు దమకుఁ దా నెడనెడ మొలిచిన
మారేడు చెట్లులు క్రూరు లగుచు
నఱికిన దుర్జనుల్ నష్టాత్ములై ఘోర
నరకకూపంబుల బొరలుచుందు
రిహమందు దారిద్ర్య మేచఁగా బహుతాప
దల బొంది మూఢులై పొలియుచుందు
రటులౌట కోటీశ్వరాలయ ప్రాంతంబు
నందు బిల్వతరులు నన్యతరువు

లైన నఱికిన దద్దోష మధిక మగుచు
బ్రహ్మహత్యా సహస్రమై పరగుచుండు
నమ్మహాస్థల మహిమంబు నరయవశమె
ధాతకైనను కుండలి నేత్రకైన. 327

## ఆశ్వాసాంతము

భూరాజ ద్రథ మేరుకార్ముక మహాభూతాధినాథా మహా
ఘోరాఘస్మృతి పృష్ఠభాగ చరణా గోరాజ రాజధ్వజా
సారోదార భుజాగ్రశూల హతరక్షస్సంగ గంగాధరా
గౌరీనాయక చంద్రచూడ త్రిజగత్కల్యాణ సంధాయకా ! 328

మునిజన హృదయాంభోరుహ
వనజాప్తాకార వేద వర్ణిత చరితా
జననాంత దూర చిన్మయ
మనసిజ మదహరణ భక్త మంగళకరణా ! 329

*మాలిని :*

జలధికృతనిషంగా జహ్ను కన్యానుషంగా
కలికలుష వినాశా గర్వితారాతినాశా
బలభిదుపల కంఠా భక్త లోకోపకంఠా
విలసదమలబోధా విశ్వలోకైకనాథా !! 330

ఇది శ్రీమద్దక్షిణామూర్తి కటాక్షవీక్షాసంప్రాప్తోభయభాషా కవిత్వ వైభవ సచ్చిదానందాఖండస్వరూప రాజయోగానందానుభవ శ్రీమదుత్తర శైవసిద్ధాంత ప్రబోధిత షట్స్థలాధ్వానుగత పరమ శివైక్యానందానందిత మనీషా విశేష ప్రభావ సకల విద్యానిధాన కొప్పరాజనంతార్యపౌత్ర లింగన ప్రధానపుత్ర సుజనవిధేయ నృసింహనామధేయ ప్రణీతంబైన చిదంబర నటన తంత్రోక్త శ్రీమత్త్రికోటీశ్వర స్థలపురాణంబను మహాప్రబంధమునందు సర్వమ్మనుం దృతీయాశ్వాసము సంపూర్ణము.

# అష్టోత్తర శతనామావళి - ౧

ఓం శ్రీమత్త్రికూటభూమీధ్ర
విష్ణుశృంగనికేతనాయనమః
పాపఘ్నాయనమః
పార్వతీనాథాయ
ఫాలనేత్రాయ
పరాత్పరాయ
కీనాశగర్వనిర్వాణాయ
కరుణామృతసాగరాయ
కందర్పమదవిధ్వంసాయ
కమలాక్షీపూజితాయ
దక్షాధ్వరహవిర్భోజి దేవా
ఘౌఘవినాశనాయ ౧౦
దానవధ్వంసకాయ
దేవాయ
దరహాసముఖాంబుజాయ
దేవదేవాయ
మహాదేవాయ
కాలకంఠాయ
దిగంబరాయ
చంద్రార్ధశేఖరాయ
శంభవే
శూలపాణయే ౨౦
మహేశ్వరాయ
గంగాధరాయ
గణాధీశాయ
నందికేశ్వరవాహనాయ
నారదాదిమునిస్తుత్యాయ
నాగాభరణభూషితాయ

ఓం ఈశ్వరాయ
శివాయ
ఈశానాయ
బ్రహ్మార్చితపదాంబుజాయ ౩౦
కైలాసశిఖరావాసాయ
పరాయ
పాపనికృంతనాయ
పాకారిపూజితాయ
పాశధరాయ
భక్తవరప్రదాయ
అద్భుతాగ్రాయ
పశుపతయే
దక్షయజ్ఞవినాశనాయ
ధూర్జటయే ౪౦
వామదేవాయ
స్రష్ట్రే
సర్వసుఖప్రదాయ
ప్రభవే
తత్పురుషాయ
బ్రహ్మణే
సద్యోజాతాయ
కపాలభృతే
అఘోరాయ
వహ్నినేత్రాయ ౫౦
విశాలాక్షాయ
వరప్రదాయ
కృత్తివాససే
క్రతుచ్ఛేత్రే

ఓం భర్గాయ
భీమాయ
పినాకభృతే
మేరుచాపాయ
విరూపాక్షాయ
భిక్షుకాయ ౬౦
మూలకారణాయ
శిపివిష్టాయ
మృడాయ
శూలినే
ఆధారాయ
సదాశివాయ
సర్వేశ్వరాయ
స్వరాజే
సర్వాత్మనే
సర్వసాధకాయ ౭౦
సేతవే
సర్వనిధయే
సోమాయ
శాస్త్రయోనయే
శుభావహాయ
అనంగాయ
పురుషాయ
పూర్ణాయ
పురాణాయ
పరమేశ్వరాయ ౮౦
సత్యానందాయ
నిర్వికారాయ
నిర్గుణాయ
నిరంజనాయ

ఓం ఆకాశాయ
ఆస్తికాయ
జ్యోతిషే
చిదాభాసాయ
స్వయంప్రభాయ
మృత్యుంజయాయ ౯౦
మృగధరాయ
శంకరాయ
త్రిగుణాత్మకాయ
శివంకరాయ
చిదానందాయ
నిత్యానందాయ
నిరామయాయ
ప్రజాపతయే
పరంధామాయ
భువనేశాయ ౧౦౦
సభాపతయే
సులభాయ
స్థూలసూక్ష్మాత్మనే
సర్వరక్షణదీక్షితాయ
స్మృతత్రికూటవరదాయ
సర్వలక్షణలక్షితాయ
తత్రత్యద్రోణికానీరస్నాన
మాత్రాఘకృంతనాయ
భక్తదారిద్ర్యవిపినదవీ
భూతాగ్నిలోచనాయ
తచ్ఛైలశిఖరాగ్రస్థ యోగి
బృంద నిషేవితాయ
ఎల్లమందాద్రి సంస్థానప్రభవే
పాపవినాశనాయనమః ౧౦౮

# అష్టోత్తర శతనామావళి - ౨

ఓం ఓంకార వార్ధి శీతాంశవేనమః
ఓంకార బిస పంకజాయ
ఓంకార పంజరశుకాయ
ఓంకారాచల కేసరిణే
ఓంకారమంత్ర సంవేద్యాయ
ఓంకారాలయ సంస్థితాయ
ఓంకార పద్మినీహంసాయ
ఓంకార వరకుంజరాయ
నగరాజసుతాజానయే
నగరాజధనుర్ధరాయ ౧౦
నవభూతి విలిప్తాంగాయ
నాగాభరణభూషితాయ
నాదామృతరసాస్వాదాయ
నాదబ్రహ్మస్వరూపకాయ
నాదాతీతాయ
నాదపరాయ
నాదమూలనివాసకాయ
నాగాజినధరాయ
నాదనాదినే
నాదైకగోచరాయ ౨౦
నతార్తి తిమిరార్కాభాయ
నానాభక్తజనావనాయ
నారదాదిమునిధ్యేయాయ
నయవేదినే
నరప్రియాయ
నామరూపపరిత్యక్తాయ
నారాయణసుపూజితాయ
మోహాంధకారతరణయే

ఓం మోహకాంతార పావకాయ
మోహాబ్ధికుంభసంభూతాయ ౩౦
మోహానలమహాంబుదాయ
ముగ్ధేందుభూషణాయ
ముగ్ధాయ
ముగ్ధావామాంగసుందరాయ
మూలమాయాపమాపక్తాయ
మూర్తిమత్కల్పపాదపాయ
కోటీశాయ
కోమలాకారాయ
కోటిసూర్యసమప్రభాయ
కోటిబ్రహ్మాండ పంచారాయ ౪౦
కల్పితాఖిల విష్టపాయ
కుధరేశ్వరమధ్యస్థాయ
కుండలీశ్వరకుండలాయ
కపాలభృతే
కృత్తివాససే
కాలకాలాయ
కకుప్పతయే
కపర్దినే
కామదుహే
కామినే ౫౦
కామదాయ
కామనాశనాయ
కామేశీవల్లభాయ
కాంతాయ
కాంతేందూపలభాకృతయే
కేవలాయ

ఓం కేశవారాధ్యాయ
కేశాంతరసురాపగాయ
కీనాశగర్వనిర్వారిణే
కృపాళవే ౬౦
కృపణార్చితాయ
కైతవాసురసంహర్త్రే
కలికల్మషనాశనాయ
కాలకంఠకళామూర్తయే
కల్పాంతనటనోత్సుకాయ
కల్యాణదాయినే
కల్యాణాయ
కల్యాణాచలకార్ముకాయ
కాలరూపాయ
కాలనేత్రే ౭౦
కాలాతీతాయ
కలస్వనాయ
టీకాకారాయ
జ్ఞానరాశయే
టంకాయుధసముజ్జ్వలాయ
టంకారజ్యాసమాసక్తాయ
మహాజగవశోభితాయ
టంకతుల్యజటాయుక్తాయ
టిప్పణీకృతసచ్ఛ్రుతయే
శశ్వద్భానుసహస్రాభాయ ౮౦
శుంభత్పావకలోచనాయ
శతానందసమారాధ్యాయ
శక్రాదిసురసేవితాయ
శివాయ

ఓం శాంతాయ
శశధరాయ
శర్వాయ
శక్తాయ
శ్రితావనాయ
శూలపాణయే ౯౦
శుభావాసాయ
శుచిదాయ
శుద్ధవిగ్రహాయ
శంకరాయ
శోభనాయ
శుద్ధాయ
శమితార్తయే
శివప్రదాయ
రాజతాచలశృంగస్థాయ ౧౦౦
రతిరాడ్దర్పసంహరాయ
రామార్చితపదద్వంద్వాయ
రక్షితాఖిల చేతనాయ
రజనీచరసంహారిణే
రసారథవిరాజితాయ
యక్షేశమిత్రాయ
యోగీశాయ
యమిహృత్పద్మభాస్కరాయ
యమాదియోగ సంజాతవిజ్ఞాన
సులభాకృతయే
ఎల్లమంద మహాద్రీంద్ర శృంగ
రంగన్నికేతనాయనమః

